భారతీయ సాహిత్య నిర్మాతలు

# తారాశంకర్ బంద్యోపాధ్యాయ

ఆంగ్ల మూలం:
మహాశ్వేత దేవి

అనువాదం:
ఎస్. ఎస్. ప్రభాకర్



సాహిత్య అకాడెమి
న్యూఢిల్లీ

# ప్రకరణము 1

తారాశంకర్ బంధ్యోపాధ్యాయ పశ్చిమ బెంగాలు రాష్ట్రము, బీర భూమి (వీరభూమి) జిల్లా, లాభపూరు గ్రామములో 1898 వ సంవత్సరము జులై నెల 25 వ తేదీన జన్మించారు. వారి తండ్రి శ్రీహరిదాస బంధ్యోపాధ్యాయ, తల్లి శ్రీమతి ప్రభావతి దేవి. ఆయన వారి కుటుంబములో ప్రథమ సంతానము. ఆయనకు ఇద్దరు తమ్ముళ్లు, ఒక చెల్లెలు.

పురాణాలలో కూడ లాభపూరుకు ప్రఖ్యాతి వుంది. ఈ గ్రామానికి "అట్టహాస" అనే పేరు వుండేది. ఈ అట్టహాస సతీదేవి శరీరము ఖండ ఖండములుగా భూమిపై పడిన పీఠ ప్రదేశాలలో ఒకటి అని స్థలపురాణముల ద్వారా తెలుస్తుంది. లాభపూరులో "శక్తి" మతస్థులు, వైష్ణవ మతస్థులు ప్రబలముగా వుండేవారు.

బెంగాలులోని తక్కిన జిల్లాలవలె బీరభూమి జిల్లా కూడా జానపద సంగీత సంపదతో విరాజిల్లేది. తన చిన్నతనములో తారాశంకర్ 'బౌలు', వైష్ణవ, శక్తి శాఖలకు చెందిన పాటగాళ్ళ పాటలు వింటూ మేలుకొనేవాడు. ఈ దాసరులు ఇంటింటికి భిక్షాటనకై వచ్చేవారు. గ్రామస్థులు ఎవరూ వారికి కొద్దో గొప్పో ఇవ్వకుండా వుండేవారు కాదు. మహమ్మదీయ భక్తులు మహమ్మదీయ పీర్లపైనే కాకుండ హిందూదేవతలపైన కూడ భక్తి గీతాలు పాడేవారు. బీరభూమి జిల్లాలోని ప్రజలు ఎల్లవేళల మత సామరస్యముతో నివసిస్తూండేవారు. మహమ్మదీయ మతమునకు చెందిన "పాట్వాలు" అనే సంచారజాతి ప్రజలు ఆప్రాంతాలలో తిరుగుతూ వుండేవారు. వారు చేతితో లిఖించిన చిత్రపటములను తీసుకువచ్చి ప్రదర్శిస్తూండేవారు. ఆ పటములలో శ్రీకృష్ణుని లీలలు, గౌరాంగ ప్రభువు జీవిత గాథ చిత్రింపబడి వుండేది. ఇక్కడి పాములవాళ్లు కూడ మహమ్మదీయ మతస్థులే. వీరిలో పురుషులు

అత్యంత సౌందర్యవంతులు. వీరి స్త్రీలు ఎవరిని లక్ష్యము చేయని ప్రియులే కాక, మంచి నైపుణ్యము కలిగిన నర్తకీమణులు కూడ. వీరు కాక సర్కసు వాళ్లు కూడ వచ్చేవారు. వాళ్లు యువకుల హృదయాలను అవలీలగ దోచు కునేవారు. ఈ సంచార జాతికి చెందిన స్త్రీలు ప్రేమపసరులు అద్భుతశక్తి కలిగిన మందులు, మాకులు అమాయకులైన గ్రామస్థులకు అమ్మేవారు. వారిలో పురుషులు కుందేళ్ళను, అడవి బల్లులను, అడవి పందులను వేటాడేవారు.

ఆగ్రామములో చిన్న, పెద్ద జమీందారులు ఉన్నతవర్గానికి చెందిన వారు. అందులో కొందరు బొగ్గుగనులను కొని ధనవంతు లయ్యారు. కాని పేద ప్రజలు మాత్రము గర్భదరిద్రులుగానే వుండిపొయ్యారు. ఆ రోజుల్లో జీవిత వ్యయ ప్రమాణము ధనికవర్గానికి చాల తక్కువగా వుండేది. ఈ విషయాన్ని ముచ్చటిస్తూ తారాశంకర్ ఇలా అన్నారు : "సంవత్సరానికి నాలుగైదు వేల ఆదాయముతో (ఒక చిన్న జమీందారి ఆదాయము ఆరోజుల్లో ఆ మాత్రము వుండేది) ఎవరైన ఆ కాలములో మహారాజులా బ్రతకవచ్చు. నెలకు డెబ్భై అయిదు పైసలకు ఆకుకూరలు అన్నీ దొరికేవి. వారానికి రెండు పర్యాయములు జరిగే సంతలో అయితే ముప్పైయేడు పైసలకే అన్నీ లభిం చేవి. ఇంటిలో నౌకరుకి నెలకు రూపాయిన్నర జీతము. తరిఫీదు అయిన నౌకరుకైతే రెండు రూపాయలు. ఆడ వంటమనిషికి రెండు రూపాయలు రెండున్నర రూపాయలు, మగ వంటమనిషికైతే మూడు రూపాయలు, మూడున్నర రూపాయలు లభించేవి.

సాంప్రదాయమునకు చెందిన పాతకాలపు జమీందారి కుటుంబాలకు కొత్తగా ధనవంతులైన బొగ్గుగనుల వ్యాపారస్థులకు మధ్య అంతర్స్పర్థలు వుండేవి. ఈ వ్యాపారస్థులలో చాలమంది వైష్ణవులు. జమీందారి కుటుంబ ముల వారు శక్తి శాఖీయులు. ఈ స్పర్థలవలన చిన్నచిన్న విషయాలలో కూడ తగాదాలు, పోటీలు తప్పేవి కావు. ఏ ఆలయానికైన మరమ్మతులు చేయవలసి వచ్చినప్పుడు, ఏ చెరువులోని మెట్లనైన బాగుచేయవలసినప్పుడు ఆ బాధ్యత ఎవరు తీసుకోవాలి, అనే విషయములో స్పర్థలు వచ్చేవి. అట్లాగే పిల్లలకు పాఠశాల నిర్వహించుటలోను, ఉన్నత పాఠశాలకు చేయవలసిన ఆర్థిక సహాయము విషయములో కూడ భేదాభిప్రాయములు తలయెత్తేవి. మత సంబంధమైన పండుగలను నిర్వహించుటలో కూడ ఒక వర్గాన్ని మించి

ఇంకొక వర్గమువారు ప్రయత్నిస్తూండేవారు. ముఖ్యముగ బాణసంచా కాల్చుటలోను, నాటకప్రదర్శనాలలోను ఈ పోటీలు తీవ్రముగ వుండేవి. లాభపూరులో అనాదిగ పటిష్ఠమైన నాటక సాంప్రదాయము వుండేది. విద్యుద్దీపాలతో, అన్ని హంగులతో సర్వాంగసుందరమైన ఒక రంగస్థలము కూడ వుండేది. పేరుపడ్డ "యాత్రా" నాటక సంస్థలు ఆ గ్రామములో నాటక ప్రదర్శన లివ్వటానికి వస్తూవుండేవి.

స్థూలముగా ఆనాటి సాంఘిక పరిస్థితులు అవి. ఆనాటి ప్రజల స్వభావ స్వరూపాలు అటువంటివి ఎఱ్ఱగా బీడువారిన బీరభూమిలోని నేల, అహర్నిశలు పరవళ్లు త్రొక్కే "కోపాయ్" నది తారాశంకర్ జీవితములో ప్రముఖపాత్రను వహించాయి. హిందూమతము ప్రగతి పథములో పురోగమిస్తూండగ ఇంకా మిగిలివున్న ఆదిమకాలపు మత దురాచారాలు, బాధతో కేకలువేస్తూన్న దెయ్యాలను జ్ఞప్తికి తెచ్చే గాలిదుమారాలు, ఎండి బీడైన నేలకు ఉపశమనము, నదులకు నీటితోపాటు వరదలను ప్రసాదించే వర్షాకాలపు ఆగమనము - ఇవి తారాశంకర్ పరిశీలించిన, అనుభవించిన జీవిత సత్యాలు. ఇవన్నీ మనకు ఆయన నవలలలో ప్రత్యక్షమవుతూ వుంటాయి. ఆయన తొలి రచన "చైతాలిఘూర్ని" (చైత్రఝంఝ) నుంచి ఆయన మరణానంతరము ప్రచురించబడిన "శతాబ్దిర్ మృత్యు" (ఒక శతాబ్ది అంతరించింది!) వరకు ఆయన రచనలో తనకు పరిచితమైన నేలను, మట్టిని, ప్రకృతిని, ప్రజలను సునిశితముగ పరిశీలించి, వానికి సాహిత్య స్వరూపాన్ని కలిగించారు.

ఆయన తండ్రి హైస్కూలు చదువు కూడ పూర్తిచేసినవారు కాదు. ఆయన స్వయముగా ఎన్నో గ్రంథములను చదువుకున్నారు. ఆయనవద్ద మంచి గ్రంథాలయ ముండేది. ఆయన వివిధరకములైన పత్రికలను వార్తా పత్రికలను కూడ తెప్పించుకునేవారు.

ఆయన తండ్రి నడివయసులోనే మరణించారు. అప్పటికి తారాశంకర్ వయసు ఎనిమిది సంవత్సరాలు. ఆయన తల్లి పాట్నాలోని ఒక విద్యాధిక కుటుంబానికి చెందినది. ఆ రోజుల్లో సనాతన సాంప్రదాయస్తులు ఇంగ్లీషు విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించేవారు కాదు. కాని ఆయన తల్లివైపువారు ఇంగ్లీషు విద్యాభ్యాసములో చాల ముందడుగు వేశారు. ఈయనపై తన తల్లిప్రభావము ఎక్కువగా వుండేది. ఒడుదుడుకులతో అస్తవ్యస్తముగా వున్న

కుటుంబపరిస్థితులను అతి నైపుణ్యముతో చక్కదిద్దిన తన తల్లి అంటే తారా శంకర్‌కు అమితమైన గౌరవము. తారాశంకర్ అత్త కూడ వీరింటిలోనే వుండేవారు. ఆమె తన భర్తను, కుమారుని కోల్పోయి వీరింటికి ఆశ్రయము కోరుతూ వచ్చారు. ఆమెకు తారాశంకర్‌పై అపారమైన ప్రేమ వుండేది. తారాశంకర్ మనోవికాసానికి ఈ ఇరువురు స్త్రీలు ఎక్కువ దోహదము చేశారు. ముఖ్యముగ. మంచి, చెడుల విషయములలో వారి ఖచ్చితమైన అభిప్రాయాలు, ఉన్నతస్థాయికి చెందిన నైతిక ప్రమాణాలు ఈయనపై ప్రగాఢమైన ముద్రవేశాయి.

ఆయన తల్లి తనతోపాటు కొన్ని ముఖ్యమైన మార్పులను వీరి కుటుంబములోనికి తీసుకుని వచ్చారు. ఆమె కథలను కడు రమ్యముగా చెప్పేవారు. ఆయన పెక్కు రచనలలో మనకు గొప్ప కథకురాళ్లు కనిపిస్తారు. ముఖ్యముగా "గణదేవత", "పంచగ్రామ" అని నవలలో మనకు కన్పించే "న్యాయరత్న" అనే పాత్ర పేర్కొనదగినది. ఆయన తల్లివైపువారు దేశభక్తులుగ ప్రసిద్ధికెక్కారు. ఆమె సోదరులు ఆనాటి జాతీయోద్యమములో పాల్గొన్నారు. 1905 వ సంవత్సరములో కర్జను బెంగాలును విభజించిన విషమ ఘడియలలో తారాశంకర్ మామయ్య తన చెల్లెలు చేతికి రక్షా బంధనము కట్టాడు. ఆమె కూడ తన కుమారుని చేతికి రక్షాబంధనము కట్టినది. అప్పటికి తారాశంకర్ వయసు చాల తక్కువ.

తన తండ్రి మరణము, తన తల్లి ఆత్మస్థైర్యము, ధైర్యము తన అత్త అపారమైన ప్రేమ - ఇవి అన్నీకూడ సంపూర్ణముగ "ధాత్రీదేవత" అనే నవలలో చిత్రించబడ్డాయి.

సాధారణముగ, జమీందారీ వర్గానికి చెందినవారు అతి వ్యయానికి అలవాటుపడతారు. పైగా, తాగుడుకు దాసులు. శక్తికి మించిన ఆడంబరాలకు విలాసాలకు కూడ అలవాటు పడినవారు. అయినా, వారి వ్యక్తిగత, సాంఘిక ప్రవర్తనలు ఉన్నతముగ వుండేవి. చివరివరకు తారాశంకర్‌కు వారిపై అత్యంత అభిమానము, సానుభూతి వుండేవి. అయితే, ఆ వ్యవస్థలో కనిపించే వ్యసనాలను, దురాచారాలను ఆయన తన రచనలో తీవ్రముగ విమర్శించారు. మతాచారములు, నియమములు పాటించుటలో జమీందారులకు మంచి ఆసక్తి వుండేది. మతాభినివేశము, ఆస్తికదృష్టి తారాశంకర్ కుటుంబములో కూడ దృఢముగా వుండేవి. మంచి చెడుల మధ్య. తప్పొప్పుల మధ్య

నిర్దిష్టమైన విభజన వుండేది. తప్పు తప్పుగాను, ఒప్పు ఒప్పుగాను నిర్మోహ మాటముగ నిర్ణయింపబడేవి. సంఘములోని ఎక్కువమంది ధనవంతులు చేసినప్పటికి తప్పు ఎన్నటికి ఒప్పు కాజాలదు. ఈ విశ్వాసముల వాతావరణములో తారాశంకర్ పెరిగి పెద్దవారయ్యారు. తరుణవయస్కులయేటప్పటికి ఆయనలో ఈ విశ్వాసములు, విలువలు ప్రగాఢముగా ఏర్పడ్డాయి. ఆయన మానసిక ప్రవృత్తిని, ఆలోచనా, సరళిని మలచుటలో ఆనాటి ప్రజలు, ప్రకృతి సాంఘిక, కుటుంబ పరిస్థితులతోపాటు బలీయమైన మతాభినివేశము, పరమాత్మయందలి విశ్వాసము ముఖ్యమైన పాత్ర వహించాయి.

# ప్రకరణము 2

బాల్యము యౌవనావస్థలోనికి అడుగుపెట్టే సున్నితమైన తరుణములో తారాశంకర్ నళిని బాగ్చి అనే ప్రఖ్యాత యువ విప్లవకారుని కలుసుకోవటం తటస్థించింది. నళినబాగ్చి ఈయనలో రాజకీయోత్తేజాన్ని రేకెత్తించారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో మన విప్లవవాదులు రెండు విధములైన కార్యక్రమములపై తమ దృష్టిని కేంద్రీకరించారని అందరికీ తెలిసిన విషయమే! వీటిలో సైన్యాన్ని తిరుగుబాటుకై ప్రోద్బలం చేయుట మొదటిది. రెండవది, జర్మనీ దేశమునుండి ఆయుధాలను సంపాదించి, ''బాఘాజతీన్'' అని పేరుపడిన జితేంద్రనాథ్ ముఖర్జీ వంటి నాయకుల ఆధ్వర్యమున బ్రిటిషు వారితో యుద్ధానికి దిగటం. ఈ రెండు విధానాలు ఆశించిన ఫలితాలను సాధించలేకపోయాయి. ఈ హింసావాదులలో కొందరు విప్లవము చేస్తూనే అసువులు కోల్పోయారు. మరికొందరు దీర్ఘకాలపు శిక్షను అనుభవించుటకు కారాగారాల పాలయ్యారు. మిగిలినవారు ఉరిశిక్షలకు పాత్రులయ్యారు.

1916 వ సంవత్సరములో తారాశంకర్ లాభపూరులోని జాదవలాల్ ఉన్నతాంగ్ల పాఠశాలలో మెట్రిక్యులేషను పరీక్షయందు ఉత్తీర్ణులయ్యారు. తరువాత కలకత్తాలోని సెంట్ జేవియర్ కళాశాలలో ప్రవేశించారు. కాని రాజకీయ అనుమానితుల జాబితాలో ఆయనపేరు వున్నదనే

కారణమువలన ఆయన అక్కడ చదువు చాలించుకోవలసి వచ్చింది. ఈ రోజుల్లో అసుతోష్ కాలేజి అని పిలువబడుచున్న సౌత్ సబర్బన్ కాలేజిలో ఆయన కొద్దిరోజుల తరువాత చేరారు. అయితే ఈసారి అనారోగ్య కారణము వలన ఆయన చదువుకు స్వస్తిచెప్పవలసి వచ్చింది.

విప్లవ కార్యక్రమాలలో కొంత తాత్కాలిక స్తబ్ధత తరువాత 1921 వ సంవత్సరములో ఈ కార్యక్రమాలు ఒక నూతన ఉత్తేజాన్ని పుంజు కున్నాయి. మహాత్మాగాంధి ప్రతిపాదించిన అహింసాత్మక సహాయ నిరాకర ణోద్యమము ఈయనను అమితముగ ఆకర్షించింది. ఆయన స్వీయచరిత్రల వంటి రచనల ద్వారా తారాశంకర్‌కు దేశసేవపై అభిమానము ఎక్కువని తెలుస్తుంది. కాని ఆయన ఎప్పుడూ ఏ వర్గానికిగాని, ఏ దౌర్జన్యవాదుల ముఠాకిగాని చెందినవారుకాదు. నిజానికి, దౌర్జన్యవాదులతో ఆయన ప్రత్యక్ష సంబంధము బహుస్వల్పము. ఆయన స్వీయచరిత్ర అని చెప్పదగిన "ధాత్రీ దేవత" అనే నవలలో ఆయన రాజకీయాభిప్రాయాలు మనకు స్పష్టముగా తెలుస్తాయి.

భారతదేశములోని దౌర్జన్యవాదుల హింసాత్మక విధానాలను తారా శంకర్ ఏనాడు విశ్వసించలేదు. "కల్లోల్" అనే రచయితల వర్గము గురించి వ్రాస్తూ "నేనెప్పుడూ విప్లవ వాదిని కాను" అని స్పష్టీకరించారు. రాజకీయములలో ఆయన ఆసక్తి ముఖ్యముగ భావనాసంబంధమైనది. ఆ ఆసక్తి క్రమేణ సాహిత్యాభిమానముగ పరిణమించింది. తన మనసును కలచివేస్తూన్న అనేక సందేహాలకు గాంధీజి సిద్ధాంతాలలో ఆయనకు సంతృప్తి కరమైన సమాధానాలు దొరికాయి. రాజకీయ స్వాతంత్ర్యము మానవుని సంపూర్ణ స్వతంత్రునిగా చేయలేదు. మూఢవిశ్వాసాలకు, దురాశకు, అజ్ఞా నానికి, సంకుచితత్వానికి బానిసగా ఉన్నంతవరకు ఏవ్యక్తి సంపూర్ణ స్వతంత్రుడు కాలేడు. భారతదేశములోని అసంఖ్యాక ప్రజానీకాన్ని కేవలము రాజకీయ స్వాతంత్ర్యమే పూర్తి స్వతంత్రులుగా చేయజాలదు. ఆ ప్రజ దారిద్ర్యమునుండి, దోపిడీ విధానమునుండి, అనారోగ్యమునుండి, అజ్ఞానమునుండి "కర్మ" సిద్ధాంతమునుండి విముక్తము చేయబడాలి. ప్రజల కష్టసుఖములపై ఆయన ఆసక్తి తారాశంకర్ మనసును ఆయన తుదిక్షణ ములవరకు దృఢముగా వుండేది.

తన జీవితకాలములోనే తారాశంకర్ మహారచయితగ ప్రశంసింప బడ్డారు. ఆయన మహారచయిత అని చెప్పటానికి ఈ లక్షణాలు కారణాలని చెప్పవచ్చును. ప్రజల కష్టములపై ఆసక్తి, ఆ కష్టాలలో వారిని ఆదుకోవాలనే అభినివేశము, అభిమానము అందుకోసమై వారి జీవితాలను చిత్రిస్తూ మాటి మాటికి సానుభూతితో రచనలు చేయటం ముఖ్యమైన లక్షణాలు. వాస్తవానికి ఆయన నమ్మినది రాజకీయ సిద్ధాంతాలను కాదు. అనంతప్రజావాహిని ఆయనకు మార్గదర్శిని.

పరిపూర్ణ మానవీయత ఆయన ప్రగాఢ విశ్వాసము. ఆయన ముఖ్యమైన నవలలలోని నాయకులు ఆదర్శప్రాయులైన మహనీయ వ్యక్తులు. "జ్ఞానదేవత" "పంచగ్రామ" నవలలలోని "దేవు", "ధాత్రీదేవత"లోని "శివనాథ్" "సాందీపుని పాఠశాల" లోని "సీతానాథ్" వంటివారు ఈ కోవకు చెందుతారు.

పరిపూర్ణమైన వ్యక్తి తనవ్యక్తిగత, సాంసారిక, సాంఘిక, రాజకీయ బాధ్యతలను విస్మరించడు. ఒక ఉన్నతాదర్శమును తనముందు నిలుపుకొని ఆ ఆదర్శమును చేరుకొనుటకై నిరంతరము కృషి సల్పుతాడు. తన వ్యక్తిగత సుఖాలను మిగిలినవారి సుఖసంతోషాలకై త్యాగము చేయకలుగుతాడు. ఇటువంటి పరిపూర్ణ వ్యక్తిని అందరూ గౌరవిస్తారు! ఎవ్వరో కాని అర్థము చేసుకోలేరు.

అందువలన ఆయన ముఖ్యముగ ఏకాంతజీవిగ మిగిలిపోతారు.

# ప్రకరణము 3

తారాశంకర్ కవి కావాలని ఉబలాట పడుతూండేవాడు. 1920 వ సంవత్సరములో ఆయన బంధు వౌకాయన "త్రిపత్ర" (మూడాకులు) అనే పేర ఆయన పద్య సంపుటిని ప్రచురించారు. అంతకు పూర్వమే జలధరసేన్ సంపాదకత్వములో వెలువడుచున్న ఆనాటి అగ్రశ్రేణి సాహితీ పత్రిక "భారతవర్ష" లో ఆయన తొలి పద్యము ప్రచురింపబడింది. "త్రిపత్ర"

పరిమిత మిత్రులకు, కుటుంబ సభ్యులకు మాత్రమే ఉద్దేశింపబడింది. అందు వలన త్వరలోనే ఆ సంపుటి కాలగర్భములో కలసిపోయింది. తరువాత కాలములో తారాశంకర్ కవిత్వము వ్రాసినది చాల తక్కువ. ఆయనలోని భావుకుడైన కవి ఎల్లప్పుడు సజీవుడుగానే వుండేవాడు. జానపదకవులలో మనకు కనిపించే గురుముఖతః నేర్వని ఆశుకవిత్వ పటుత్వము ఈయనలో కూడ కన్పిస్తుంది. ఈ కవితాశక్తి కవి – గాయకుల వరప్రసాదము. "కబియల్" (కవి – గాయకుడు) అనేవారు గ్రామసీమల్లో పద్యాలను రచించి గానము చేస్తూండేవారు. "కబి" అనే నవల తారాశంకర్‌లోని కవి – గాయక ప్రతిభకు నిదర్శనము. ఈ నవలలో జానపద జీవితము మనోహరముగ వర్ణించబడింది.

లాభపూరులో సనాతనమైన నాటక సాంప్రదాయము కూడ వుండేది. ఆ గ్రామములో ధనిక భూస్వామి అయిన నిర్మలశివ బందోపాధ్యాయ అప్పటికే నాటక రచయితగ, ప్రయోక్తగా మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. ఆయన నాటకాలను కలకత్తాలో కూడ ప్రముఖ నాటక సంఘాల వారు ప్రదర్శిస్తూండేవారు. తారాశంకర్ నాటక రచనలో కూడ కృషిచేయాలని నిశ్చయించుకున్నారు. ఆ రోజులలో ఎక్కువ డబ్బుగా లెక్కపెట్టదగిన పద్దెనిమిది రూపాయలు ఖర్చుపెట్టి గ్రాంటుడఫ్ రచించిన "మహారాష్ట్ర చరిత్ర" మూడు సంపుటాలను కొని పానిపట్టు మూడవ యుద్ధము గురించి నాటకము రచించారు. నిర్మలశివ బంధ్యోపాధ్యాయ ప్రోత్సాహముతో ఆ నాటకాన్ని ఒక నాటక కంపెనీ యజమానికి సమర్పించారు. కాని అతను ఊరు పేరు లేని రచయిత వ్రాసిన నాటకాన్ని చదవటానికి కూడ అంగీకరించలేదు. తారాశంకర్ ఇంటికి తిరిగివచ్చి ఆ నాటకాన్ని అగ్నికి ఆహుతి చేశారు.

ఈ సంఘటన ఆయన్ని బాగా గాయపరచినది. ఆయన ఇంక ఎప్పుడు రచనలు చేయకూడదని శపథము చేసుకున్నారు. ఆ రోజుల్లో ఆయన కాంగ్రెసులో పనిచేస్తూ సమాజసేవక సమితి కార్యక్రమాల్లో నిమగ్నులై ఉండేవారు. ఒక చిన్న తరహా భూస్వామి కావటంవలన ఆయన రాబడి తన కుటుంబపు సామాన్యమైన అవసరాలకు సరిపోయేది.

కొద్దికాలములోనే ఆయన తన నిర్ణయాన్ని విస్మరించి ఒక యువకుని సహకారముతో "పూర్ణిమ" అనే మాసపత్రిక ప్రారంభించారు. ఆ పత్రికలో

ఆయన పద్యాలు, కథలు, పుస్తక సమీక్షలు, సంపాదకీయాలు ప్రచురించారు. సాహిత్యముపై ఆయనకున్న అభిలాషకు ఈ పత్రిక ద్వారా ఒక మార్గము దొరికినది కాని ఆ రచనా వ్యాసంగము ఆయనకు పూర్తి సంతృప్తి నీయలేకపోయినది. ఆ వ్యాసంగము ఆయన మనో ప్రపంచములో ఒక శూన్యాన్ని సృష్టించింది. ఈ పరిస్థితులలో కాకతాళీయముగా ఆయన "కవి-కలం" (సిరా – కలము) అనే పత్రికను చూడటం తటస్థించింది. అందులో రెండు కథానికలు చదివారు. వాటిలో ప్రేమేంద్రమిత్ర రచించిన కథానిక ఒకటి. రెండవది శైలజానంద ముఖర్జీ రచించినది. ఆయన వెంటనే సమ్మోహితు లయ్యారు. ఎన్నో సంవత్సరాలుగా ఆయన కలకత్తా వస్తూపోతూనే ఉన్నారు. కాని ఎందువలననో సాహితీరంగములోని కొత్తపోకడలు, ప్రక్రియలు ఆయనకు ఏమాత్రము తెలియవు. నిజానికి, సాహితీ అభిరుచులలో తాను ఈ రచయితలకు సన్నిహితుడనని గ్రహించారు. ఇంతవరకు ఆయన అనుసరిస్తున్న రచయితలు తనకు నిజమైన మార్గదర్శకులు కాలేరని అభిప్రాయ పడ్డారు. తరువాత ఒక పర్యాయము ఈ విషయాన్ని ముచ్చటిస్తూ, ఈ కథలవలన తాను సమ్మోహితుడయ్యానన్న విషయము నిజమే కాని, ఆ కథలు నేలబారుగా ఉండి భౌతిక విషయాలకే పరిమితమైనవని గ్రహించలేక పోలేదని ఆయన వ్యాఖ్యానించారు.

ఒక పర్యాయము తన జమీందారీలో ఒక గ్రామానికి ఆయన వెళ్లటం తటస్థించింది. అక్కడ ఒక సౌందర్యవతియైన వైష్ణవ యువతిని చూశారు. ఆమెను గురించి "రస కలి" (పాలభాగమున, నాసికపైన, కంఠమున అలదే చందనరేఖ) అనే కథ వ్రాసి ప్రసిద్ధ సాహితీ పత్రికకు పంపించారు. ఎనిమిది నెలలు తరువాత ఆయన కలకత్తా వెళ్ళి ఆ కథ విషయము దర్యాప్తు చేయగా, ఆ కథను అక్కడ వాళ్లెవ్వరు చదవనైన చదవలేదని తెలుసుకున్నారు. విషణ్ణహృదయముతో, అశ్రుభరిత నయనాలతో మధ్య కలకత్తా ప్రాంతమునుండి దక్షిణ కలకత్తా వరకు కాళ్లీడ్చుకుంటూ వెళ్లారు. మరొకసారి, ఇక రచనలు చేయరాదని ప్రతిజ్ఞచేసికొని, తన జీవితాన్ని సాంఘిక సేవాకార్యక్రమాలకు వినియోగించాలని నిశ్చయించుకున్నారు.

లాభపూరుకు తిరిగివచ్చి ఆయన గ్రామ యూనియన్ బోర్డుకు అధ్యక్షులయ్యారు. జిల్లా అంతా సైకిలుమీద తిరిగి ఆ జిల్లా ప్రజలతో కలసిమెలసి జీవించారు. ఈ పర్యటన ఆయనకు గ్రామజీవితాన్ని పూర్తిగా అవగాహన

చేసుకొనుటకు అవకాశము కల్పించింది. వీరభూమి ఎప్పుడు నీటి ఎద్దడికి గురయ్యే జిల్లాయే! దానికి తోడు రెండు సంవత్సరాలుగ కలరా వ్యాధి ఆ జిల్లాలో అమిత ప్రాణనష్టాన్ని కలిగించింది. ఆరు నెలలపాటు తారాశంకర్ ప్రజలకు శుశ్రూషచేసి ఆ భయంకర వ్యాధితో వారి పెనుగులాటలో సహాయము చేసారు. పల్లెప్రాంతాలలో ఈ విస్తృత పర్యటన మూలమున పల్లె ప్రజలలో అన్ని రకముల వారిని ప్రత్యక్షముగ పరిశీలించుటకు అవకాశము కల్గినది. ఈ ప్రజలను యథాతథముగ తమ నవలలలో కథానికలలో తారాశంకర్ చిత్రించారు. ఈ పర్యటన సందర్భములోనే "హన్సూలి బంకర్ ఉపకథ" (కొడవలి వంపు కథ) లోని సుచంద్, నసుబాలలను, "కవి" లోని నితాయి వంటి ఎన్నో పాత్రలతో పరిచయము చేసుకున్నారు.

## కాలచక్రము పరిభ్రమిస్తూంది.

ఆ రోజుల్లో అభ్యుదయ సాహితీవేదికగా ప్రసిద్ధికెక్కిన "కల్లోల్" అనే పత్రిక ముఖపత్రాన్ని తారాశంకర్ ఒక పర్యాయము చూసారు. తన ప్రతిజ్ఞ మరల పక్కకునెట్టి, ఇంతకు పూర్వము ప్రచురణకు ఆమోదింపబడని "రస - కలి" అనే కథను "కల్లోల్" కు పంపించారు.

నాలుగు రోజులు తిరగకుండానే ఆ కథను ఆమోదిస్తున్న లేఖను ఆయన అందుకున్నాడు. ఆకథ ప్రచురించబడిన తరువాత పెక్కుమంది ప్రశంసలకు పాత్రమైనది. ఆ పత్రిక సంపాదకుడు మరొక కథానిక రచించమని ప్రోత్సహించాడు. ఆ కథ కూడ ప్రచురించబడినది. "కలికాలము" అనే మరొక అభ్యుదయ సాహితీ పత్రిక ఈ కథలు అరుదుగా కనిపించే ఉత్తమ కథానికలు అని ప్రత్యేకముగా ప్రశంసించింది. ఈ కథలు 1929లో ప్రచురింపబడ్డాయి.

"కలికాలము", "కల్లోల్", "ఉపాసన", "ధూప్ఛాయ" వంటి ప్రసిద్ధ పత్రికలు ఆయనను కథారచన చేయమని అర్థించాయి. తారాశంకర్ ఈ అవకాశాన్ని సద్వినియోగపర్చుకున్నారు. ఈ రోజుల్లో ఆయన వ్రాసిన కథల్లో "శ్మశానేర్ పథే (శ్మశానానికి దారి) ఒకటి. జమీందారుల దోపిడీ విధానము వలన, స్థానిక వడ్డీ వ్యాపారస్తులతోపాటు కాబూలీ వాళ్ళ వలన, మలేరియా మహమ్మారి రోగములవలన ఆనాటి ప్రభుత్వముయొక్క

దయారహితమైన ఉపేక్షవలన సర్వనాశనమై శ్మశాన సదృశమవుతున్న ఒక గ్రామ చరిత్ర ఈ కథలో ఇతివృత్తము. ఈ కథ ఆయన తరువాత రచించిన "చైతాలీ ఘూర్ని" అనే నవలకు బీజ ప్రాయముగ ఉపకరించింది.

తన స్వంత పనులపై ఆయన కలకత్తా వస్తూండేవారు. ఈరోజుల్లో "కల్లోల్", "కలికాలము" పత్రికల కార్యాలయాలను కూడ దర్శిస్తూండే వారు. ఆయన ఈవిషయాన్ని తమ స్వీయ చరిత్ర "అమార్ సాహిత్యజీబన్" (నా సాహితీ జీవితము) లో ముచ్చటిస్తూ తన రచనలోని ప్రతిభను గుర్తించి ప్రోత్సహించిన మొదటి సాహితీ పత్రిక "కల్లోల్" అన్నమాట నిజమే, కాని ఆ పత్రిక తాలూకు రచయితలతో తమ తొలి సమావేశము ఆనంద దాయకము కాలేదని వివరించారు. వారి సమక్షములో ఆయన చాల ఇబ్బం దిగ ఆ వర్గములో ఇమడలేనివారుగ బాధపడ్డారు. ఆయనకు శైలజానంద పూర్వపరిచితుడే. తక్కిన రచయితలు చాలమంది తరుణవయస్కులై స్వాప్ని కులు తమ పేర్ల చుట్టూ చేరుకున్న ఆకర్షణావలయాన్ని తామే అతిగా ప్రేమించుకుంటున్న అమాయకులు. తారాశంకర్‌కు నాగరక సంఘములతో పరిచయము చాల తక్కువ. ఈ రచయితలు ప్రదర్శించే సొగసైన నిర్ల క్ష్యము, ఆత్మవిశ్వాసము నిజానికి వారి అమాయకత్వానికి పై పై మెరుగని ఆయనకు తెలియదు. ఆయన వారివలె తన యౌవనపు ప్రథమ దశలో లేరు. ఆయన అచ్చమైన పల్లెటూరివాడు. వారు నవనాగరికులు. ఆయన అప్పటికే వివాహితుడే కాక బిడ్డల తండ్రికూడ. ఆ రచయితలు అప్పుడప్పుడే భావాం బర వీధినుండి దిగివచ్చి జీవితము తాలూకు వికృతరూపాన్ని కొద్దిగా తెలుసు కుంటున్నారు. తారాశంకర్‌కు జీవితములోని వికృతత్వాన్ని ఊహించ వలసిన అవసరములేదు. ఆయన జీవితములోని చీకటి కోణాలను స్వయ ముగా దర్శించారు. ఆయన ఈ నవనాగరక రచయితల వర్గానికి చెందనని తెలుసుకున్నారు. ఒక సమావేశముతోనే ఆయన ఆవేశము నీరుకారి పోయింది. ఆయన స్వభావరీత్యా ఆవేశపూరితుడు, సున్నిత హృదయుడు. ఏ భేషజాలు లేని నిష్కపటమైన వాతావరణములోనే స్వేచ్ఛగా విహరించ కలిగిన వారు.

"కలికాలము" సంపాదకుడైన మురళీధర బసు ఆయనను ఎక్కు వగా ఆకర్షించారు. ఈ రోజుల్లోనే ఆయన నృపేంద్రకృష్ణ ఛటర్జీ, దినేష్ దాస్, పవిత్ర గంగూలి, అచింత్యకుమార్ సేన్‌గుప్త, ప్రేమేంద్రమిత్ర,

సరోజకుమార్ రాయ్ చౌధురి, సావిత్రి ప్రసన్న ఛటర్జీ మున్నగు రచయిత లను కలుసుకున్నారు. సావిత్రిప్రసన్న ఛటర్జీ "ఉపాసన" పత్రిక సంపాద కులు. "చైతాలి ఘూర్ని" ప్రచురణలో సహాయపడ్డారు. వీరిలో చాల మంది తారాశంకర్‌కు మిత్రులయారు.

భారతదేశములో 1929 వ సంవత్సరమునుండి అలజడి, ఆందోళన లతో అశాంతి వాతావరణము ప్రారంభమైనది. ఈ అశాంతి పరిస్థితులలో మీరట్ కుట్ర, చిట్టగాంగులో ఆయుధాగారముపై దాడి ముఖ్యముగ పేర్కొన దగినవి. ఉధృతమైన ఈ అశాంతికి మహాత్మాగాంధి సహాయనిరాకరణో ద్యమము ద్వార ఒక మార్గాన్ని చూపించారు. ఈ అశాంతిని, కార్యో న్ముఖము చేయుటకే 1930 వ సంవత్సరము ఏప్రిల్, 6 వ తేదిన డెబ్బయి ఎనిమిది మంది అనుచరులతో దండి యాత్ర ప్రారంభించారు. భారతదేశము లోని లక్షలాది ప్రజలు – వాయువ్య సరిహద్దు పరగణాలనుండి బెంగాల్ లోని మిడ్నపూరువరకు, ఉత్తర ప్రదేశ్‌నుండి బొంబాయి వరకు-మహాత్మా గాంధి పిలుపునందుకొని ఈ ఉద్యమములో ప్రవేశించారు.

మే నెలలో గాంధి అరెస్టు చేయబడ్డారు. జూన్ నెలలో భారత జాతీయ కాంగ్రెసు నిషిద్ధ సంస్థగ ప్రకటించబడింది. పది నెలల కాలములో తొంభై వేలకు పైగా భారతీయులు అరెస్టు చేయబడ్డారు.

1931 వ సంవత్సరములో పశ్చిమ బెంగాలు మిడ్నపూరు జిల్లాలోని హిజ్లి కారాగారములో పోలీసుల కాల్పులవలన ఇద్దరు రాజకీయ నిర్బంధితులు మరణించారు. కలకత్తాలో ఈ సంఘటనను నిరసిస్తూ ఒక బ్రహ్మాండమైన సభ ఏర్పాటు చేయబడింది. ఈ సభలో టాగోరు కూడ ప్రసంగించారు.

తారాశంకర్ కూడ 1930 వ సంవత్సరములో జైలుకు వెళ్ళారు. చెరసాలలో స్వయముగ పరిశీలించిన విషయములవలన దేశములోని రాజ కీయములు అధికారమునకై పెనుగులాటగ మారుతున్నాయని ఆయనకు స్పష్టమైనది. కొందరు నిర్బంధితులు ప్రదర్శించిన రాజకీయ అతిధోరణులు ఆయనను దిగ్భ్రాంతునిగ చేసాయి. జైలులో ఉండగానే "చైతాలి ఘూర్ని," "పాషాణ పురి" అనే రెండు కొత్తనవలలను వ్రాయటం ప్రారంభించారు. 1930 వ సంవత్సరము డిసెంబరు నెలలో ఆయన జైలునుండి విడుదల చేయబడ్డారు.

ఆయన విడుదలైన కొద్దిరోజులలోనే తారాశంకర్ మొదటిసారిగ సుభాష్‌చంద్రబోస్‌ను కలుసుకున్నారు. సుభాష్‌చంద్రునికి జె. ఎమ్. సేన్ గుప్తకు మధ్య ఒక సందర్భములో అభిప్రాయ భేదాలు తలెత్తాయి. ఈ విషయాన్ని పరిశీలించటానికి శ్రీ ఆనె కలకత్తా వచ్చారు. బీరభూమినుండి ఈ సందర్భముగా ప్రత్యక్ష సాక్షిగ వ్యవహరించటానికి తారాశంకర్ ఆహ్వానింపబడ్డారు. తారాశంకర్ సుభాష్‌బాబుతో తనవంటి సాధారణ కార్యకర్తలు కాంగ్రెసు సంస్థనుకాని వ్యక్తులను సేవించరని తెలియచేసారు. నిర్మొహమాటముతో కూడిన ఈ మాటలు సుభాష్‌బాబును ఎక్కువ ఆకర్షించాయి. సుభాష్ వ్యక్తిత్వము తారాశంకర్‌ని ముగ్ధుని గావించినది. కొద్ది కాలము తరువాత తన "చైతాలి ఘూర్ని" అనే నవలను బోసుబాబుకు అంకితము చేసారు. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత కుటుంబములోని స్త్రీల నగలను అమ్మి బోల్‌పూర్‌లో ఒక చిన్న ముద్రణాయంత్రాన్ని కొన్నారు. తన ఇంటిలో ఒక చిన్న గదిలో ఆ యంత్రాన్ని నెలకొల్పారు. ఈ రోజుల్లోనే చెరసాలనుండి విడుదలైన తరువాత సరోజ్‌కుమారు చౌధురి నడుపుతున్న "ఉపాసన", "అభ్యుదయ" అనే పత్రికలలో తారాశంకర్ రచనలను ప్రచురించుట ప్రారంభించారు.

బెంగాలు జానపద నృత్యాలను పునరుద్ధరించవలెననే ఉత్సాహము కలిగిన ఒక జిల్లా అధికారి, తన అధికారమును వినియోగిస్తూ గ్రామాల నుండి బలవంతముగ ప్రాచీన కళాఖండాలను సేకరించుట ప్రారంభించాడు. దీనివలన ఆయన గ్రామాల్లో ప్రజాకంటకుడుగా కనిపించసాగాడు. జానపద నృత్యాలపై ఆయన ఉత్సాహము బెంగాలు యువకులను జాతీయోద్యమము నుండి పెడదారి పట్టించుటకు వేసిన ఎత్తు అని ఆ గ్రామస్థులు అనుమానపడ్డారు అటువంటి అనుమానము పూర్తిగ నిరాధారమని చెప్పటానికి వీల్లేదు. గ్రామసీమల్లోని ఈ విగ్రహాల సేకరణ అందరి ఆగ్రహానికి గురైనది. ఈ కారణముగ కోపము చెందిన రాజకీయ కార్యకర్త ఒకాయన ఆనాడు బహుళ జనాదరణ పొందిన ఒక జానపద గేయానికి వ్యంగానుకరణ (పారడి) ఒకటి వ్రాసి, తారాశంకర్ లేని సమయములో ఆయన ముద్రణాశాలలో ముద్రించాడు. వ్యంగ్య ధోరణిలో అధిక్షేపపూర్వమైన ఆ గీతము ఆ అధికారిని ఉద్దేశించి రచించబడింది. ఆయన కోపానికి పట్టపగ్గాలు లేక పోయాయి. ఈ గేయ రచయితను వెంటనే అరెస్టు చేసారు. కాని ఆ కోపానికి

తారాశంకర్ కూడ గురికాక తప్పలేదు. ఏకారణములేక ఆయనను నిర్బంధించటానికి వీలు కాలేదు. అందువలన ఏవో కుంటిసాకులతో ఆయనను శిక్షించటానికి ప్రయత్నాలు జరిగాయి. బోల్‌పూరు స్టేషనులో ప్లాటుఫారము మీద తారాశంకర్ సుభాష్‌బాబును రెండవ పర్యాయము కలుసుకున్నారు. ఏ విధమైన పత్రము వ్రాసి ఇవ్వవద్దని ఈ విషయములో లొంగిపోవద్దని బోసుబాబు సలహా ఇచ్చారు. తారాశంకర్ ముద్రణా యంత్రాన్ని విడి భాగాలుగా ఒక ఎద్దుబండిలోకి ఎక్కించి లాభపూరు తీసుకుని పోయారు.

ఆయన జీవితములోని ఈ దశలో ఆయనకు కాంగ్రెసుతో సంబంధము చాల తక్కువ. గ్రామ ప్రాంతములోని వ్యవహారాలతో ఆయన ఉక్కిరి బిక్కిరి అవుతూ వుండేవారు. గ్రామప్రజలకు జీవితములో చేసిన ప్రయత్నము లన్నింటిలోను పరాజయాన్ని ఎదుర్కొనేవ్యక్తి అర్థముకాని సమస్యగా మిగిలిపోతాడు. అయనకుకూడ మనశ్శాంతి కరువైనది. మళ్లీ ఆ జిల్లాలో పర్యటన ప్రారంభించారు. ఒక చిన్నపిల్ల మరణానికి సంబంధించిన కథలో ప్రథమ భాగాన్ని రచించారు. ఈ కథా రచన పూర్తికాక ముందే, అరు సంవత్సరాలు వయస్సు కలిగిన ఆయన కుమార్తె "బులు" మరణించింది.

ఆయన విషాదానికి అంతులేకపోయింది. మళ్లీ కలకత్తా చేరుకున్నారు. "ఉపాసన" పత్రిక సంపాదకులు, సావిత్రి ప్రసన్న ఛటర్జీ తన పత్రికను మూసివేస్తూ అందులో ప్రచురించబడిన తారాశంకర్ రచనలకు ముట్టవలసిన పారితోషికాన్ని అందజేశారు. తన "వంగశ్రీ" పత్రిక కోసం శయనీకాంతదాస్ "ఉపాసన" పత్రిక కార్యాలయాన్ని తీసుకున్నారు. ఆ రోజులలో రచయితల మధ్య తాను ఎవరికి చెందని ఏకాకిగా భావించుకునేవారు. తన వ్యక్తిగత విషాద వలయమునుండికూడ విముక్తులు కాలేకపోయారు. నిరాశతో లాభపూరుకు తిరిగి వెళ్లిపోయారు.

కొద్ది రోజుల తరువాత ఆయన శాంతినికేతనుకు వెళ్లారు. అక్కడ టాగోరుతో ఒక గ్రామాభివృద్ధి కార్యక్రమము గురించి చర్చించారు.

తనకు ధనార్జనపై అపేక్షలేదని ఆయనకు పూర్తిగ తెలుసు. అయితే, ఆయన కోరుకునేది ఏమిటి? ఆయన భార్యవైపు బంధువులు బొగ్గ

వ్యాపారములో ఆయనను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నాలు ఫలించలేదు.

ఈనాడు లాభపూరు తారాశంకర్ గ్రామముగ ప్రసిద్ధి కెక్కినది. కాని ఆయన ఆ గ్రామములో నివసించే రోజులలో ఆయనను అర్థము చేసుకున్నవారు చాల తక్కువ. ఈ వింతమనిషితో ఏ విషయములోను వారు ఏకీభవించేవారు కారు. ఆయన చాల విచిత్రముగ ప్రవర్తించేవారు. చెరసాల శిక్ష కావాలని అనుభవించేవారు, పల్లెప్రాంతాలలో తిరుగుతూండేవారు. ధనార్జన ఏవగించుకొనేవారు, ఏవో కథలు నవలలు గిలుకుతుండేవారు. ఇలాంటి వ్యక్తి సులభముగ అర్థము కారు. పరిమిత సాంఘిక వ్యవస్థ కలిగే గ్రామసీమల్లో తమకు భిన్నముగ ప్రవర్తించే వ్యక్తిని ఆ ప్రజలు నమ్మలేరు. అందువలన అనుమానించుట కూడ జరుగుతుంది. పైగా, ఆ వ్యక్తి తమకు చిరకాలముగ పరిచితుడైన వ్యక్తి అయితే, అతనిపై విద్వేషము కూడ తలెత్తుతుంది. తారాశంకర్ విషయములో ఈ ద్వేషము ఒక చిన్న సమస్యపై చెలరేగింది. ఆ రోజుల్లో ఒక ఆసామి తన కుమార్తె వివాహము ఇంగ్లాండు వెళ్ళివచ్చిన వ్యక్తితో జరిపించాడు. ఆ గ్రామములోనివారంతా ఆ ఆసామిని దుమ్మెత్తి పోస్తుంటే తారాశంకర్ అతనిని సమర్థించారు. నిజానికి, 19 వ శతాబ్దములో బెంగాలులోని చాల జిల్లాలనుండి పెక్కుమంది యువకులు ఉన్నత విద్యాభ్యాసానికై ఇంగ్లాండు వెళ్ళుచుండేవారు. లాభపూరు మాత్రము ఈ విషయములో మరీ ఛాందసమైన గ్రామము కావచ్చు. బెంగాలులోని సర్వతోముఖ పునర్వికాసమునకు విదేశములలో విద్యాభ్యాసము చేసినవారే ముఖ్యముగ దోహదము చేసారు.

తారాశంకర్ తిరిగి కలకత్తా వచ్చారు. పసిపిల్లవాని మరణము గురించి ఆయన వ్రాసిన "శ్మశాన ఘాట్" అనే కథానిక సజనీకాంత్ దాసును ఎక్కువ ఆకర్షించింది. "వంగశ్రీ" ప్రథమ సంచికలోనే ఆయన ఈ కథానికను ప్రచురించారు.

ఆనాటి సంఘటనలకు దగ్గరగ వుండవలెననే ఉద్దేశముతో తారాశంకర్ కలకత్తాలోనే మకాము చేయవలెనని అభిప్రాయపడ్డారు. ప్రఖ్యాత చిత్రకారుడు జైమినిరాయ్ కూడ ఆయనను కలకత్తాలోనే వుండమని సలహా ఇచ్చారు.

అయితే, కలకత్తాలో మకాము చేయవలెనంటే నెలకు ఇరవై, ఇరవై ఐదు రూపాయలు అవసరము. అంత డబ్బు సంపాదించుట ఎలా? తన పత్రికలో ప్రచురించబడిన నవలకు అరవై రూపాయలు, కథానికకు పది రూపాయలు సావిత్రి ప్రసన్న ముఖర్జీ ఇచ్చారు. కాని సంపాదకు లందరు ఇంత ఉదారముగ వుండరు. పుస్తకములు సాధారణముగ రెండవ ముద్రణ భాగ్యానికి నోచుకోవు. రచనలద్వారా ధనార్జన ఏ రచయిత ఆశించటానికి వీలులేని పరిస్థితి.

ఈ పరిస్థితులలో ఆయన లాభపూరు తిరిగి వచ్చేసారు. మళ్లీ గ్రామ ప్రాంతాలలో విస్తృత పర్యటన ప్రారంభించారు. ఈ సమయములోనే "వంగశ్రీ" "భరతవర్ష" పత్రికలలో రెండు ఉత్తమ కథానికలు ప్రచురించారు. వీటిలో ఒక కథానిక గ్రామప్రాంతాలలోని సంతను ఇతివృత్తముగ స్వీకరించినది. రెండవది, గ్రామప్రాంతాలలోని మంత్రకత్తె అని అనుమానింపబడి అందరిచేత బాధలకు గురి అవుతున్న ఒక వృద్ధురాలి దీనగాథ.

ఈ కథలకు ఇతివృత్తములను సేకరించు సందర్భములో, తనకు మిత్రతుల్యుడైన ఒక పోలీసు ఉద్యోగి ఆ జిల్లా పోలీసు ప్రధానాధికారియైన షమ్సుద్దోహ తారాశంకర్ గురించి దర్యాప్తు చేస్తున్నాడని హెచ్చరించాడు. బీరభూమి ప్రజలు షమ్సుద్దోహను అంత సులువుగా మరచిపోలేరు. అతడు ఆ జిల్లాలో భయంకరమైన వాతావరణాన్ని సృష్టించాడు. తారాశంకర్ కలకత్తా తిరిగివచ్చారు. అక్కడ ఆయన జీవనాధారము గురించి దర్యాప్తు చేశాడు షమ్సుద్దోహ. ఈ పరిస్థితులలో సజనీకాంతదాసు ఆయనకు అండగా నిల్చారు. తన అకౌంటు పుస్తకాలలో తారాశంకర్‌కు నెలకు ముప్పై రూపాయలు జీతము ఇస్తునట్లు వ్రాసి వుంచారు.

నిజానికి తారాశంకర్ నెలకు ఏ జీతము తీసుకోలేదు. అకౌంటు పుస్తకాలలో ఈ సర్దుబాటు కేవలము తారాశంకర్‌పై ఏ అనుమానము రాకుండ చేయటానికి ఉద్దేశించబడింది. నిజానికి తారాశంకర్ పూర్తిగ తన రచనా వ్యాసంగముపైనే ఆధారపడ్డారు. కలకత్తాలోని దక్షిణ ప్రాంతములో రేకుతో కప్పబడిన ఒక చిన్న గదిని అద్దెకు తీసుకున్నారు. ఈ గదికి అద్దె ఐదు రూపాయలు. కరెంటు ఛార్జీ ఒక రూపాయి. సామాన్యమైన హోటల్‌లో రెండుపూట్లు భోజనము నెలకు ఎనిమిది రూపాయలు. టీ, టిఫిన్లకు ఖర్చు

నెలకు ఏడు, ఎనిమిది రూపాయలు. బస్సు ఛార్జీలు కూడ నెలకు అంత మాత్రము అయ్యేవి. గదిని శుభ్రముచేసుకొనుట పాత్రలు తోముకొనుటవంటి పనులు ఆయనే స్వయముగ చేసుకునేవారు. ఆయన నేలమీద పడుకునేవారు. తన రేకుపెట్టెను వ్రాసుకునేందుకు బల్లగా ఉపయోగించుకునేవాడు.

ఈ విధముగ తారాశంకర్ సాహిత్యాన్ని వృత్తిగా స్వీకరించారు.

# ప్రకరణము 4

1933 వ సంవత్సరములో తారాశంకర్ కలకత్తాలో నివాసమేర్పరచు కున్నారు. ఆ సమయములో కలకత్తాలో సాహితీ రంగములోని తీరుతెన్నులు ఎలా ఉండేవి?

ఈ రోజుల్లోలాగే, అప్పుడు కూడ బెంగాలు రాష్ట్రానికంతటికి కలకత్తా నాడీకేంద్రము వంటిది. రాజకీయ కార్యకలాపాలు పలుకేంద్రాలలో కొనసాగుతుండేవి. చిన్నపట్టణాలలో కూడ సాహితీ సమాఖ్యలు ఉండేవి. అయితే కలకత్తాలోనే ఎక్కువగా రచయితలు కలుసుకుంటూ వుండేవారు. పుస్తకాలు, పత్రికలు ప్రచురింపబడుతూండేవి. టాగోర్, శరత్‌బాబు వంటి వారికి తప్ప రచయితల ఎవ్వరికి సరైన పారితోషికాలు లభించేవి కావు. అయినప్పటికి, యువకులు చాలమంది రచనలను తమ వృత్తిగా స్వీకరించటానికి ముందుకు వచ్చేవారు. వారు ప్రత్యేకముగ సాహిత్యము కోసమే జీవించేవారు.

ఈ సాహితీ సేవలో కొందరు అసువులను కూడ త్యాగము చేసేవారు. ఈ విషయాన్ని ముచ్చటిస్తూ అచింత్యకుమార్ సేన్‌గుప్త ఇలా అంటారు: "మేము మృత్యువును ప్రేమించటం నేర్చుకున్నాము. రాజకీయ రంగములోను, సాహితీ రంగములోను విప్లవవాదులకు అత్యంత ఆకర్షణీయముగ మృత్యుదేవత భాసించేది. (అచింత్యకుమార్ సేన్‌గుప్త! "కల్లోలయుగము" ఊహాశక్తి సంపన్నులై, కార్యోన్ముఖులైన యువకులు తప్పని సరిగ రచయితలుగానో, విప్లవకారులుగానో తయారయ్యేవారు ఆ రోజుల్లో.

రచనా వృత్తిని స్వీకరించుట పేదరికాన్ని, ఆకలిని ఆహ్వానించుట అని వారికి తెలుసు. తారాశంకర్‌కు కొద్దో గొప్పో భూవసతి లేకపోలేదు. ఆయన ఆకలితో అలమటించవలసిన పనిలేదు. అయితే రచనలు వృత్తిగా స్వీకరించుటకు ఆయన తీసుకున్న నిర్ణయము అంత సులువైనది కాదు. ఆయన తన అవిభక్త కుటుంబాని కంతకు మొదటి పురుష సంతానము. ఆ కుటుంబములోని మిగిలినవారి యోగక్షేమములు ఆయన బాధ్యత.

ఈ శతాబ్దములోని రెండవ దశాబ్దము ఉత్తరార్ధములోను, మూడవ దశాబ్దములోని పూర్వార్థమునందు వంగ సాహిత్యములో కొన్ని ఉత్తమ రచనలు ప్రచురించబడినాయి. వానిలో టాగోర్ "మాలంచ" (ఉద్యాన వనము), "చార్ అధ్యాయి" (నాలుగు అధ్యాయములు) "దుయిబోన్" (అక్కచెల్లెళ్లు), శరత్‌చంద్రుని "శ్రీకాంత్" (మూడవ భాగము), "శేషప్రశ్న" ముఖ్యముగ పేర్కొనదగినవి. ఇంతకు పూర్వమే టాగోర్ "చతురంగ", "ఘరేబైరే" (ఇంటా – బైటా), శరత్ చంద్రుని "పథేర్ డాబి." (కోరిక) ప్రచురించబడినవి. శరత్ చంద్రుని నవల ఇతివృత్తము సాహసోపేతుడైన ఒక విప్లవకారుని చరిత్ర. ఈ నవల బెంగాలులో తీవ్ర సంచలనాన్ని కలిగించింది.

"కల్లోల్" పత్రిక గురించి, ఆ పత్రికతో సంబంధము కల్గిన రచయితల గురించి ఇంతకుముందు విపులముగ ముచ్చటించటం జరిగింది. వాస్తవానికి ప్రపంచం యావత్తు అశాంతి వాతావరణముతో రాజకీయపరమైన ఆర్థికపరమైన కల్లోలమునకు గురికానున్న విషమ ఘడియలు అవి. రమణీయాలంకరణలతో, సంతృప్తి దృక్పథముతో, రాజీధోరణితో కొనసాగే సాహిత్యం ఆనాటి ప్రజలను ఆకర్షించలేకపోయింది. ఆనాటి ప్రజలు మారుతున్న సాంఘిక వ్యవస్థ తాలూకు ఆందోళనలో చిక్కుకున్నవారు. బానిసత్వముతో క్రుంగుతున్న దేశాలను రష్యాలోని విప్లవము గాఢముగ కదలించివేసింది. 1914–18 నాటి ప్రథమ ప్రపంచ సంగ్రామము తరువాత, ప్రపంచములోని దేశాలన్ని సన్నిహితత్వాన్ని అనుభవించసాగాయి. ఇతర దేశ ప్రజలను, దేశాలను అవగాహన చేసుకోవాలని వాంఛ ఎల్లెడలా వ్యాపించింది. దేశ, భాషా సరిహద్దులను అధిగమించి, ఇతరదేశాలలోని వినూత్న భావాలను ప్రతిబింబిస్తూ ఆ భావాలతో తమ సారూప్యతను సూచించే రచనలను ఆనాటి యువతరము ఆహ్వానించ సాగింది. జోలా, గోర్కి, హామ్సన్,

వోజేర్, రోలా, వంటి రచయితలు ఆనాటి బెంగాలులోని యువక రచయితల పాఠకుల అభిమానాన్ని చూరగొనసాగారు.

"కల్లోల్" పత్రికలో ప్రచురించబడిన కథల, నవలల, పద్యముల లోని ముఖ్యాంశము వెగటు కలిగించే వాస్తవికత్వాన్ని, భావనా సంబంధమైన నిరాశను యథాతథముగ చిత్రించుట. "కల్లోల్" వంగ సాహిత్యములో, ఒక నూతన శకాన్ని ఆరంభించినదనడానికి వీలులేదు. "భారతి", "సబుజ్ పత్ర", "మానసి" వంటి పత్రికలను నిశితముగ పరిశీలిస్తే అప్పటికే కొందరు రచయితలు ఈ నూతన ధోరణులను వంగ సాహిత్యములో ప్రవేశపెట్టారని ద్యోతక మవుతుంది. ముందుతరానికి చెందిన ఈ తరహా రచయితలలో చారుచంద్ర బెనర్జీ, ప్రేమాంకుర అతార్థి, మణీంద్రలాల్ బసు, హేమేంద్రకుమార్ రాయ్ ప్రత్యేకముగ పేర్కొనదగినవారు. కొద్ది కాలము తరువాత, జగదీష్ గుప్త రామచంద్రసేన్ తమ రచనా వ్యాసంగము ప్రారంభించారు. ఈ రచయితలు కూడ సాంఘిక వాస్తవికతను నిశిత దృష్టితో పరిశీలించి రచన సాగించినవారు.

"కల్లోల్" పత్రిక గురించి విస్తారముగ చర్చించబడినది. కాని ఒక ముఖ్యమైన, అవసరమైన విషయము తగినంత గుర్తింపబడలేదు. ఆ పత్రికలో సంబంధమున్న రచయితలందరు తరుణప్రాయములోనివారు. సాధారణముగ వారి వయస్సు ఎక్కువ అలజడికి గురి అవుతుంది. కాని వారు రాజకీయాలకు దూరముగ వుండి ఆనాడు దేశాన్ని కలవర పరుస్తున్న ముఖ్యమైన రాజకీయ సంఘటనలకుకూడ దూరముగనే వ్యవహరిస్తూ వుండేవారు. సమకాలీన సమాజములోని అశాంతితో వారికి ప్రత్యక్ష సంబంధము లేక పోవుటచేత, ఈనాడు పెక్కురచయితలు పాటిస్తున్న సాహిత్య సాంప్రదాయాన్ని ప్రారంభించిన వారివలె ఆ రచయితలు కనిపిస్తారు. ఈ శతాబ్దము రెండవదశాబ్దిలో "కల్లోల్" పత్రిక స్థాపించబడింది. 1924 వ సంవత్సరములో కాన్పూరు కుట్రసందర్భముగ భారత కమ్యూనిస్టులలో మొదటి ముఠావారు శిక్షాపాత్రులయ్యారు, అదే సంవత్సరము గోపీనాథ్‌సాహా అనే బెంగాలీ యువకుడు ఒక ఐరోపాదేశస్థుని ఆనాడు ఎక్కువ చెడ్డపేరు తెచ్చుకున్న ఆంగ్ల పోలీసు అధికారి అని పొరబడి కలకత్తా వీధులలో కాల్చి చంపివేసాడు. అనతికాలములోనే అతడు ఉరితీయబడ్డాడు. 1925 వ సంవత్సరములో కొందరు దౌర్జన్యవాదులు కకోరి రైల్వే స్టేషను దగ్గర ఉన్న రక్ష

కునివద్దనుండి డబ్బును బలవంతముగ వశపరచుకొన ప్రయత్నము చేసారు. అందుకు వారిలో కొందరు కకోరి విచారణానంతరము ఉరితీయబడ్డారు. అదే సంవత్సరములో దక్షిణేశ్వర్‌లోని బాంబు కుట్ర జరిగింది. 1926-27 మధ్య కాలమున కార్మిక - కర్షక రాజకీయ పక్షము స్థాపించబడింది. ఇంతకుముందే చిట్టగాంగు ఆయుధాగారము పై దాడి ముచ్చటించబడింది. 1931 వ సంవత్సరములో మిడ్నపూరులోని హిజిలి జైల్లో పోలీసులు కాల్పులు ప్రారంభించగ ఇరువురు నిర్బంధితులు ప్రాణాలు కోల్పోయారు. 1931-32 సంవత్సరములలో దౌర్జన్యవాదులచేత మిడ్నపూరులో ముగ్గురు ఆంగ్లేయ జిల్లా మేజస్ట్రేటులు హత్యకావించబడ్డారు. పోలీసులచేత అమానుష హింస, దౌర్జన్యవాదులచేత హింసాకాండ ఎడతెరపి లేకుండ సాగుతూనే ఉండేవి. ఇటువంటి పరిస్థితులలో ప్రతి రచయిత ఈ సంఘటనలను నిరసిస్తూ తమ రచనలలో తమ అభిప్రాయాలను నిష్కర్షగా వెలువరిస్తారని ఆశించుట సహజము. కాని "కల్లోల్" రచయితలు ఈ విధముగ ప్రవర్తించలేదు. కాల్పనిక నిరాశావాదము, అనిశ్చితమైన అసంతృప్తి పూరితమైన అసమ్మతిని సాహిత్యములోని సాంప్రదాయముపై తిరస్కారము ఈ రచయితల దృక్పథాన్ని ప్రభావితము చేసాయి. వారి రాజకీయ విముఖతకు మరియే ఇతర ఉన్నత లక్ష్యములేదు.

సంఘములో అట్టడుగున ఉన్న అభాగ్యులపై సానుభూతి ఈ రచయితలకు మంచి కథావస్తువుగ ఉపకరించినది. త్రాగుబోతులను గురించి, వ్యభిచారిణులను గురించి, బిచ్చగాళ్ళను గురించి, పేదరికము చేసిన నేరస్థుల గురించి "కల్లోల్" పత్రికలో మానిష్ ఘటక్ ("యువనాశ్వ" ఆయన కలంపేరు) ప్రచురించిన కథలు ప్రత్యేకముగ పేర్కొనదగినవి. "కల్లోల్" పత్రికలో కాకుండ నృపేంద్రకృష్ణ ఛటర్జీ ఆనాటికాలమునకు అనుకూలమని గ్రహించి గోర్కి రచన "మదర్" (అమ్మ) అనే నవలను అనువదించి ప్రచురించాడు. చారిత్రక దృష్ట్యా పరిశీలిస్తే ఆనాటి సాహితీ వికాసమునకు "కల్లోల్" పత్రిక చేసిన సేవ అతి ముఖ్యమైనదని చెప్పజాలము.

ఈ కాలముపై తన అభిప్రాయాలను సానుభూతితోను అవగాహనతోను తారాశంకర్ ఈ విధముగ ప్రకటించారు: "ఈనాటి సాహిత్యములోని పోకడలు ఐరోపా ఖండములోని సాహిత్యపు పోకడలను ప్రతిబింబిస్తున్నవని విమర్శకులు అభిప్రాయపడ్డారు... ఆ విమర్శకులు చెప్పినది తప్పేమీ

కాదు. ఆ రచయితలలో అటువంటి అనుసరణ నిస్సందేహముగ వుంది. అయితే దీనికిమించి వారిలో అసంతృప్తి, ఆందోళన అధికముగ కనిపిస్తాయి. 1921 లోను, 1930 లోను ప్రజోద్యమాలు రెండు దఫాలు విఫలమయ్యాయి. అహింసోద్యమము ఆశయానికి వాస్తవానికి మధ్య సమన్వయము చేకూర్చ గలదనే ఆశమమ్మల్నందరను ఎంతగానో ఉత్సాహపరచింది. కాని ఆ ఆశ అడియాశ అయింది. ప్రథమ ప్రపంచ సంగ్రామము మూలముగ యావత్ ప్రపంచము ఆర్థికముగ, రాజకీయముగ విపరీతమైన మార్పులకు గురి అయింది. మాజీవితాలు పూర్తిగ అశాంతికి, అసంతృప్తికి ఆలవాలమయినాయి. అహింసను ధిక్కరిస్తూ, దౌర్జన్యచర్యల పునఃప్రవేశము ఈ అసంతృప్తికి బాహ్యరూపము మాత్రమే. ఈనాటి సాహిత్యానికి లక్ష్యము సమన్వయముపై ఆ కాంక్షను ప్రతిబింబించుటకాక, తిరుగుబాటుపై అభినివేశమును ప్రతిఫలించుటగ మారింది. ఇదే ఆనాటి సాహిత్యపు ప్రధాన లక్ష్యము. అందువలన, ఆనాటి యువతరపు సాహిత్యమునకు అశాంతి, అసహనము కథావస్తువులుగ పరిగణమించాయి.''

బెంగాలులోని ఆనాటి రాజకీయ వాతావరణము యువతరాన్ని ఎక్కువ ప్రభావితము చేసినట్లు కనపడదు. వారు సాహిత్యాన్ని విప్లవ పంథాకు మళ్లించారు కాని ఆనాటి సాంఘిక వ్యవస్థను కాదు. వారిలోని తిరుగుబాటు తత్వము ఆనాడు ఎల్లెడల వ్యాపించిన అశాంతి వాతావరణమువలన ప్రభావితమైంది.

తమ సాహిత్య కృషికి ప్రథమ ప్రచురణావకాశముకై అందరు రచయితలు ''కల్లోల్'' పై ఆధారపడలేదు. ''ప్రవాసి'', ''విచిత్ర'', ''భారత వర్ష'' అనే మూడు ప్రసిద్ధ సాహితీ పత్రికలు ఆ రోజుల్లో ప్రచురించబడేవి. ఈ పత్రికల్లో ప్రవాసి అత్యున్నత స్థానాన్ని అలంకరించింది. ''కల్లోల్'' పత్రికలో తన రచనలు ప్రచురించుటకు పూర్వమే అచింత్యకుమార్ సేన్ గుప్త ''ప్రవాసి'' పత్రికలో తమ రచనలు ప్రచురించారు. మాణిక్ బెనర్జీ ''విచిత్ర'' పత్రికలో తమ కథలు ప్రచురించారు. వీటన్నిటికంటె సాహిత్యదృష్ట్యా 1929 వ సంవత్సరములో బిభూతి భూషణ్ బంద్యోపాధ్యాయ రచించిన ''పథేర్ పాంచాలి'' (ఒక రోడ్డు కథ) ప్రచురణ అతి ముఖ్యమైనది. ఈ సుప్రసిద్ధ నవల ''విచిత్ర'' పత్రికలో ధారావాహికముగ ప్రచురించబడింది. సజనీకాంత్ దాస్ ''శనిబారేర్ చిటి'' (శనివారపు లేఖ)

అనే పత్రికకు సంపాదకులు. ఆ పత్రిక ఖచ్చితమైన, సనాతనమైన అభిప్రాయాలను నిర్మొహమాటముగ వెలువరించుటలో పేరువడసినది. వారణాసి నుండి సురేష్‌చంద్ర చక్రవర్తి "ఉత్తర" అనే పత్రికను ప్రచురిస్తూండేవారు. "ఉత్తర" లో ధూర్జటి ప్రసాదు ముఖర్జీ తరచుగ తమ రచనలు ప్రచురిస్తూండేవారు. 1931 వ సంవత్సరమునుండి సుధీంద్రనాథ్ దత్త "పరిచయ" అనే త్రైమాసిక పత్రికను ప్రచురించుట ప్రారంభించారు. బుద్ధదేవ్ బసు సంపాదకత్వములో 1935 వ సంవత్సరములో కవిత్వానికి సంబంధించిన "కవిత" అనే త్రైమాసిక పత్రిక ప్రారంభించబడింది. "పరిచయ" ఉత్తమ సాహిత్యానికి ఉన్నత ప్రమాణాలను నెలకొల్పటానికి ప్రయత్నించింది. అధునాతన కవిత్వానికి "కవిత" మంచి సేవచేసింది. అధునాతన కవిత్వము వ్రాయుటయే మహాపచారమని పరిగణించబడే రోజుల్లో, "కవిత" ఆధునిక కవుల కవితలను ప్రచురించి ఆధునిక కవితా వికాసానికి దోహదము చేసింది. మరి ఏ ఇతర ఆధునిక కవులకు ప్రోత్సాహము నీయలేక పోయినది.

తారాశంకర్ టాగోరును ప్రథమ పర్యాయము గ్రామోద్ధరణ కార్యక్రమము సందర్భముగ కలుసుకొనుట తటస్థించింది. కొద్దికాలము తరువాత, తన నవల "రాయికమల్" (ఒక వైష్ణవ యువతి నామధేయము), "ఛలనామోయి" (అంతుచిక్కని వ్యక్తి) అనే కథానికల సంకలనము ఆయన టాగోరుకు పంపించారు. టాగోరుకు ఆ నవల బాగా నచ్చింది. అదే అభిప్రాయాన్ని తారాశంకర్‌కు వ్రాసారు. కథానికలను బాగా మెచ్చుకుంటూ ఇంకొక లేఖ కూడ టాగోరు వ్రాసారు. టాగోరును సందర్శించుటకు తారాశంకర్ శాంతినికేతను వెళ్ళారు. ప్రథమ పర్యాయము తమ సమావేశము టాగోరుకు బాగా గుర్తువుంది. గ్రామసీమలను చిత్రించుటలో తారాశంకర్ ప్రదర్శించిన ప్రతిభ వంగ సాహిత్యములో తానింతకు ముందెప్పుడు చూడలేదని టాగోరు మెచ్చుకున్నారు. తారాశంకర్ వ్రాసిన గ్రామములోని ఒక మాంత్రికురాలి కథను గురించి ముచ్చటిస్తూ, కలకత్తాలో తాను ఒక పండితునితో జరిపిన సంభాషణ ఆయన ఉదాహరించారు. ఆ పండితుడు ఆ కథావస్తువు ఏ పాశ్చాత్య సాహిత్యమునుండో దిగుమతి చేయబడినదని అభిప్రాయపడ్డాడు. బెంగాలులోని రచయితలను తమ దేశముతో కల అల్ప పరిచయాన్ని టాగోరు తీవ్రముగ విమర్శించారు. టాగోరు వెలువరించిన ప్రశంసా

వాక్యములు తారాశంకరును ఆనంద పరవశున్ని చేసాయి. కలకత్తాలో ఇంకొక పర్యాయము వారిని కలుసుకొని వారికి "జలసాఘర్" (విలాస మందిరము) అనే కథానికల సంపుటిని అందజేసారు. అటుతరువాత కొద్ది కాలములోనే టాగోరు తీవ్రముగ వ్యాధిగ్రస్తు లయ్యారు. అంతకుముందే ఆయన ఆ సంపుటిలోని "రాయ్ బారి" (రాయ్ వంశము) అనే కథను చదివారు. ఆ కథలో రాబనేశ్వర్ రాయ్ తన ఇల్లు విడచి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకుంటాడు. వెళ్ళిపోయేముందు తన ఇంటిని ఆఖరిసారిగ దర్శించు కుందామని వెనుతిరిగి చూస్తాడు. విలాస మందిరములో దీపాలు దేదీప్య మానముగ వెలుగుతూ అతనిని ఆహ్వానిస్తున్నట్టుగ కన్పిస్తాయి. ఆ ఆహ్వా నాన్ని తిరస్కరించలేక అతడు తన ఇంటికి తిరిగి వచ్చేస్తాడు. తన అచేతన పరిస్థితినుండి చేతనావస్థకు మానవుని పునరాగమనానికి రాబనేశ్వర్ రాయ్ తన ఇంటికి తిరిగి వెళ్ళటానికి మధ్యపోలికను టాగోరు గ్రహించి ఆనందించారు.

శాంతినికేతను దర్శించుటకు మళ్ళీ వెళ్ళినప్పుడు, టాగోరు అచ్చటకు ఎందుకు తరచుగ వచ్చుటలేదని తారాశంకర్‌ను ప్రశ్నించారు. తారాశంకర్ జ్ఞాపకాలను పరిశీలిస్తే టాగోరు శాంతినికేతనుతో తారాశంకర్ సన్నిహిత సంబంధము పెంపొందించుకోవాలి అని అభిలషించినట్లు విశదమవుతుంది. శాంతినికేతను ఆ జిల్లా ప్రజలకు దూరమైపోతుందని టాగోరు బాధపడేవారని తారాశంకర్ పేర్కొన్నారు. అయితే, శాంతినికేశనుకు ఆ ప్రాంతపు ప్రజలకు మధ్యనిలచినఅడ్డుగోడఏదో ఆయన గ్రహించలేకపోయారు. తారాశంకర్‌లో ఉత్తమ లక్షణములు కలవని టాగోరు గ్రహించ గలిగారన్న విషయము నిస్సంశయము. తన ప్రకృతి భిన్నమయినదయితే, తారాశంకర్ టాగోరుకు మరింత సన్నిహితులు కాగలిగేవారు. ఉత్సాహవంతులయిన యువక రచ యితల ఎడల టాగోరు ప్రదర్శించే అపారమైన వాత్సల్యము, ఔదార్యము అందరకు తెలిసినవే! తారాశంకర్ రచనలను టాగోరు మెచ్చుకున్నారు. ఆ సంగతిని ఆయనకు తెలియజేసారు కూడ. ఆ అభిమానాన్ని తారాశంకర్ తన స్వార్థ ప్రయోజనము కొరకు వాడుకోలేదు. ఈ విషయము అయన వ్యక్తి త్వాన్ని, విశిష్టతను మనకు విశదపరుస్తుంది.

ఆయన రచనా వ్యాసంగములో నిమగ్నులు కాని రోజులలో ఇంకా ఎక్కువ కష్టాలకు ఆయన గురి అయ్యేవారు. రచనావృత్తిని చేబట్టిన మొదటి

రోజులలో ఆయన అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చినా, ఆయన ప్రతిభకు అనతికాలములోనే గుర్తింపు లభించుటవలన, ఆయన అదృష్టవంతులనే చెప్పాలి. ఆయన చాలమంది ఇతర రచయితలకంటె సునాయాసముగానే కీర్తి శిఖరాన్ని అధిరోహించ గలిగారు. సాహితీజగత్తులో పేరు ప్రఖ్యాతులు కలిగిన మంచి మిత్రులు వుండటం ఆయన అదృష్టం. పదునైన కలముతో, ఘాటైన విమర్శలతో రచయితలను కలవరపరచగలిగిన సజనీకాంతదాస్ వంటివారు తారాశంకర్‌కు మంచి స్నేహితులేకాక, పెద్ద అండ కూడ. ఆ రోజుల్లో ప్రముఖ కవి, వ్యాసకర్త, విమర్శకుడుగ ప్రసిద్ధిపడసిన మోహిత్‌లాల్ మజుందార్ తారాశంకర్‌ను ఆనాటి ఉత్తమ రచయితగ భావిస్తున్నానని ప్రకటించారు.

నిష్ణాతుడైన పండితుడు, రచయిత 19 వ శతాబ్దము నాటి బెంగాలు గురించి క్షుణ్ణమైన పరిశోధన గావించిన బ్రజేంద్రనాథ్ బందోపాధ్యాయకూడ తారాశంకర్‌కు స్నేహితుడు, శ్రేయోభిలాషి, ఉత్తమ సంపాదకుడు, సాటిలేని పత్రికా రచయిత రామానంద ఛటర్జీ తారాశంకర్ రచనలను తరచుగ ప్రచురిస్తూండేవారు. మొదటి రోజులలో తన పుస్తకాలను ప్రచురించుటకు కొంత ధనాన్ని వెచ్చించవలసినప్పటికి అనతికాలములోనే ప్రచురణకర్తలు ఆయనకు సులువుగానే లభించేవారు.

ఆయన తన రచనలతో గ్రామసీమలను ఒక వినూతన దృక్పథముతో చిత్రించేవారు. ఆయన అనవసరమైన ప్రశ్నలకు, వాగ్వివాదములకు తావిచ్చే విషయములను గురించి ఆయన ఎప్పుడు రచనలు చేసేవారు కారు. చాలా విషయములలో ఆయన సాంప్రదాయ వాది. బెంగాలులోని పాఠకులు వారికి తెలిసిన సంస్కృతిని, వారికి అనుభవములో నున్న గ్రామ సీమలను తమ రచనలలో చిత్రించే రచయితలను ఎక్కువగ అభిమానించేవారు, సులభముగ అర్థము చేసుకొనేవారు. ఆధునిక కాలములో ఉత్తమ రచనలుగ పేరెన్నికగన్న రచనలు యావత్తూ బెంగాలులోని గ్రామసీమలను కథా వస్తువుగ స్వీకరించినవే! వినూతనమైన జీవశక్తితోను, అరుదైనసత్యసంధతతోను, తారాశంకర్ తమ రచనలను కొనసాగించారు. అయితే, ఆయన తన రచనలలో కొత్తపుంతలను తొక్కిన వారు కారు. అందువలననే, ఆయన తన వారందరికి అభిమానపాత్రులు కాగలిగారు.

# ప్రకరణము 5

వంగ సాహిత్యములో తారాశంకర్ ప్రథమ ప్రవేశము కథానికల మూలమున జరిగింది.

ఆయన రచించిన కథానికలు అసంఖ్యాకములు. ఆ కథలను వివిధ రీతులుగ విభజించుట సులభసాధ్యము కాదు. చరిత్రలోను రాజకీయముల లోను ఆయనకున్న అత్యంత అభిమానమువలన ఆయన తనకు అనుభవము లోనికి వచ్చిన అనేక విషయములను గురించి రచనలు చేసారు. మనము ఆయన కథలలోన్ని ప్రముఖమైన వాటిని మాత్రమే తీసికొని అవి ఆయన ఆలోచనలను అనేక సమస్యలపై ఆయన అభిప్రాయములను వివిధముగ ప్రతిఫలించినవో పరిశీలించవచ్చును. "జలసాఘర్", "రాయ్‌బారి", "సారెసత్ గండర్ జమీందార్" (ఒక చిన్నతరహా జమీందారు) వంటి కథలు ఆనాటి జమీందారుల జీవన విధానాలను వివిధ కోణములనుండి ప్రతిబింబించేవి క్రమేణా డబ్బుహరించుకుపోగా పతనమవుతున్న జమీందారి కుటుంబాల చరిత్రలు ఆయన కథల్లో మనకు మాటిమాటికి ప్రత్యక్షమవు తుంటాయి. "రాయ్‌బారి" అనే కథానిక 19 వ శతాబ్దము నాటి రాబనేశ్వర రాయ్ అనే చిన్నతరహా జమీందారుకు సంబంధించిన గాథ. నిరంకుశత్వము నిర్దయ, నియంత్రుత్వధోరణి, ఔదార్యము అన్ని కలబోసిన వ్యక్తిత్వము ఆయనిది. ఆ ప్రాంతములోని కర్షకులను పీడించి, పిప్పిచేసి ఆయన పూర్వీ కులు అంతులేని ఆస్తిని సంపాదించి పెట్టారు. తన విలాసాలకు కామవాంఛ లకు ప్రతీకగ ఆయన ఒక విలాస మందిరాన్ని నిర్మిస్తారు. ఆ మందిరములో విలాసాలు, వినోదాలు ప్రారంభించిన రోజే, ఆయన భార్య, కుమారుడు ఆ మందిరములోనే మరణిస్తారు. ఈ సంఘటన ఆయనకు అశనిఘాతమువలె కన్పిస్తూంది. ఆయన ఇల్లు విడచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకుంటారు. వెళ్ళిపోయేముందు ఆఖరిసారి తన మందిరాన్ని చూచుకుందామని వెను

తిరుగుతారు. ఆ మందిరములో దేదీప్యమానముగ వెలిగిపోతున్న దీప కాంతులు ఆయనకు కనిపిస్తాయి. ఆ కాంతులు ఆయనను తిరిగి రమ్మని ఆహ్వానిస్తున్నట్లుగా కనిపిస్తాయి. ఆయన ఆ మందిరములోనికి తిరిగి ప్రవేశిస్తారు.

రాబనేశ్వర్ రాయ్ మనుమడు, బిష్వంబర రాయ్ జలసాఘర్'' అనే కథానికలో నాయకుడు. ఆయన తన పూర్వీకులనుండి వారసత్వముగ పెద్ద అప్పు, అంతుతెగని కోర్టు వ్యవహారములు, జమీందారి కుటుంబానికి తగిన పట్టుదల తప్ప ఇంకేమి పొందలేక పోయారు. ఏనాడు ఉపయోగించబడని విలాసమందిరము ఒక ముసలి గుర్రము, ఇంకా ముసలిదయిన గజరాజు ఆయనకు ఆయన గతవైభవానికి మధ్య మిగిలిన బంధాలు. ప్రీవి కౌన్సిలులో తన కోర్టుకేసు, కొత్తగా ధనవంతులయిన గంగూలి కుటుంబము వారికి అనుకూలముగ కొట్టివేయబడిన రోజుకూడ ఆ విలాస మందిరములో విలాసములు వినోదములు సాగుతూనే వుంటాయి. గంగూలివారి అమర్యాదకర ప్రవర్తనకు నిరసనగనర్తకీమణులను ఇరువురినికూడఆహ్వానించారు. తనవద్దనున్న ఆఖరి పైసకూడ ఈ విందు సందర్భములో వెచ్చించివేస్తాడు. ఆ మరునాడు ఉదయము అశ్వారూఢుడై పూర్వము మాదిరిగానే స్వారీకి వెళ్లుతాడు. తాను గంగూలి కుటుంబము వారికి కోలుపోయిన గ్రామసీమలలో స్వారీచేసిన తరువాత తన యథార్థ పరిస్థితి అవగతమవుతుంది. ఎగతాళి చేస్తున్న లోకానికి తాను నగ్నముగ, ఏ రక్షణ లేకుండ ప్రదర్శించబడుతున్నట్లు ఆయన బాధపడతాడు. వెంటనే తిరిగి వచ్చేస్తాడు. మెట్లెక్కుతూ, విలాసమందిరము తలుపులు తెరచుకొని వుండటం, దీపపు గుత్తులలో దీపాలు వెలుగుతూ వుండటం చూస్తాడు. ఫ్రేము కట్టిన ఫోటోలలో వున్న అతని పూర్వీకులు తనను గుచ్చిగుచ్చి చూస్తునట్లు తనను వేళాకోళము చేస్తున్నట్లు మనోవేదన అనుభవిస్తాడు. తనపై తనకే ఏవగింపు, ఒక రకమయిన భీతి అతనిని ఆవరిస్తాయి. తన రూపాన్ని తన పూర్వీకుల చిత్రాలలో చూసుకొని తన రూపముకూడ తన పూర్వీకుల కామాంధతకు ప్రతిరూపమని గ్రహించి భయవిహ్వలుడవుతాడు. ఆ మందిరమునుండి బయటకు వచ్చి ఆ మందిరము తలుపులు మూసివేయమని నౌకరులకు బిగ్గరగ ఆజ్ఞాపిస్తాడు.

రాయ్ వంశస్థుల పాత్ర చిత్రణలో తారాశంకర్ అత్యంత సానుభూతిని ప్రదర్శించారు. ఆయనలో చివరివరకు జమీందారీ వర్గము వారిపై

సానుభూతి ఉండేది. ఈ రెండు కథలలోను రసవత్తరమైన సన్నివేశములు, బరువైన సంభాషణలు మనకు కనిపిస్తాయి. "సారెసత్ గండర్ జమీందారు" లోని బన్‌విహారి సర్కార్ వృద్ధుడు. కాలముచేత పరాజితుడు. తిరస్కృతుడు కూడ. ఆయన తన మేనల్లునితో వుంటూ తన జమీందారీలోని రైతులవద్దనుండి పన్నులు వసూలు చేయటానికి ప్రయత్నము చేస్తారు. ఏ రైతులూ ఆయనకు పన్నులు చెల్లించరు. ఇందుకు రెండు కారణాలు వున్నాయి. ఒకటి, ఆయన చిన్నతరహా జమీందారు; రెండవది, వాళ్ళు పన్నులు చెల్లించకపోతే ఆయనేమి చేయలేరని వారికి తెలుసు. ఆయన ప్రవర్తన మేనల్లునికి అవమానకరముగ కనిపిస్తుంది. తన బ్రతుకు వ్యర్థమని గ్రహించిన ఆ వృద్ధ జమీందారు తన మేనల్లుణ్ణి తనను కాశీ పంపించమని అర్థిస్తాడు. ఆయన జీవితములోని విషాధము పేదరికము అనుభవించవలసి వచ్చిన జమీందారులకు సంబంధించినది మాత్రమే కాదు. వారి జీవితము నిరర్థకము మాత్రమేకాక మిగిలినవారి జీవితాలకు గుదిబండ వంటిది అని గ్రహించవలసిన విషాదపరిస్థితులలో వుండే వృద్ధులందరకు సంబంధించినది. వారు ఎవరికీ ఉపయోగపడక ఇతరులపై ఆధారపడవలసి వచ్చినప్పటికి ఇంకా జీవించి వుండుటవలన వారు మిగతా వారికికూడ ఇబ్బంది కలిగిస్తారు. ఇదే ఈ కథలోని విషాదకరమైన పరిస్థితి.

మౌలికమైన భావావేశము ప్రకృతి సహజ లక్షణములు ఆయన పెక్కు కథానికలకు ప్రాతిపదికలు. అసాధారణ ఆవేశముల ప్రేరణ మూలమున ప్రజలు పరిపరి విధముల ప్రవర్తిస్తారని ఆయన విశ్వాసము. ఆయనకు మోతాదు మించిన ఆవేశముపైన రసవత్ ఘట్టములపైన అభిమానమెక్కువ. అందువలన అసాధారణ పరిస్థితుల వలన ఉత్పన్నమయ్యే రసవత్తర సంఘటనలను ఆయన తన రచనలలో చిత్రించారు. మానవులలోని లోటుపాట్లు, ప్రేమ, ఆవేశమువంటి ప్రకృతి సహజ లక్షణాలు "బేదిని" (జిప్సీ స్త్రీ), "తరిణి మాఝి" (పడవవాడు తరిణి) వంటి కథలకు ఇతివృత్తములు. వీటిలో మొదటి కథ ప్రేమకు సంబంధించినది. రెండవ కథ ఆత్మ సంరక్షణకు సంబంధించిన సహజగుణము ఇతి వృత్తముగ కలది. రాధిక అనే జిప్సీ స్త్రీ ప్రతి సంవత్సరము గ్రామములోని తిరునాళ్లకు శంభు అనే తన ప్రియునితోను, ఒక గుడారముతోను ఒక చిరుతపులితోను వస్తూ వుండేది. రాధిక శంభు అందమైన నారింజ రంగు కేశాలను, బోనులోవున్న

అందమైన చిరుతపులిని చూసి ముచ్చటపడి తన భర్తను వదలి శంభుతో వచ్చేసింది. కాని ఈ కథాకాలానికి చిరుతపులిని, శంభునుకూడ ముసలి తనముఆవహించింది. రాధిక మంచి యౌవనములో ఉత్సాహముతో వున్న యువతి, అయినా ఆమెకు శంభుపై చెప్పలేని అనురాగము. ఆమె అతనితోనే వుంటూవుండేది. ఈ సంవత్సరము ఈ తిరునాళ్ళ స్థలములో కిష్టో అనే జిప్సీ యువకుడు గుడారమును ఏర్పాటు చేయటం ఆమె గమనిస్తుంది. రాధిక శంభు ఈ ప్రయత్నము తమకు అవమానకరమని భావించి అతని గుడారాన్ని తగులబెట్టాలని నిర్ణయించుకుంటారు. అర్ధరాత్రి అతని గుడారములో ప్రవేశించి యౌవనముతో మిసమిసలాడుతున్న అతని అందమైన ముఖము చూడాలని రాధిక ఆశపడుతుంది. ఆమె అతనిని నిద్రలేపి తనతో వచ్చేయమని వేడుకుంటుంది. దేనికీ లెఖ్ఖచేయని కిష్టో ఒక క్షణముకూడ సందేహించడు. రాధిక శంభు గుడారముపై కిరసనాయిలుపోసి నిప్పంటిస్తుంది. "ఆ ముసలి పీనుగును మంటలో కాలిచావనీ" అని ఆనందముతో వికటాట్టహాసము చేస్తుంది. యువకులు, అనురాగమాధుర్యము తెలిసినవారు మాత్రమే జీవించటానికి అర్హులు, వృద్ధులు, నిర్బలులు ఈ లోకములో మనటానికి తగరు. తారాశంకర్ రచించిన ఉత్తమ కథానికలలో "బేదిని" ముఖ్యమైనది. ఆయన తన కథకు పాత్రలను జీవితమునుండి ప్రత్యక్షముగ స్వీకరించారు. ఆయనకు వారి జీవితాలు సుపరిచితాలు. రాధిక పాత్ర చిత్రణలో తారాశంకర్ తనకు బాగా నచ్చిన స్త్రీ రూపాన్ని చిత్రించారు. సన్నగా, పొడుగ్గా నల్లత్రాచువలె వున్నదని ఆయన రాధికను వర్ణించారు. ఆమె శరీరము అప్పుడే ఆమె మధువు సముద్రములో స్నానము చేసివచ్చినట్లు ఏదో ఒక మత్తును ప్రసరిస్తున్నట్లు వుంటుంది. జిప్సీ స్త్రీలు వారి చిరునవ్వువెనుక కత్తిని మించిన నిశితత్వాన్ని దాచుకుంటారు. వారిని ప్రేమించటమంటే మృత్యువును ప్రేమించినట్లే.

పడవ నడిపే వ్యక్తి, తరిణి, గురించిన కథలో తారాశంకర్ మానవ ప్రకృతిని అతి వాస్తవికముగ ప్రదర్శించారు. తను నమ్ముకున్న మయూ-రాక్షి నదికి ఎల్లప్పుడు వరదలు రావాలని ప్రార్థిస్తూ, కానుకలు, చిన్నచిన్న బలులు సమర్పిస్తూ వుంటాడు. ఆ నదిలో వరదలు వుంటేనే తాను పడవను నడిపి తన జీవితానికి భుక్తిని సంపాదించుకోగలడు. వరదలు వస్తే మిగతా ప్రజల కడగండ్లకు అంతువుండదు. అందుచేత వరదలు వస్తే వారు అతనిని

నిందిస్తారు. వరదలు ఆ ప్రాంతపు ఎండిపోయిన భూములను సారవంత ములు చేసి నీటిని పుష్కలముగ సరఫరా చేస్తాయి. తరిణికి తన భార్యపై వల్లమాలిన ప్రేమ. కొన్నేళ్ళ వర్షాభావ పరిస్థితి తరువాత ఒక సంవత్స రము మయూరాక్షి నదికి పెద్ద వరద వస్తుంది. తన భార్యతో కలసి తన పడవలో సురక్షిత ప్రాంతము చేరుకోవాలని తరిణి ప్రయత్నిస్తాడు. కాని ఆ ప్రవాహపు ఉధృతములో పడవ మునిగిపోతుంది. భార్యాభర్త లిద్దరు ఒక సుడిగుండములో చిక్కుకుంటారు. భయవిహ్వలయై అతని భార్య అత నిని గట్టిగా వాటేసుకుంటుంది. ఇప్పుడు మిగిలింది ఇద్దరిలో ఎవరో ఒకరు మాత్రమే బ్రతికి బయటపడటానికి పెనుగులాట. ఆత్మరక్షణకై తన పెనుగు లాట అతనిలోని రాక్షస ప్రవృత్తిని మేలు కొలుపుతుంది. తాన ఎంతగానో ప్రేమించిన తన భార్యను చేజేతుల పీక నులిమి చంపి, ఆమె పట్టు విడి పించుకొని తన ప్రాణాన్ని రక్షించు కుంటాడు తరిణి. ఒడ్డు చేరాక హాయిగా గాలిపీల్చుకొని తాను బ్రతికి బయటపడినందుకు అమితానందాన్ని అనుభవిస్తాడు. మనిషిని తన ప్రకృతి సహజ గుణములతో వర్ణించుటలో తారాశంకర్ అసమాన ప్రతిభ కనపరిచారు. క్లిష్టపరిస్థితులలో చిక్కుకున్న మనిషి తన శరీరములో జీర్ణించుకున్న సహజగుణములు నిర్దేశించినట్లుగ నడుచుకుంటాడు. ఈ సహజగుణములు పాశవిక సహజత్వానికి దగ్గరగా వుంటాయి. తెచ్చిపెట్టుకున్న గుణాలన్ని కోలుపోయిన క్షణాలలో మనిషి ఎట్లా ప్రవర్తిస్తాడో తారాశంకర్ ఊహించగలిగారు.

మనిషి ప్రకృతిలో అతీంద్రియ శక్తులపై విశ్వాసము అంతర్గతమై వుంటుంది. ఆ విశ్వాసము మూలమున, ఆ వ్యక్తి అసాధారణ కార్యములను నిర్వర్తించగలుగుతాడు. ఈ విశ్వాసము ఆయన కథానికలు కొన్నింటిలో ప్రముఖమైన ఇతివృత్తముగ మనకు కనిపిస్తుంది. ఒక వ్యక్తి తన జీవిత ములో చాల భాగము నాగరక వ్యక్తివలె ప్రవర్తించ వచ్చును, కాని అదే వ్యక్తి అకస్మాత్తుగ ఆదిమ మానవునివలెకూడ ప్రవర్తించవచ్చును. "ఛలనా మోయి" (అంతు చిక్కని వ్యక్తి) అనే కథలో బొగ్గుగనుల యజమాని ఒకాయన తాంత్రిక ఉపాసన మూలమున అద్భుతశక్తిని సంపాదిస్తాడు. ప్రకృతి పై విజయాన్ని సాధించాలని ఆశిస్తాడు. అందుకొరకు, కొన్ని శుభ లక్షణాలు కలిగిన పురుషుని శవము కావలసివస్తుంది. శ్మశానములో అటు వంటి శవము లభించకపోవుటవలన, అటువంటి లక్షణాలు కలిగిన ఒక

పురుషుని హత్యచేయవలసి వస్తుంది. ఆ శవాన్ని తీసుకుని వెళ్ళి తన తాంత్రిక కార్యక్రమాన్ని కొనసాగిస్తుండగ, అతనికి తన కుమార్తె ఆక్రందన వినిపిస్తుంది. తనకు తెలియకుండానే తాను తన అల్లుణ్ణి హత్యచేసానన్న విషయము అప్పుడు గ్రహిస్తాడు. అంతే, అతడు నిశీధములోని అంధకారము లోనికి పారిపోతాడు. అన్ని శుభలక్షణాలు కలిగిన పురుషశవము లభించి నప్పటికి అతడు తన లక్ష్యాన్ని చేరుకోలేకపోతాడు. అతీంద్రియశక్తి అతనికి వశ్యురాలు కాదు. తాంత్రికులు, సర్పములు, జిప్సీలు, దహనసంస్కార క్రియలు, మృగయా వినోదము, రక్తపాతము, హింసాత్మక ప్రకృతి, పాశవికత, దౌర్జన్యము, క్రౌర్యము, మానసికరుగ్మత మున్నగు అసాధారణ విషయములను తమ రచనలలో అతి మెళకువతో వాడుకున్న రచయితలలో తారాశంకర్ అగ్రగణ్యులు. అటువంటి కథావస్తువులను కావ్యగతము చేయుటకు రచయిత రసవత్తర ఘట్టములను నాటకీయముగ రచించగల నేర్పు కలిగివుండాలి. అప్పుడు ఆ రచన కళాత్మకముగ భాసించగలదు. తారాశంకర్‌కు ఈ నాటకీయజ్ఞత పుష్కలముగ వుంది. ఆయన సంభాషణా చాతుర్యము సంఘటనలను మరింత రసవత్తరముగ చేయగలదు. ఇటువంటి మానసిక రుగ్మతను కథావస్తువుగ ఎన్నుకొని రసవత్తరముగ రచించిన కథలలో "అగ్రదాని" (తద్దినం బ్రాహ్మణులు) పేర్కొనదగినవి. "అగ్రదాని" తద్దినం బ్రాహ్మణుడు చక్రవర్తి గురించిన కథ. అతడు పైతృక కర్మలో పితృదేవతలకు సమర్పించిన భోజనాలను చేస్తున్న కారణాన మిగిలిన బ్రాహ్మణులు అతనిని చులకనగ చూసేవారు. చక్రవర్తి భార్య, బిడ్డలు పస్తులు వుండవలసి వచ్చేది. కాని అతడు తన ఉదరపోషణ గురించే ఆలోచించేవాడు. అతని తిండిపోతు బుద్ధి అతనిని మృగప్రాయునిగ మార్చివేసింది. ధనాశతోటే, జమీందారుగారికి పుత్రసంతతి జరిగే రాత్రి అక్కడ ఉండటానికి అంగీకరిస్తాడు. కాని జమీందారుకు పుత్రుడు జన్మించి వెంటనే మరణించటం జరిగింది. పుట్టిన పిల్లవాడు కులాసాగ వుంటే, చక్రవర్తికి ఆలయమునుండి కొంత భూమి, ఆహారపదార్థాలు లభిస్తాయి. ఆ రాత్రే, చక్రవర్తి భార్య కూడ ఒక మగశిశువును ప్రసవించింది. ఆ శిశువు సజీవుడుగానే వున్నాడు. రెండవ కంటికి తెలియకుండ చక్రవర్తి శిశువులను మార్చివేస్తాడు. చక్రవర్తి కుమారుడు జమీందారుగారి కుమారునిగ పెరిగి పెద్దవాడవుతాడు. దురదృష్టవశాత్తు, అతడు కూడ మరణిస్తాడు. ఆ కుమారుని

కర్మ రోజున చక్రవర్తి ఆ భోజనము చేయటానికి అంగీకరించడు. కాని జమీందారుగారి పట్టుదలవలన తన స్వంత కొడుకు పైతృక భోజనము తానే చేయవలసిన విపరీత పరిస్థితికి లోనుకావలసివస్తుంది. "పుత్రేష్టి" (పుత్ర కామేష్టి) అనే కథానికలో పుత్ర సంతాన ప్రాప్తికోసం ఒక ఇంటి యజమాని నరబలి ఏర్పాటు చేస్తాడు. కాని అతని భార్య ఆ ప్రయత్నాలను విఫలము చేస్తుంది.

మంత్రకత్తెలపై నమ్మకము అనాదికాలముగ ఉంటూఉన్నదే. ఈ నమ్మకము, మనుషులలోని మూఢవిశ్వాసాలు ప్రకృతి విలయతాండవము వంటి సామగ్రిని సున్నితముగ కథలోకి అల్లి "డైని" (మంత్రకత్తె) అనే కథానిక రచించారు. సూర్యుని వేడి తాకిడికి బీడువారి, ఆకులలములు మొల వక, పశుపక్ష్యాదులు కూడ ప్రవేశించని ప్రాంతములో ఒక వృద్ధ స్త్రీ నివ సిస్తూ వుంటుంది. ఆ గ్రామములోని వారందరు ఆమె ఒక మంత్రకత్తె అని భావిస్తూండేవారు. ఆమెతో ఎవ్వరూ మాట్లాడేవారు కారు. భయముతో ఆ గ్రామస్థులు ఆమెకు ఆహారాన్ని సరఫరా చేస్తూ వుండేవారు. ఎవరేనా మరణిస్తే, ఆ మరణానికి ఆమె రక్త పిపాసే కారణమని ఆరోపించేవారు. ఒకరోజు ఒక ప్రేమికుల జంట ఆమె నివాసమువైపు రావడం తటస్థించింది. తన ప్రియురాలు అకస్మాత్తుగ వెళ్ళిపోవుటవలన విచారగ్రస్తుడైన ప్రియుణ్ని సామాన్య స్త్రీలాగే, ఆ మంత్రకత్తె అనునయిస్తుంది. కాని ఆ అబ్బాయి భయంతో మండుటెండలో తన ఇంటికి దౌడు తీస్తాడు. ఎండదెబ్బవలన, మార్గమధ్యములో ఆ అబ్బాయి ప్రాణాలు కోల్పోతాడు. ఈ సారి గ్రామ స్థులు తనను తప్పకుండ మట్టుపెట్టుతారని భయపడి, ఆ మంత్రకత్తె ఆ గ్రామాన్ని వదలి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకుంటుంది. కాని దురదృష్ట వశాత్తు ఒక భయంకర గాలి తుఫానులో చిక్కుకుంటుంది. ఆ తుఫానులో ఆ బక్కపలుచటి స్త్రీ తుడిచివేయబడుతుంది. మరునాడు ఆమె శవము చెట్టు కొమ్మల మధ్య చిక్కుకొని ఆ గ్రామస్థులకు కనిపిస్తుంది. ఆమె మంత్రకత్తె అనే ఆ గ్రామస్థుల సందేహము. ఈ విచిత్రమైన చావువలన మరింత గట్టి పడుతుంది. తన బాల్యావస్థలో తనకు తెలిసిన మంత్రకత్తెయొక్క జ్ఞాప కాలను పురస్కరించుకొని తారాశంకర్ ఈ కథ వ్రాసారు. ఆయన విచిత్ర మైన మానసిక కాలుష్యమునకు సంబంధించిన విషయములను గురించి కథలు చెబుతూంటే పాఠకులు కూడ అవి యధార్థ గాథలేమోనని అభిప్రాయ

పడతారు. ఈ రచయితకు తన కథావస్తువుపైనున్న అధికమైన మక్కువ వలన, మంత్రకత్తె పాత్ర తాలూకు విషాదము మానవత్వము మనకంతగ కనిపించవు.

పశువుల జీవిత విధానముపై ఆయనకు అపరిమితమైన ఆసక్తి. అందులో పాములంటే మరీను. మనిషికి పశువులకు మధ్యనున్న అను బంధము కథారచనకు రసవత్తరమైన వస్తువు కాగలదు. ప్రభాత్ కుమార్ ముఖర్జీ, శరత్ చంద్ర ఛటర్జీ "ఆదరిణి" (మచ్చికయైన ఏనుగు), "మహేష్" (ఒక ఆవు పేరు) అనే ప్రసిద్ధమైన కథలు ఈ అనుబంధమును గురించి రచించారు. ఈ కథావస్తువును తారాశంకర్ మరొక విధముగ తమ రచనలలో ప్రదర్శించారు. ముఖ్యముగ సర్పముల ఇతి వృత్తమును ఆయన వినూతనముగ మలచారు. ఆయన మూఢవిశ్వాసాలను, అజ్ఞానాన్ని పూర్తిగ అవగాహన చేసుకోగలిగారు. ఈ పాముల కథలు ఎన్నో పురాణ గాథలకు కల్పనలకు ఆలవాలమైనవని ఆయనకు తెలుసు. ఈ దేశములో పాములు ఎక్కువ. అందువలన పాములను గురించిన కథలు కూడ ఎక్కువే! పాములు సామాన్యముగ మరణానికి పర్యాయపదము వంటివి. భారతదేశములో పాముకాటుకు మందుకోసం ప్రజలు ఇంకా మంత్రాలు చదివి, తాయత్తులు కట్టే మంత్రగాళ్ళవద్దకు పరుగులు తీస్తునే వున్నారు. ఆ పాముకాటు ప్రాణాంతకము కాదని తెలిసినప్పుడే మంత్రగాళ్లు ముందుకు వస్తారు. తమ ప్రయత్నములో వారు కృతకృత్యులుకూడ అవుతారు. అయితే ప్రజలు చాల మంది చనిపోతూంటారు కూడ. వారు చనిపోవటానికి కారణము ఆ పాము కాటు కలిగించే భయము కూడ కావచ్చు. అందుచేత, పాము కరవగానే తమకు ఆయువు మూడిందనే కర్మసిద్ధాంతమును అందరు విశ్వసిస్తారు. మిగతా రచయితలు చాలామందికంటె తారాశంకర్‌కు మానవప్రకృతిలోని దౌష్ట్యము బాగా తెలుసు. ఆ దౌష్ట్యాన్ని తమ రచనలో ప్రతిబింబించారు కూడ. జిమ్ కార్బెట్ వంటివారు చెప్పినట్లుగ భారతీయులకు నిజానికి పాముల గురించి చాల తక్కువ తెలుసునని తారాశంకర్‌కుకూడ తెలుసు. సామన్య ముగ భారతీయులకు పాము బహు సంతాన ప్రాప్తికి, స్థిరనివాసానికి, మృత్యువుకుకూడ ప్రతీక. అంతేకాక పాములకు అద్భుతమైన అతీంద్రీయ శక్తులుకూడ వున్నాయని వారు విశ్వసిస్తారు. జంతుశాస్త్రములో వర్ణించ బడినట్లుగ పాము భారతీయుల దృష్టిలో ఒక సరీసృపము (రెప్టిలియా

ఒఫీడియా) మాత్రమే కాదు. పాము వారికి సహస్ర రూపాలలో కనిపిస్తుంది. "నారీ ఓ నాగినీ" (పడతి – పాము) అనే కథలోను "నాగిని కన్యార్ కాహిని" (నాగకన్య కథ) అనే నవలలోను తారాశంకర్ బెంగాలులోని ఈ విశ్వాసాన్ని బాగా ఉపయోగించుకున్నారు. 'పడతి - పాము' కథలో తారాశంకర్ పాములలో మానవలక్షణాలను ప్రదర్శిస్తారు. ఒక ఆడ త్రాచు తనను పట్టుకొని పెంచుతున్న పాములవాణ్ణి ప్రేమించడం మొదలుపెడు తుంది. ఆ ప్రేమ ఎంత గాఢమైనదంటే, ప్రేమికులు కలుసుకునే సమ యంలో, అసూయతో తన యజమాని భార్యను, కాటు వేసేందుకు దారి తీస్తుంది. "హన్సూలి బంకర్" "ఉపకథ" (కొడవలి వంపు కథ) లో గ్రామస్థులు ఒక నల్లత్రాచును తమందరను రక్షించే దైవమని విశ్వసిస్తారు.

అదృష్టవశాత్తు "కాలపహార్" (ఒక వృషభేశ్వరుని నామధేయము) అనే కథలో రచయిత ఎద్దును మనిషిగ మార్చలేదు. ఇందులోని కథ హృదయాన్ని కరిగించే విషాదభరితం. ఒక నిరుపేద రైతు తన ప్రియమైన వృషభాన్ని తిండిపెట్టి పోషించలేక అమ్ముకోవలసి వస్తుంది. పట్నములో పశువుల సంతలో ఆ వృషభాన్ని అమ్మివేస్తాడు. ఆ వృషభము కొత్త పరి సరాలకు భయపడి తన పాత యజమాని వద్దకు పోవుటకు దారి తెలియక పట్నములో పరుగులు తీస్తుంది. ఈ ఎద్దు యజమానిని తప్పించుకొని విచ్చల విడిగా తిరుగుతోందని భావించి పోలీసులు ఆ వృషభాన్ని కాల్చి చంపి వేస్తారు. "కామధేను" అనే కథ ఇంతకంటే క్లిష్టమైనది. దూడను కన కుండానే పాలిచ్చే ఆవులు చాల అరుదుగా వుంటాయి. అటువంటి ఆవులు పవిత్రముగ భావించబడతాయి. దేవలోకములోని కామధేనువుకు "సురభి" అని పేరు, ఆపేరే ఇటువంటి ఆవులకు కూడ పెడతారు. అటువంటి ఆవులు ఉన్నవాళ్లు అదృష్టవంతులని అందరు భావిస్తారు. అటువంటి అదృష్టవంతు లలో అక్షరజ్ఞానములేని నాథు అనే పశువైద్యుడు కూడ ఒకడు. సురభిపై "సురభి మంగళ" అనే గీతాన్ని పాడుకుంటూ ఆ ప్రాంతములో రోగ గ్రస్తములయిన ఆవులకు మందులు, మాకులు వేస్తూ కాలక్షేపముచేస్తూ వుంటాడు అతనికి సురభి అంటే పంచప్రాణాలు. ఆ గ్రామములోని ఒక ధనవంతురాలు తనకు సురభిని అమ్మమని ప్రాథేయపడితే అతడు నిరాకరి స్తాడు. అనతికాలములో అతడు ఫుల్‌మోని అనే ఇంకొక ఆవును ప్రేమిం చుట మొదలుపెడతాడు. ఆమె యజమాని ఆమెను హెఫజద్దిషేకుకు వంద

రూపాయలు ఐదు మణుగుల బియ్యము కొరకై అమ్మటానికి నిశ్చయించు కుంటాడు. నాథ్‌కు ఇప్పుడు సురభి లక్ష్మితో సమానము. అయితే ఫుల్‌మోని సౌందర్యాధి దేవత. ఊర్వశికి దీటైనది. నాథ్ చివరకు పెద్ద తప్పు చేయ డానికి సిద్ధమవుతాడు. ఆ ధనవంతురాలికి తన సురభిని అమ్మివేసి ఫుల్‌ మోనిని కొంటాడు. కొద్దికాలములోనే తనచేత సురభిని అమ్మించినదని ఫుల్‌మోనిపై అమితమైన ద్వేషాన్ని పెంచుకుంటాడు. అతని అమాయక మైన హృదయాంతరాళములో ఆ ధనవంతురాలిపై కూడ పట్టరాని కోపము పెరుగుతూ వుంటుంది. తనకు లేకపోతే సురభి ఇంకెవ్వరికి వుండకూడదు. సురభికి విషముపెట్టి చంపుతాడు. నాథుచేజేతులా తన జీవితాన్ని నాశనము చేసుకుంటాడు. ఫుల్‌మోనిని హాఫజడ్డీషేక్‌కు అమ్మివేస్తాడు. పశువుల చర్మాలను శుభ్రముచేసే వృత్తిని చేబట్టుతాడు. ఆవులను సంరక్షించే నాథు ఇప్పుడు ఆవుల చర్మాలను శుభ్రముచేసే పరిస్థితికి దిగజారిపోతాడు. ఆ గ్రామాలలోని ఆచారము ప్రకారము, తన ఆవు చనిపోతే, ఆవులా అంబా రవము చేస్తూ, ఒక గ్రామస్థుడు నాథు ఇంటికి బిచ్చము కోసము వస్తాడు. పట్టరాని ఆవేశముతో నాథు అతనిని చంపుతాడు. పోలీసులు అతనిని అరెస్టుచేస్తారు. అతనికి మరణశిక్ష విధించబడుతుంది. ఇప్పుడు అతని మనస్సుకు సంపూర్ణమైన శాంతి లభిస్తుంది. ఆవు కడుపులోని ప్రేగులతో చేసిన ఉరిత్రాళ్ళతో, తనను ఉరి తీస్తారని అతనికి తెలుస్తుంది. అతనికి అమితానందము కలుగుతుంది. మరణ శిక్షకు ఎదురు చూస్తూ ఒక బొగ్గు ముక్కతో ఫుల్‌మోని కళ్ళను గోడమీద చిత్రిస్తాడు. అతని పతనానికి అకళ్లే కారణము.

వాస్తవానికి ఈ కథ సురభి ఆవుకు కంటె నాథు మనోవికార చిత్ర ణానికి ఎక్కువ సంబంధించినది. సామాన్య ప్రజలను గురించి వారి మన స్సులు పనిచేసే తీరును గురించి తారాశంకర్‌కు క్షుణ్ణముగా తెలుసు. ఆయన ప్రయత్నపూర్వకముగా ఒక ప్రత్యేక శైలిని అలవరచుకున్న కళాకారుడు కాడు. ఆయన మాటలను, సమాసాలను ఒక విధమైన నిర్లక్ష్యముతో ప్రయోగిస్తాడు. రచయితగా తారాశంకర్ మంచి భావుకుడు. కాని ఆయన కథా కథనములో ఎక్కువ శ్రద్ధతీసుకోడు. ఈ నిర్లక్ష్యధోరణే ఆయనలో ఒక ప్రత్యేకమైన శైలిగా రూపు దిద్దుకుంటుంది. ఆయన రచనలలో ఒక విధ మైన క్రౌర్యము, నిరాసక్తత, నిష్కర్షధోరణి మనకు కనిపిస్తాయి. తను

చెప్పబోయే కథావస్తువును ఆయన ముఖ్యముగ పురుషుల దృక్పథమునుండే పరిశీలిస్తారు. తారాశంకర్ ఒక కథ మాత్రమే చెప్పరు. జీవితము తాలూకు ఒక మచ్చుతునకను మనకందజేస్తారు. ఆయన రచనలలో మనకు కనిపించే వికృతత్వము, క్రమపద్ధతి లేకపోవుట, అశ్రద్ధ ధోరణి, సాహిత్య దృష్టితో మాత్రమే పరిశీలిస్తే, దోషాలుగ కనిపించవచ్చు. కాని ఇటువంటి దోషాలు జీవితములో కూడ మనకు పుష్కలముగ కనిపిస్తాయి. మానవ జీవితములో కూడ ఈ దోషాలు, ఎదురుచూడని విషాదము విస్తృతముగ వుంటాయి. ఆయన వాడే భాష తీవ్రముగ శక్తివంతముగ, ఆవేశభరితముగ వుంటుంది. భాష విషయములోను, శైలి విషయములోను అధికమైన శ్రద్ధ తీసుకునే సున్నితమైన కళాకారుడయితే ఆయన తాను చూసిన యదార్థముయొక్క వికృత స్వరూపాన్ని తమ రచనలలో ఆవిష్కరించేవారు కాదు. తాను చూసిన వాస్తవికతను మనోసీమలో రమణీయ భావనగా, ఆకర్షణీయ రచనగా మలచుటకు ప్రయత్నము చేసేవారు. తనను కదలించి, తన చేత వాటిని చిత్రింప చేసిన ఆ వాస్తవికపు బలీయమైన అనుభూతిని తమ రచనలలో ప్రదర్శించగలిగేవారుకూడ కాదు.

ఆయన రచించిన ఉత్తమ కథానికలలో దాదాపు అన్నికూడ భూమికి సంబంధించినవి. ఆ కథలలోని పాత్రలు ఒకే ప్రాంతానికే పరిమితమైనవి కావు. ఆ ప్రాంతాన్ని, ఆ ఆచారములను మార్చితే, ఆ కథలు భారతదేశములో ఏ పల్లెసీమకైనా సంబంధించినవిగా కనిపిస్తాయి. మృత్యువుతో పోరాడుతూ, తన జీవితానికి ఒక పరమార్థాన్ని కనిపించుకోవాలని ప్రయత్నించే సగటు మనిషికూడ జీవిత సమరానికి ప్రతీకగ నిలుస్తాడు. "పౌష్య లక్ష్మి" అనే కథలో ముకుంద పాల్ ఈ ఔన్నత్యాన్ని సంతరించుకుంటాడు. అతడు ఆ ప్రాంతములో పేరెన్నికగన్న వృద్ధ రైతు. అది 1944 వ సంవత్సరము. అంటే పెనుతుఫాను, ఘోరమైన బెంగాలు క్షామమునకు తరువాతి సంవత్సరము. ఆ సంవత్సరము పంటలు సమృద్ధిగా పండాయి. వెంటనే పంటల కోత పని పూర్తి చేయవలసి వుంది. పొలాల్లో పని చేయడానికి మనుషులు దొరకడము కష్టముగా వుంది. అవి రెండవ ప్రపంచ సంగ్రామము జరుగుతున్న రోజులు. కూలి జనము యావన్మంది యుద్ధానికి సంబంధించిన నిర్మాణ కార్యక్రమములలో నియోగించబడ్డారు. కోతకు వచ్చి బంగారు కాంతుల నీనుచున్న పంటను ముకుందు లక్ష్మిగ

భావిస్తాడు. ధైర్యే సాహసే లక్ష్మీగదా! కాని తన ధైర్యము సన్నగిల్లు తున్నట్లు తనశక్తి దిగజారుతున్నట్లు బాధ పడతాడు. పాత రోజులలో అతడు పేరెన్నికగన్న రైతు. పంట కోతలో అందెవేసిన చేయి. తాను వయసువలన దుర్బలుడయ్యాడన్న విషయాన్ని అంగీకరించలేక పోతాడు. మద్యాన్ని సేవించి, తాత్కాలికమైన ఒక అమానుషశక్తితో పంటకోత పూర్తి చేస్తాడు. ధాన్యముతో నిండిన బండిని తన ఎద్దు ఎత్తలేకపోతే తన భుజముతో ఆ బండి చక్రాలను కదల్చడానికి ప్రయత్నిస్తాడు. పట్టుతప్పి ఆ బండిక్రిందే పడి ప్రాణాలను కోల్పోతాడు. ప్రాణాలు పోయేముందు ధాన్యపు గింజలను తన చేతులలోకి తీసుకొని తన బంగరు పొలాన్ని ఆఖరిసారి తిలకిస్తూ ప్రాణాలు విడుస్తాడు. తాను పొందలేని లక్ష్మి తనకు చివరి వీడ్కోలు ఇస్తుంది.

"ఇమారత్" (భవంతి) కథలోని జనాబ్ ఆలి అనే పేరుపడ్డ ఇళ్లు నిర్మించే మేస్త్రీ కూడ కొన్ని విలువులకు ప్రాతినిధ్యము వహించగలిగిన పాత్ర. తన జీవితమంతా సుందర భవనాలను, మసీదులను నిర్మించటానికే వెచ్చిస్తాడు. తాను నిర్మించిన భవనాలు అతనికి గర్వాన్ని, అంతులేని సంతృప్తిని కలిగిస్తాయి. కాని వృద్ధాప్యములో అతనికి తలదాచుకోవడానికి ఆశ్రయము మటుకు లభించదు. దుర్భర పేదరికముతో అతడు ఒక రావి చెట్టు నీడలో తన స్థావరాన్ని ఏర్పరచుకొని తన మరణానికి ఎదురుచూస్తూ వుంటాడు. ఇప్పుడు తాను సృష్టికర్తకు అతి సన్నిహితుడనని భావించు కుంటాడు. తాను నిర్మించిన భవనము లన్నింటికంటే ఆకసములోని ధవళ రేఖలు అతి సుందరముగా కనిపిస్తాయి. దట్టముగా ఆకులతోనిండి తనపై గోపురమువలె అల్లుకున్న రావిచెట్టు కొమ్మలు తనకు భగవంతుడు ప్రసా దించిన అంతఃపుర గోపురమని భావించుకుంటాడు. భగవదేచ్ఛకు తల వంచుటవలన ఆతడు అనంతమైన ఆత్మ సంతృప్తిని పొందగలుగుతాడు. ఈ కథలో తారాశంకర్ భారతదేశములోని కర్మసిద్ధాంతమందలి విశ్వాసాన్ని రసవత్తరముగ చిత్రించాడు. గ్రామములో అందరికి భవనాలు నిర్మించిన మేస్త్రీ తనకొక గూడునుకూడ నిర్మించుకోలేక పోతాడు. తాను నమ్ముకున్న సంఘము ఆ విషయాన్ని పట్టించుకోకపోతే, ఒక చెట్టు రూపములో భగ వంతుడే అతనికొక స్థావరాన్ని ఏర్పరచినాడని ఆస్తికులు నమ్మగలుగుతారు.

ఆయన సృష్టించిన పల్లెప్రాంతాలలోని పాత్రలు ప్రశ్నలు వేయవు; ప్రతిఘటనలు చేయవు. సాధారణముగ, సాంప్రదాయ పద్ధతిని తన జీవిత విధానాన్ని మలచుకుంటాయి. వారిలో అరుదైన మానవతాలక్షణాలు కనిపిస్తాయి. ఆ లక్షణాలవలననే వారు ఉత్తమ వ్యక్తులుగ భాసిస్తారు. ఇటువంటి వ్యక్తులు తారాశంకర్‌కు చిరపరిచితులు తన రచనలలో వీరిని పదే పదే ఆయన చిత్రిస్తూ వుంటారు. "డాక్ హర్కర" (పోస్టురన్నర్) అనే కథలోని "దీను" ఇటువంటి విశిష్ట వ్యక్తులలో ఒకడు. పోస్టల్ శాఖలో విశ్వాసపాత్రుడైన నౌకరుగ పనిచేస్తూ వుంటాడు. నెలకు పదిహేను రూపాయల జీతము. డబ్బువున్న తపాల సంచిని తన కొడుకు నీతై అపహరించటానికి ప్రయత్నిస్తే పోలీసులకు స్వయముగ ఆ విషయాన్ని తెలియజేస్తాడు. తన సత్యసంధతకు వందరూపాయల బహుమతి లభిస్తుంది. తన కొడుకు జైలునుండి తప్పించుకుంటాడు. అతనిని హృదయములేని క్రూరుడని ఆ ఊరివారేకాక, అతని భార్యకూడా నిందిస్తుంది. దీను ఏకాకిగ జీవించవలసి వస్తుంది. కొంతకాలము తరువాత నీతై తన జీవిత విధానము మార్చుకుని ఒక సత్కార్య నిర్వహణలో ప్రాణాలు కోల్పోతాడు. ఆ త్యాగానికి నీతైకు స్వర్ణపతకము లభిస్తుంది. ఆ పతకమును దీనుకు అందజేస్తారు. దీను తన ఉద్యోగానికి రాజీనామా ఇస్తాడు. ఇన్నాళ్లు అతడు అందరికి సందేశాలు అందజేస్తూ వచ్చాడు. ఈనాడు అతనికి కూడ ఒక సందేశము లభించింది. అతని హృదయసీమలో విధి చక్రభ్రమణము సంపూర్ణమయినదని భావన కలుగుతుంది. నిరుపేద అయినప్పటికి నిజాయతీపరుడైన దీను, ఆత్మ ప్రబోధానికి పుత్రవాత్సల్యానికి మధ్య సంఘర్షణమూలమున తీవ్ర మానసికక్షోభకు గురియై, చివరకు ఆత్మప్రబోధానికి తలవొగ్గి తన పుత్రుణ్ణి పోలీసులకు అప్పగించుటవలన దీను పాత్ర ఔన్నత్యాన్ని సంతరించుకోగలుగుతుంది. కథానికా రచయితగ తారాశంకర్ ఔన్నత్యము కూడ ఇక్కడే మనకు కనిపిస్తుంది. సామాన్య మానవుని కథానాయకునిగ ఎన్నికచేసి అతనిలోని అంతుచిక్కని లోతులను పరిశోధించి ఆ పాత్ర సంపూర్ణ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించుట తారాశంకర్ రచనలలోని విశిష్టత. జనాబ్ అలి, ముకుంద పాల్, దీను ఈ కోవకు చెందిన మరపురాని పాత్రలు.

వంగ సాహిత్యములో ఉత్తమ కథానికలు అసంఖ్యాకముగ వున్నాయి. ఈ కథానిక ప్రక్రియలో ఎన్నో ప్రయోగాలు చేయబడ్డాయి.

ప్రేమేంద్ర మిత్ర వంటి రచయితలలో కనిపించే నాటకీయత తక్కువై పాదరసమువలె అంతు చిక్కకుండా వుండే లక్షణము తారాశంకర్ రచనలలో మనకు కనిపించదు. మాణిక్ బెనర్జీ ప్రదర్శించే అగాధమైన క్లిష్టతకాని, అచింత్యకుమార్ సేన్‌గుప్త ప్రదర్శించే నైపుణ్యముతోకూడిన నగిషీ పనికాని తారాశంకర్ కథలలో కనిపించవు. అయినా ఉత్తమ కథానికా రచయితగ ఆయన పరిగణించబడతాడు. ఈ స్థానాన్ని ఆయన ఎలా నిలబెట్టుకోగలిగారు? జీవితము ఇంద్రధనస్సువలె ఆయనకు బహుముఖ రమణీయముగ కనిపించి ఆయనను ఆనందపరవశులుగ చేస్తుంది. ఆ ఆనందాతిరేకమువలన ఆయన తన కథావస్తువుతో తాదాత్మ్యము అనుభవిస్తారు. అంతరాంతర సీమలలోని క్లిష్టత, మానసిక వికారాలు, క్రమపద్ధతి కొరవడిన సాంఘిక వ్యవస్థలో చిక్కుకున్న నిర్జీవమైన మానవ మేధస్సు ఆయనకు అభిమాన పాత్రములు కావు. ఆయనకు నచ్చిన కథానాయకుడు ఎప్పుడు సగటు మనిషే! ఆయన రచనలలో మనకు పరిణతి పొందిన శిల్ప సౌందర్యము కనిపించదు. కాని బలీయమైన నాటకీయత, స్వచ్ఛమైన నిజాయతీ అయిన భావన మనకు ప్రత్యక్షమవుతాయి. ఆయన నేరుగ, అవలీలగ పాఠకుల హృదయసీమలలో ప్రవేశించగలరు. ఆయన కథలలో సగటు మనిషి తన నిజమైన ప్రతిబింబాన్ని చూసుకో గలుగుతాడు.

## ప్రకరణము 6

ఆయన రచించిన "చైతాలి ఘూర్ని", "పాషాణ పురి", "నీల కంఠ", "మన్వంతర" వంటి నవలలు తారాశంకర్‌లోని మానసిక అశాంతికి దర్పణాలని వర్ణించవచ్చును. అశాంతి, అలజడి వంటి కథావస్తువులు ఆయన రచనలలో మాటిమాటికి మనకు ప్రత్యక్షమవుతాయి. కాని ఈ నాలుగు నవలలు ప్రత్యేకముగ పేర్కొన తగినవి.

ధనవంతుల కోసము సృష్టించబడిన సాంఘిక వ్యవస్థలో సగటు మనిషి వ్యథాభరిత జీవితము "చైతాలి ఘూర్ని" లోని ఇతివృత్తము. ఒక

గ్రామములోని దుర్భరక్షామ పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చేసిన వర్ణనతో ఈ నవల ప్రారంభమవుతుంది. చైత్రమాసము (మార్చి 15 నుండి ఏప్రిల్ 14 వరకు) బెంగాలు సంవత్సరములో ఆఖరి మాసము. ఈ నెలలో గాలి తుఫానులు ఎండుటాకుల్ని తుడిచిపెట్టి, కొత్త సంవత్సరాన్ని ఆహ్వానిస్తాయి. వర్షాభావమువలన, ఆ సంవత్సరము ప్రజలు తిండిలేక నకనక లాడుతారు. కొందరు తమ ప్రాణాల్నికూడ కోలుపోతారు. చనిపోయినవారి ఎముకల కోసం నక్కలు, రాబందులు కాచుకుని కూచుంటాయి. భగవంతుని దయకై ఆ సంవత్సరము ఎవరూ ప్రార్థనలు చేయరు. ఆ గ్రామము యావత్తూ శ్మశానముగ తయారవుతుంది. తన కుమారుని మరణానంతరము, 'గోష్ఠ' అనే పేదరైతు తన భార్య 'దామిని'తో ఆ గ్రామము విడచి వెళ్ళిపోతాడు. జమీందారువద్ద, కాబూలివాలా వద్ద తానుచేసిన అప్పునుకూడ తీర్చలేక పోతాడు. అతడు పట్నము చేరుకుని, ఒక చిన్న ఫ్యాక్టరీలో కూలిగ చేరుతాడు. ఇక్కడకూడ మనుషులంతా పేదవారిపై కనికరము ఏ మాత్రము లేని నిర్దయులుగానే కనిపిస్తారు. ఏభయి పైసలు, అరవై పైసల రోజు కూలి కోసం కూలీలు ఎనిమిది గంటలు పనిచేయాలి. అతడు నివసించే బస్తీ ఆ సంఘం దృష్టిలో ఒక మురికి గుంట. ధనికవర్గమువారు వాడుకునే చెత్తబుట్ట. ఈ కార్మికుల స్త్రీల మానము పెట్టుబడిదారుల వర్గానికి అతి చులకన. ఛోటో మిస్త్రి అనే అతను దామినిపై మనసుపడతాడు. ఒక రాజకీయపక్షము వారు, కష్టానికి తగిన ప్రతిఫలము లేకుండ ఎక్కువ గంటలు పనిచేయవద్దని అందుకు సమ్మె చేయమనికార్మికులను ప్రోత్సహిస్తారు. ఫ్యాక్టరి యజమానులు ఫ్యాక్టరిని మూసివేస్తారు. ఎక్కడ చూచినా, ఆకలి విలయతాండవము చేస్తుంది. కార్మికులు కొందరు యజమానులవద్దకు వెళ్లి, తమను పనిలోకి తీసుకోమని అభ్యర్థిస్తారు. సమ్మె చేయాలని పట్టుపడుతున్న కార్మికులు వీరితో ఘర్షణ పడతారు. ఆ దొమ్మిలో పట్టరాని కోపముతో, ఛోటో మిస్త్రి గోష్ఠను హత్య చేస్తాడు. "చైత్రమాసపు తుఫాను భయంకరమైనదేమీ కాదు. ముందు రాబోయే అతిభయంకర తుఫానుకు సూచన మాత్రమే అనే ఒక విప్లవకారుని మాటలతో ఈ నవల ముగుస్తుంది.

ఈ చిన్న నవల రచన కారాగారములో ప్రారంభ మయింది. తారాశంకరీ నవలను సుభాసుబాబుకు అంకితము చేశారు ఈ నవలలోని సంఘటనలు కళ్ళకు కట్టినట్లుగ, హృదయాలను కదిలించేవిగ చిత్రించ

ప్రేమేంద్ర మిత్ర వంటి రచయితలలో కనిపించే నాటకీయత తక్కువై పాదరసమువలె అంతు చిక్కకుండా వుండే లక్షణము తారాశంకర్ రచనలలో మనకు కనిపించదు. మాణిక్ బెనర్జీ ప్రదర్శించే అగాధమైన క్లిష్టతకాని, అచింత్యకుమార్ సేన్‌గుప్త ప్రదర్శించే నైపుణ్యముతోకూడిన నగిషీ పనికాని తారాశంకర్ కథలలో కనిపించవు. అయినా ఉత్తమ కథానికా రచయితగ అయన పరిగణించబడతాడు. ఈ స్థానాన్ని ఆయన ఎలా నిలబెట్టుకోగలిగారు? జీవితము ఇంద్రధనస్సువలె ఆయనకు బహుముఖ రమణీయముగ కనిపించి ఆయనను ఆనందపరవశులుగ చేస్తుంది. ఆ ఆనందాతిరేకమువలన ఆయన తన కథావస్తువుతో తాదాత్మ్యము అనుభవిస్తారు. అంతరాంతర సీమలలోని క్లిష్టత, మానసిక వికారాలు, క్రమపద్ధతి కొరవడిన సాంఘిక వ్యవస్థలో చిక్కుకున్న నిర్జీవమైన మానవ మేధస్సు ఆయనకు అభిమాన పాత్రములు కావు. ఆయనకు నచ్చిన కథానాయకుడు ఎప్పుడు సగటు మనిషే! ఆయన రచనలలో మనకు పరిణతి పొందిన శిల్ప సౌందర్యము కనిపించదు. కాని బలీయమైన నాటకీయత, స్వచ్ఛమైన నిజాయతీ అయిన భావన మనకు ప్రత్యక్షమవుతాయి. ఆయన నేరుగ, అవలీలగ పాఠకుల హృదయసీమలలో ప్రవేశించగలరు. ఆయన కథలలో సగటు మనిషి తన నిజమైన ప్రతిబింబాన్ని చూసుకో గలుగుతాడు.

# ప్రకరణము 6

ఆయన రచించిన "చైతాలి ఘూర్ని", "పాషాణ పురి", "నీల కంఠ", "మన్వంతర" వంటి నవలలు తారాశంకర్‌లోని మానసిక అశాంతికి దర్పణాలని వర్ణించవచ్చును. అశాంతి, అలజడి వంటి కథావస్తువులు ఆయన రచనలలో మాటిమాటికి మనకు ప్రత్యక్షమవుతాయి. కాని ఈ నాలుగు నవలలు ప్రత్యేకముగ పేర్కొన తగినవి.

ధనవంతుల కోసము సృష్టించబడిన సాంఘిక వ్యవస్థలో సగటు మనిషి వ్యథాభరిత జీవితము "చైతాలి ఘూర్ని" లోని ఇతివృత్తము. ఒక

గ్రామములోని దుర్భరక్షామ పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చేసిన వర్ణనతో ఈ నవల ప్రారంభమవుతుంది. చైత్రమాసము (మార్చి 15 నుండి ఏప్రిల్ 14 వరకు) బెంగాలు సంవత్సరములో ఆఖరి మాసము. ఈ నెలలో గాలి తుఫానులు ఎండుటాకుల్ని తుడిచిపెట్టి, కొత్త సంవత్సరాన్ని ఆహ్వానిస్తాయి. వర్షాభావమువలన, ఆ సంవత్సరము ప్రజలు తిండిలేక నకనక లాడుతారు. కొందరు తమ ప్రాణాల్నికూడ కోలుపోతారు. చనిపోయినవారి ఎముకల కోసం నక్కలు, రాబందులు కాచుకుని కూచుంటాయి. భగవంతుని దయకై ఆ సంవత్సరము ఎవరూ ప్రార్థనలు చేయరు. ఆ గ్రామము యావత్తూ శ్మశానముగ తయారవుతుంది. తన కుమారుని మరణానంతరము, 'గోష్ట' అనే పేదరైతు తన భార్య 'దామిని'తో ఆ గ్రామము విడచి వెళ్ళిపోతాడు. జమీందారువద్ద, కాబూలివాలా వద్ద తానుచేసిన అప్పునుకూడ తీర్చలేక పోతాడు. అతడు పట్నము చేరుకుని, ఒక చిన్న ఫ్యాక్టరీలో కూలిగ చేరుతాడు. ఇక్కడకూడ మనుషులంతా పేదవారిపై కనికరము ఏ మాత్రము లేని నిర్దయులుగానే కనిపిస్తారు. ఏభయి పైసలు, అరవై పైసల రోజు కూలి కోసం కూలీలు ఎనిమిది గంటలు పనిచేయాలి. అతడు నివసించే బస్తీ ఆ సంఘం దృష్టిలో ఒక మురికి గుంట. ధనికవర్గమువారు వాడుకునే చెత్తబుట్ట. ఈ కార్మికుల స్త్రీల మానము పెట్టుబడిదారుల వర్గానికి అతి చులకన. ఛోటో మిస్త్రి అనే అతను దామినిపై మనసుపడతాడు. ఒక రాజకీయపక్షము వారు, కష్టానికి తగిన ప్రతిఫలము లేకుండ ఎక్కువ గంటలు పనిచేయవద్దని అందుకు సమ్మె చేయమనికార్మికులను ప్రోత్సహిస్తారు. ఫ్యాక్టరి యజమానులు ఫ్యాక్టరిని మూసివేస్తారు. ఎక్కడ చూచినా, ఆకలి విలయతాండవము చేస్తుంది. కార్మికులు కొందరు యజమానులవద్దకు వెళ్లి, తమను పనిలోకి తీసుకోమని అభ్యర్థిస్తారు. సమ్మె చేయాలని పట్టుపడుతున్న కార్మికులు వీరితో ఘర్షణ పడతారు. ఆ దొమ్మిలో పట్టరాని కోపముతో, ఛోటో మిస్త్రి గోష్టను హత్య చేస్తాడు. "చైత్రమాసపు తుఫాను భయంకరమైనదేమీ కాదు. ముందు రాబోయే అతిభయంకర తుఫానుకు సూచన మాత్రమే అనే ఒక విప్లవకారుని మాటలతో ఈ నవల ముగుస్తుంది.

ఈ చిన్న నవల రచన కారాగారములో ప్రారంభ మయింది. తారా శంకరీ నవలను సుభాసుబాబుకు అంకితము చేశారు ఈ నవలలోని సంఘటనలు కళ్ళకు కట్టినట్లుగ, హృదయాలను కదిలించేవిగ చిత్రించ

బడ్డాయి. ఇందులో రచన ఒక వినూతన ధోరణిలో కొనసాగింది. మనకు సాధారణముగ తారాశంకర్ రచనలలో కనిపించే లోపాలు ఇందులోకూడ కనిపిస్తాయి. అనాదికాలముగ, బెంగాలులో నెలకొనియున్న సామాజిక వ్యవస్థకు తారాశంకర్ సజీవమయిన అక్షరరూపాన్ని తమ నవలలో కల్పించారు. ఈ నవలలో చిత్రించబడిన అనేక విషయాలు ఈనాటి పరిస్థితులకు కూడ సరిపోయే వుంటాయి. ఈ రోజుల్లో కూడ, పేదరైతులు తమ భూములను అత్యాశాపరులైన వడ్డీ వ్యాపారులకు, ధనిక భూస్వాములకు అర్పించుకుంటూనే వున్నారు. కడుపు చేతపట్టుకుని, తమ కుటుంబాలతో, జీవనోపాధికోసం ఇప్పుడుకూడ ఈ పేదరైతులు పట్నాలలోని పారిశ్రామిక వాడలకు వలసపోతూనే వున్నారు. ఈనాడుకూడ, అమానుషమైన అన్యాయము స్వైరవిహారము చేస్తూనేవుంది. పేదరైతులకు, కార్మికవర్గానికి ఏ చట్టాలు పూర్తి రక్షణ ఇవ్వలేకపోతున్నాయి. ఇటువంటి వాస్తవికతను కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించుట ఈ నవలలోని ప్రత్యేకత. ఈ నవల ఆయన తరువాతి నవలలకంటె ఉన్నతమైన నిర్మాణ శిల్పాన్ని ప్రదర్శిస్తుంది. ఇందులో పునరుక్తి, వర్ణనలలో ఆధిక్యత అనే దోషాలు తక్కువగ కనిపిస్తాయి.

'పాషాణపురి' లో నవలా నిర్మాణపద్ధతి మంచి బిగువైనది. కాని కథలో పటుత్వము తక్కువ. కథా కథనముకూడ నిర్దుష్టమైనది. జైలు జీవితములోని కష్టాలు ఆయనకు స్వయముగ తెలుసు. కాని ఈ నవలలో ఆ కష్టాలను ఎక్కువ చిత్రించలేరు. హత్యానేరానికి, గృహదహన నేరానికి మరణశిక్ష ననుభవించవలసిన కవి కర్మార్కర్ జీవితగాథ ఈ నవలలో చిత్రించబడినది. రచయిత తన ప్రారంభదశలోనే తారాశంకర్ రసవత్తరమైన, మానసిక రుగ్మతను ప్రదర్శించ గలిగిన కథావస్తువును ఎన్నుకున్నారు. జైలులోని జీవితము గురించి ఆయన ఇలా వ్రాశారు: "చట్టప్రకారము, పరిపాలకులు నేరస్థులలోని నేరప్రవృత్తిని, వారిని సంకెళ్ళలో బంధించి, రాతిగోడల మధ్య చెరసాలలో క్రుక్కి, అంతరింప చేద్దామని ప్రయత్నిస్తారు.... ఆ నేరస్థుని లోని నేరప్రవృత్తి అంత సులువుగ అంతము కాదు. భయపడిన పామువలె ఆ ప్రవృత్తి మనుషుల అంతరాంతరాల్లో దాగుకొని వుంటుంది. దెబ్బతిన్న పామువలె, ఈ ప్రవృత్తి తన రంధ్రములోకి దూకి, పగతో బుసలు కొడుతుంది. ఈనాటికికూడ మానవుడు హాలాహలాన్ని అమృతముగ చేయుట నేర్చుకోలేదు. అందువలననే, జైలు శిక్ష తరువాత,

శిక్షించబడిన దొంగ ఎవరిని లక్ష్యముచేయని నేరస్థుడుగ తయారవుతాడు. తారాశంకర్ కతిప్రీతిపాత్రములైన పాము, హాలాహలము, అమృతమువంటి శబ్దచిత్రాలు మన కిందుతో పుష్కలముగ కనిపిస్తాయి. రాజకీయ బంధితుల గాథలను ఉపాఖ్యానాలుగ ఈ నవలలో ప్రవేశపెడుతూ, తారాశంకర్ కవి కర్మాకర్ జీవితాన్ని ప్రధానముగ చిత్రించారు. ఆవేశముతో కర్మాకర్ ఒక హత్య చేసాడు. తారాశంకర్ అతనిని ఒక జిల్లాకోర్టులో విచారణ సందర్భములో స్వయముగ చూసారు.

'పాషాణపురి' లో కథాకథన పటుత్వము చాల తక్కువ; అయితే, 'నీలకంఠ' లో అసలు లేదనే చెప్పాలి. ఈ నవలలోని ఇతివృత్తము శ్రీమంత అనే ఒక పేద గ్రామస్థునికి, అతని భార్య గిరికి సంబంధించినది. హరిలాల్ అనే వారిదగ్గర బంధువు మూలమున వారి కుటుంబములో శాంతి కరవవు తుంది. పిల్లలు లేని ఈ దంపతులకు హరిలాల్ కుమార్తె గౌరిపై ఎనలేని ప్రేమ. ఆ ప్రేమను సాకుగ తీసుకుని, గౌరికి ఒక మంచి యువకునితో వివాహము జరిపించవలెనని, వారికి వున్న పొలాన్ని అమ్మేలా చేస్తాడు హరి లాల్. కాని హరిలాల్ గౌరిని ఎందుకూ కొరగాని వాని కిచ్చి వివాహము చేస్తాడు. పట్టరాని కోపముతో శ్రీమంత హరిలాల్‌కు దేహశుద్ధి చేస్తాడు. ప్రతీకారముగ, హరిలాల్ పోలీసులచేత శ్రీమంతుని అరెస్టు చేయిస్తాడు. గిరి ఒంటరిదై పోతుంది. అప్పటికే ఆమె గర్భిణి. కాని గ్రామస్థులు ఆమె శీలాన్ని శంకిస్తారు. పట్టరాని కోపముతో, ఆమె ఆ గ్రామానికి నిప్పుపెట్టి, పట్నము చేరుకుంటుంది. అక్కడ ఆసుపత్రిలో ఒక మగశిశువును ప్రసవి స్తుంది. ఆ శిశువుకు 'నీలకంఠ' అని నామకరణముచేసి, ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. నీలకంఠ పెరిగి పెద్దవాడై, పట్నములో అమ్మకానికై పళ్ళను కొనటానికి తన తలిదండ్రుల గ్రామానికి వస్తాడు. ఆ గ్రామముతో తనకున్న సంబంధము అతనికి తెలియదు. జైలునుండి విడుదల అయిన శ్రీమంత ఈ యువకుని కలుసుకుంటాడు. అతనెవరో తెలియకుండానే, అతనితో కలసి ఆ గ్రామాన్ని వదలిపెట్టి పట్నము చేరుకుంటాడు. ఈ నవలలోని కథ యదార్థానికి చాల దూరముగ నడుస్తుంది. కథలో బలము చాల తక్కువ. ఇందలి పాత్రలలో సహజత్వము తక్కువ. తలిదండ్రులు లేని నీలకంఠ ఎలా పెరిగి పెద్దవాడయాడో రచయిత మన కెక్కడ వివరించడు. నిజానికి, ఈ నవలకు

'నీలకంఠ' అని పేరుపెట్టడం కూడ సబబు అనిపించదు. ఈ కథలో నీల కంఠ పాత్ర ప్రాముఖ్యము చాల తక్కువ.

వాస్తవిక సంఘటనలో చిత్రణలో 'మన్వంతర' కు ఒక విశిష్ట స్థానము వుంది. ఈ నవల 1944 లో ప్రచురించబడింది. ఇందులో సమ కాలిక సంఘటనలు అనేకము చిత్రించబడ్డాయి. వీనిలో కలకత్తాలో జపాను విమానదాడులు కలిగించిన కలవరము అతి ముఖ్యమైనది. వేలాదిమంది క్షామబాధితులు కలకత్తాకు వలసరావటము, నిరుపేదలు, మధ్యతరగతివారు ఆహారపదార్థాలు, నిత్యావసర సామగ్రి లభించక పడుతున్న కష్టాలు, 21 రోజులు నిరశన వ్రతము సాగిస్తూన్న మహాత్మాగాంధి ఆరోగ్య పరి స్థితిని గురించి ప్రజల ఆందోళన – ఇవన్నీ ఈ నవలలో చిత్రించబడ్డాయి.

'కనై' ఈ నవలలో నాయకుడు. ఒకప్పుడు ధనవంతుడని పేరు పడిన సుఖమయ చక్రవర్తి వంశానికి చెందిన వాడే అతడు. అయితే, ఇప్పు డతని కుటుంబ పరిస్థితులు అస్తవ్యస్తముగ వుంటాయి. ఆ కుటుంబ సభ్యు లందరూ పతనావస్థలో వుంటారు. కనై నీలను ప్రేమిస్తాడు. కాని ఆమెను పెండ్లిచేసుకొనుటకు భయము. తన కుటుంబములోని మిగతావారివలె, తన రక్తము కలుషితమైనదని, పెండ్లికాగానే, ఏవో వ్యాధులు తనను పీడిస్తా యని అతని భయము. జమీందారీ వ్యవస్థకు ప్రతిరూపమైన ఈ చక్రవర్తి కుటుంబానికి నిష్కృతి లేదు. వారు యధార్థాన్ని గుర్తించలేరు. మారుతున్న కాలానికి అనుగుణముగ వారు మారలేదు. నగ్నముగ ఒక యువకుడు ఇంటిలో పడుకుని వుంటాడు. అతని తలిదండ్రులు అతనిని ఏయోగి అవ తారముగానో భావిస్తారు. ఆ కుటుంబములోనివారు ఆ ఇంట్లోనే దొంగ తనాలు చేస్తారు. మగవాళ్లు రోజు, రోజుకూ అధోగతి పాలవుతుంటారు. వీరిలో కనై తల్లి ఒక్కతే ఉత్తమురాలు.

మిడ్నపూరులో వరదలకు, క్షామపరిస్థితులకు గురయి బాధపడుచున్న అభాగ్యులకు సహాయము చేయవలెనని కనై, నీల, కనై తమ్ముడు 'నేపి' ప్రయత్నిస్తారు. పశ్చిమ బెంగాలులో ఆగ్నేయ దిక్కులో నున్న మిడ్నపూరు జిల్లా రెండు విధములైన ప్రకృతి శక్తుల విలయతాండవానికి గురి అయినది. 1942 వ సంవత్సరము తరువాత రెండు సంవత్సరాలుగ పోలీసుల దౌర్జన్య కాండకు గురి అయింది. తుఫాను పంటలకు విపరీత నష్టాన్ని కలిగించింది.

కనై కుటుంబములోని వాతావరణము ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. కష్టాల్లో వున్న వారిని నీలతో కలసి ఆదుకొనుటకై కనైకి కొంత తృప్తిని కలిగిస్తుంది.

మనుషులపై యుద్ధముయొక్క ప్రభావము విపరీతముగ ఉంటుంది. కనై పక్కింటివారి అమ్మాయి గీతను ఆమె తండ్రి స్వయముగ వ్యభిచార వృత్తిలో ప్రవేశపెడతాడు. యుద్ధము అకస్మాత్తుగ కొందరి చేతులలో అంతు లేని ధనాన్ని గ్రుమ్మరించింది. అందుచేత కన్నెపిల్లలకు కూడ గిరాకి అకస్మా త్తుగ పెరిగింది. గీతను ఆమె తండ్రి ఒక ధనవంతునికి అమ్ముతాడు. అతని చేత మానభంగము పొందిన తరువాత అతని బారినుండి తప్పించుకుని రోడ్డుమీదకు పరుగెడుతుంది. ఆ స్థితిలో కనై ఆమెను చూసి, బిజయ్‌దా అనే కమ్యూనిస్టు పాత్రికేయుని వద్దకు ఆమెను తీసుకుని వెడతాడు. యుద్ధ ప్రభావమువలన ఒక నూతన తర మావిర్భవించింది. తలిదండ్రులకు పిల్ల లకు మధ్య ఒక అగాధమైన తరాల అంతరం ఏర్పడింది. తాను కష్టపడి సంపాదించిన ధనాన్ని తన తండ్రి తాగుడుకు ఖర్చుచేయడం సహించలేక, కనై ఇల్లు విడచి వెళ్ళిపోతాడు. తన కుటుంబానికి జీవనోపాధి కలిగించేది ఆడపిల్ల నీల. ఆడదాని సంపాదనపై బ్రతకటం ఆమె తండ్రికి ఏమాత్రము ఇష్టములేదు. నీలకూడ ఇల్లువిడచి వెళ్ళిపోతుంది. కమ్యూనిస్టు పార్టీ ఆ రోజు ల్లోనే రాజకీయ పక్షముగ గుర్తించబడింది. నేపి ఆ పార్టీలో చేరతాడు. చక్ర వర్తి కుటుంబము ఛిన్నాభిన్నమై పోతుంది. కలకత్తాలో బాంబుల వర్షం! చక్రవర్తి ఇల్లు పూర్తిగ నాశనమౌతుంది. అందులోని చాలమంది సభ్యులు కూడ మరణిస్తారు. గీత తండ్రి ఇల్లు వదలిపెట్టి వెళ్ళిపోతాడు. ఆమె తల్లి వీధుల్లో బిచ్చమెత్తుకోవడం మొదలుపెడుతుంది. కనై తన రక్తాన్ని పరీక్ష చేయించుకుంటాడు. అందులో ఏ కాలుష్యము లేదని తేలుతుంది. అతడు నీలను వివాహము చేసుకుంటాడు. బిజయ్‌దా తన పత్రికలో యుద్ధాన్ని సమర్థిస్తూ ఒక వ్యాసాన్ని ప్రచురిస్తాడు. ఈ యుద్ధముతో యుద్ధాలన్నీ పరిసమాప్త మవుతాయని, గాంధీజీ సిద్ధాంతాలు భారతదేశానికి మహోన్నత భవిష్యత్తును ప్రసాదిస్తాయని ఆయన విశ్వసిస్తాడు. భవిష్యత్తులోని సాంఘిక వ్యవస్థ సమసమాజ సిద్ధాంతాలపై పునర్నిర్మింపబడుతుందని ఆకాంక్షిస్తాడు ఆయన.

సమకాలీన సమస్యలను తన రచనలలో చిత్రించి, తారాశంకర్ రచయితగ తన సామాజిక స్పృహను, బాధ్యతను నిరూపించుకున్నారు.

పత్రికారచనకై సాహిత్యపు విలువలను ఆయన విస్మరించారని కొందరు విమ ర్శకులు అభిప్రాయపడ్డారు. కాని ఈనాటి పాఠకులుకూడ ఈ నవలను అత్యంత ఆసక్తితో చదువగలరు. సరోజకుమారరాయ్ చౌధురి నవల 'కాలో ఘోడ' (నల్లగుఱ్ఱం) లో తప్ప ఇంక ఏ బెంగాలి నవలలోనూ యుద్ధము తాలూకు భీభత్సము ఇంత వాస్తవికముగ చిత్రించబడలేదు. పేరుబడ్డ రచ యితలు కొందరు యుద్ధము ప్రాతిపదికగ కొన్ని కథానికలు రచించక పోలేదు. వారందరు కథానికలు మాత్రమే ఎందుకు వ్రాయవలసి వచ్చింది? ఈ కథావస్తువు బెంగాలు అనుభవించిన మానసిక ఆవేదనను ప్రతిబింబించ గలిగిన ఇతివృత్తము కాలేకపోయిందా? తారాశంకర్ ఒక్కరే ఈ ఇతి వృత్తము సాహితీగౌరవమును పొందగలిగినదని విశ్వసించి, ఈ కథావస్తు వుని వివిధకోణములనుండి పరిశీలించి, ప్రదర్శించుటకు నవల మాత్రమే తగినదని ఆయన భావించారు. ఆయన స్వయముగ కమ్యూనిస్టు కారు. ఆనాటి విద్యావంతులైన యువకులపైన, వయసు మళ్ళిన రాజకీయ కార్య కర్తలపైన కమ్యూనిస్టు సిద్ధాంతాలు అమితమైన ప్రభావాన్ని కలిగిస్తున్నా యని తారాశంకర్ ఒక్కరే గ్రహించగలిగారు. ఆ ప్రభావము నిర్లక్ష్యము చేయదగినది కాదని ఆయన భావించారు. కమ్యూనిస్టుల కార్యక్రమాలు అన్నీ సమర్థనీయములు కావు. కాని క్షామబాధితుల సహాయార్థము వారు చేపట్టిన సేవాకార్యక్రమములు మంచి క్రమపద్ధతిలో నిర్వహించబడుటవలన అందరి ప్రశంసలకు పాత్రమయ్యాయి. అంతేకాక, రచయితలలోను, కళా కారులలోనూ అభ్యుదయ వర్గము వారప్పటికే ఆ పార్టీలో సభ్యులుగ చేరారు. తన నవలలో తారాశంకర్ ఈ రాజకీయసత్యాన్ని అతి వాస్తవికముగ చిత్రించారు. నవలగ, 'మన్వంతర' లో వస్త్వైక్యత లోపించింది. ఈ నవ లలో చక్రవర్తి కుటుంబ గాథ ప్రత్యేక శ్రద్ధతో రూపొందించబడింది. 'నీల' కమ్యూనిస్టుపార్టీ సభ్యులకు సరైన ప్రతీక కాకపోవచ్చు. విజయ్‌దా తారా శంకర్ చిత్రించిన అకుంఠిత సేవాపరాయణుల, కార్యవాదుల కోవకుచెందిన వాడు. ఈ నవలలో తారాశంకర్ ప్రాచీన గ్రాంథిక శైలిని విడిచిపెట్టి, వ్యావహారికశైలిని ఉపయోగించారు.

ఈ నవల ఈనాటి పాఠకులకుకూడ, ఆనాటి సాంఘిక పరిస్థితుల దర్పణముగ, ఆసక్తి కలిగించగలదని పైన వివరించబడింది. ఈ సందర్భ ములో ఈ విషయాలు కూడ మనం జ్ఞాపక ముంచుకోవడం అవసరం! ఈ

క్షామపరిస్థితుల వలన, వేలాది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. కలకత్తా వీధుల్లోకూడ వేలాదిమంది మృత్యువుపాలయ్యారు. అయినా, ఆ రోజుల్లో కూడ 'నల్ల ధనము' అందించే ఆనందాలకు లోటులేదు. ఏ ఒక్క సినిమా హాలుకూడ, ప్రేక్షకులు లేక, మూతపడలేదు. ఏ ఒక్క రాత్రి విలాస స్థావ రాల్లో ఆనందపారవశ్యానికి అంతరాయము కలుగలేదు. తమ సంసారాల్ని గడుపుకోవడానికి యువతులు వ్యభిచారవృత్తిని స్వీకరించవలసి వచ్చేది. మిడ్నపూరు తుఫానులో లక్షలాది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఒక అధికార అంచనా ప్రకారము, ఒక గ్రామములోని మొత్తము 286 మంది జనాభాలోను, అయిదుగురు మాత్రమే బయటపడ్డారు.

# ప్రకరణము 

1939 వ సంవత్సరములో 'ధాత్రీదేవత' ప్రచురించబడింది. సామాన్య ముగ తారాశంకర్ తన రచనలతో ఒక మాదిరిగ తృప్తిపడేవారు కారు. ఆయన తమ రచనలను మార్చి, మార్చి వ్రాస్తూ వుండేవారు. కాని "ధాత్రీ దేవత" లో ఓక మార్పుని కాని, చేర్పునికాని చేయలేదు. ఈ నవల తారా శంకర్ స్వీయచరిత్రకు సంబంధించినది. తారాశంకర్ నవలా రచయితగ ప్రదర్శించిన లక్షణాలన్నీ అంకుర రూపములో మన కిందులో కనిపిస్తాయి. జమీందారులు ఎదుర్కొంటున్న విభిన్న సమస్యలు, కొత్తగ ధనవంతు లవు తున్న వ్యాపారస్థులు, రైతాంగపు సమస్యలు, సగటు మనుషుల నిరంతర పోరాటము, సమున్నత వ్యక్తిత్వముతో భాసించే స్త్రీ, పురుష పాత్రలు, అమృతహృదయుడైన ఒక జమీందారు, ఒక సాధు పుంగవుడు, విభిన్న సిద్ధాంతాలను విశ్వసించే రాజకీయ కార్యకర్తలు, వర్షాభావ పరిస్థితులు — ఇవన్నీకూడ మన కాయన నవలలలో దర్శనమిస్తాయి. ఈ నవలా రచనలో ఆయన చక్కని శిల్పాన్ని ప్రదర్శించారు. ఉత్కృష్టమైన నవలా రచనలో ఈ నవల ఆయన ప్రథమ ప్రయత్నము. ఉత్తమ నవల ఆనాటి దేశపరిస్థితు లను కాలాన్ని సంపూర్ణముగ ప్రతిబింబిస్తుంది. ఆ ఇతివృత్తమును మనోవిశ్లే

రాలకు తావీయకుండ, నిస్సంగ ప్రవృత్తిలో తమ రచనలలో ఆవిష్కరిం చాలి. 'ధాత్రీ దేవత' ఆయన తరువాత రచించిన మూడు మహోత్తమ నవలల రచనకు నాందీప్రాయము. 'గణ దేవత', 'పంచగ్రామ', 'హన్సూలి బంకర్ ఉపకథ' ఆయన రచించిన మూడు విశిష్టమైన నవలలు. ఇవి సార్వకాలికములైన ఉత్తమ నవలలు. ఆ నవలలు ఆ కాలానికి సంబంధించిన వైనప్పటికి, విస్తృతమైన ప్రాతిపదిక కలిగినవి. ఈ ప్రాతిపదిక యావద్దేశానికి, ప్రజలకు, భూత, భవిష్యత్కాలాలకు సంబంధించిన దగుటచే, ఆ నవల వర్తమానపు సరిహద్దుల్ని అధిగమించి సార్వకాలికత, సార్వజనీనత పొందగలుగుతుంది.

'ధాత్రీదేవత' లో శివనాథ్ కథానాయకుడు. ఆయన ఒక చిన్నతరహా జమీందారుకు ఏకైక పుత్రుడు. తన చిన్నతనములోనే ఆయన తండ్రిని కోల్పోతాడు. ఇద్దరు అసాధారణ స్త్రీలు ఆయన్ని పెంచి, పెద్దవాణ్ని చేస్తారు. వారు ఆయన తల్లి, అత్త. ఆయన మాతృమూర్తి అనురాగమూర్తి; మితభాషిణీ, క్షమాశీలి; క్రమశిక్షణకు మారుపేరు. ఆయన అత్తగూడ అనురాగమూర్తి. కాని ఎక్కువ గర్విష్ఠి. తన మాటే చెల్లాలి అని భావించే వ్యక్తి. క్షమ ఎరుగని స్త్రీ. శివనాథ్ అంటే అలవికాని ప్రేమ. ఆమె పట్టుదలవలన ఆయన గౌరి అనే ఒక ధనవంతుని మేనకోడల్ని వివాహము చేసుకుంటాడు. అప్పటికి ఆయన స్కూలు చదువుకూడ పూర్తిచేయలేదు. తమ గ్రామములో కలరా వ్యాధి నివారణ కార్యక్రమములో పాల్గొనే సందర్భములో సుశీల్, పూర్ణ అనే ఇరువురు రాజకీయ కార్యకర్తలతో పరిచయ మేర్పడుతుంది. ఇతడు భవిష్యత్తులో హింసాత్మక రాజకీయ కార్యకలాపములకు సహాయపడగలడని వారు భావిస్తారు. గౌరిపై శివనాథ్‌కు ఉన్న అనురాగము అతడి అత్తకు నచ్చదు. గౌరి మేనమామ ఆమెను కలకత్తా తీసుకుని వెళుతాడు. అక్కడ ఆమె మగశిశువును ప్రసవిస్తుంది. శివనాథ్ కాలేజి చదువు కోసం కలకత్తా వస్తాడు. అక్కడ సుశీల్, పూర్ణ అతనిని తమ రాజకీయ కార్యకలాపాలవైపు ఆకర్షిస్తారు. తమ పార్టీ ఆదేశానుసారము, ఒక పాత కార్యకర్తను హత్య చేస్తారు. ఆ కార్యకర్త ముందు హింసాత్మక కార్యక్రమములను విశ్వసిస్తాడు. కాని గాంధీజీ అహింసాత్మక సిద్ధాంతములను తెలుసుకుని, వాని లోని విశ్వాసముతో, తనవద్ద నున్న మందుగుండు సామగ్రి నాశనము చేస్తాడు. ఈ దారుణ హత్య శివనాథ్ హృదయాన్ని ముక్కలు చేస్తుంది.

ఈలోగా, శివనాథ్ తల్లి మరణిస్తుంది. అత్త కాశీయాత్రకు వెళతుంది. గౌరి, శివనాథ్ మళ్లీ కలుసుకుంటారు. తమ జమీందారీ లోని ఒక కుగ్రామము చేరుకుని, అక్కడి పేదప్రజల క్షేమానికి పాటుపడుతూంటారు. సహాయ నిరాకరణోద్యమ సందర్భములో ఆయన అరెస్టు చేయబడుతారు. అతడి అత్త, గౌరి పూర్వ స్పర్థలను విస్మరించి మంచి స్నేహితులుగ మారుతారు. ఇద్దరు కలిసి జైలులో శివనాథుని చూడటానికి వస్తారు. వాళ్ళిద్దరు అన్యోన్య ముగ వున్నందుకు శివనాథ్ చాల సంతోషిస్తాడు. తనను ప్రేమతో, జాగ్రత్తతో పెంచినట్లే, తన కుమారుని కూడ పెంచమని శివనాథ్ తన అత్తను కోరతాడు.

ఈ నవలలో తారాశంకర్ తన అత్త మరణము ధాత్రిదేవత మరణము అని వర్ణిస్తాడు. అతడి జీవిత విధానాన్ని తీర్చిదిద్దే వ్యక్తి ఆమె ఒక్కతే కాదు. ఇతడి తల్లి ఇంతకంటె ప్రముఖమైన పాత్ర వహిస్తుంది. శివనాథ్ వ్యక్తిత్వము ఒక క్రమపద్ధతిలో పెంపొందుతుంది. ఇందుకు వేరువేరు వ్యక్తులతో ఆయన సంబంధము, అతడిపై వారి ప్రభావము హేతువులు. అతడి తల్లి, అత్త, గోసాయిన్ బాబా అనే సాధువు, సుశీల్ అనే వృద్ధ విప్లవవాది-వీరంతా అతడి జీవితముపై ముద్ర వేస్తారు. గౌరి అతడిపై ఏ ప్రభావము కలిగించలేక పోతుంది. ధనమే అన్నిటికి మూలమని భావించే వ్యవస్థకు చెందిన వ్యక్తి గౌరి. నవల ఉత్తరార్థములో నిష్కల్మష ప్రేమమూర్తిగ గౌరి మారుతుంది. కాని ఆమెలో ఈ మార్పు సహజముగ, స్వభావసిద్ధముగ కనిపించదు. హింసాత్మక విధానాలు దేశములో విఫలమైనాక, పరారిగ తిరుగుతున్న సుశీల్‌కు శివానాథ్ సహాయము చేస్తాడు! ఈ వాస్తవిక చిత్రణ తారాశంకర్‌కు విప్లవవాదుల కార్యక్రమాలు క్షుణ్ణముగ తెలుసునని విశదపరుస్తుంది. ఆయన వారి విధానాలను ఎప్పుడు సమర్థించలేదు. కాని ఒక విశ్వాసానికి అంకితులై ప్రాణాల్నికూడ త్యజించిన యువతరముపై ఆయనకు అమితమైన సానుభూతి వుంది. ఈ యువకులలో కొందరు, తమ హింసాత్మక విధానాలు ఈ దేశములో విఫలమైనప్పుడు, రష్యా, జర్మనీ, అమెరికా, ఐరోపాలోని దేశాలకు పరారి అయి, అక్కడ భారతదేశ స్వాతంత్ర్యానికి కృషిచేసే కేంద్రాలను ఏర్పరచ ప్రారంభించారు. శివనాథ్ సుశీల్‌తో ఇలా అంటాడు: ఈ దేశములో అరవై ఆరు కోట్ల హస్తాలు ముష్టి మూసుకొని ప్రజల స్వాతంత్ర్య సముపార్జన కొరకు పైకి తేవాలని సంఘ కలలుకంటాను.

అదే నిజమైన ప్రజా విప్లవము' సుశీల్ శివానాథ్ పద్ధతులతో ఏకీభవించడు. అయితే, అతడికికూడ శివనాథ్‌పై ఎనిలేని గౌరవము. గౌరీపాత్ర తప్ప, ఇందులోని పాత్రలన్నీ అతి సహజమైన పరిణతిని పొందుతాయి. ఇతి వృత్త ములో మనము నమ్మలేని హఠాత్సంఘటన లేవీ ఇందులో లేవు. వర్షాభావ పరిస్థితులు, అంటువ్యాధి వ్యాప్తి అతి వివరముగ, సహజముగ చిత్రించ బడ్డాయి. ఇందులోని భాష సాఫీగ, హుందాగ నడుస్తుంది.

'గణదేవత', 'పంచగ్రామ' అనే రెండు నవలలలో ఐదు గ్రామాల కథ చిత్రించ బడింది. మహాగ్రామ, దేఖూరియా, శివకాళీపూరు, కుసుమ పూరు, కంకణ అనేవి ఈ ఐదు గ్రామాలు. అనాది కాలమునుండి ఈ నవలా రచనా కాలమువరకు అమలులో ఉన్న గ్రామపంచాయతీ వ్యవస్థ, ఆవ్యవస్థ క్షీణదశ ఈ రెండు నవలలలోను వివరముగ చిత్రించబడ్డాయి. పాత వ్యవస్థనుండి నూతన వ్యవస్థకు జరిగే మార్పు ఈ నవలలలోని ఇతి వృత్తము. ఈ ఇతివృత్తము గ్రామసీమలలోని జీవితాన్ని సంపూర్ణముగ ప్రదర్శించ గలుగుతుంది.

ప్రాచీన కాలములోను, మధ్యకాలములోను బెంగాలులోని గ్రామ ములు తొమ్మిది, ఏడు, ఐదు సంఖ్యలో సమూహములుగ చేర్చబడి, గ్రామ స్థుల అంగీకారముతో ఏర్పడిన గ్రామనిర్వహణ సంఘములచే పరిపాలించ బడుతూండేవి. ఇటువంటి సముదాయముల మూలముననే 'నవగ్రామ', 'పంచగ్రామ', 'సప్తగ్రామ' అనే పేర్లు ఉత్పన్న మయ్యాయి. ఈ గ్రామ సంఘాలు గ్రామ సముదాయాల పరిపాలనను చక్కగ నిర్వహించేవి. ఎక్కడో దూరాన వున్న పరిపాలకులు ఈ గ్రామ సముదాయాలను గురించి పట్టించుకోవలసిన అవసరము వుండేది కాదు. గ్రామ సంఘాలు జారీచేసిన ఆజ్ఞలను అందరు పాటించేవారు.

ఆ గ్రామములోని కమ్మరి 'అనిరుద్ధ' ఆ గ్రామస్థుల పనులు చేయ టానికి నిరాకరించుటతో ఉత్పన్నమైన పరిస్థితులతో 'గణదేవత' ప్రారంభ మవుతుంది. అనాదిగ, గ్రామాల్లోని కమ్మరులు, మంగళ్లు, వడ్రంగులు గ్రామ స్థులకు వారి పనులు చేస్తూండేవారు. అందుకు ప్రతిఫలముగ, గ్రామస్థులు వారికి కావలసిన ధాన్యము, ఆహారపదార్థాలు సరఫరా చేస్తూండేవారు, కాని అనిరుద్ధకు లభించే ఆహారపదార్థాలు అతడి కుటుంబానికి బొత్తుగ సరిపోయేవి కావు. అందువలన, అనిరుద్ధ ఆ గ్రామము విడచిపెట్టి, తన కృషికి తగిన

ఫలము లభించే ప్రదేశానికి వలసపోదామని అనుకుంటాడు. ఆ గ్రామసంఘం అతడిని విమర్శిస్తుంది. కాని అతడు లక్ష్యపెట్టడు. గ్రామములోని పేదవారిని తప్ప, శ్రీహరి పాల్ వంటి ధనికులను శాసించలేని గ్రామసంఘం ఆజ్ఞలను అతడు లెక్కపెట్టడు. శ్రీహరి పాల్ జిత్తులమారి, కామాంధుడు, నిరంకుశ వర్తనుడు. అతడు అనిరుద్ధ భార్య పద్మపై కన్నువేస్తాడు. పద్మకు పిల్లలు లేరు. దుర్గ అనే బౌరి స్త్రీ అతడి ఉంపుడు కత్తె. బౌరీ జాతి ప్రజలు కాయ కష్టముతో బ్రతికే నిరుపేదలు. వారి స్త్రీలు ధనికవర్గానికి చెందిన పురుషుల కామవాంఛలను తృప్తిపరుస్తూంటారు. అది అందరు ఆమోదించే పద్ధతే! దుర్గకు దేబుఘోష్ అనే బడిపంతులపై అవ్యాజమైన అనురాగము. ఆ ఊరి వారందరకు ఆయనపై అభిమానము, గౌరవము. పేద రైతుల పొలాలను తన కైవసము చేసుకుని, జమీందారీ స్థాయికి ఎగబ్రాకాలని శ్రీహరి ప్రయత్నిస్తూంటాడు. అతడికి దేబుఘోష్ అంటే భయం. దేబుఘోష్ ప్రజా నాయకుడు. ఏదో ఒక మిషపై దేబును అరెస్టు చేయిస్తాడు. ఆ ఊరి వారం దరకు దేబు అంటే ప్రాణం. ఈ చర్యవలన శ్రీహరి ఆ ఊరి వారందకు మరింత దూరమవుతాడు. ఏదో ఒక కుంటిసాకుతో దేబును అరెస్టు చేయించ టానికి నిశ్చయించుకుంటాడు. ఈ పర్యాయము, అనిరుద్ధ ఆ నేరాన్ని తన మీదవేసుకుని, అరెస్టు అవుతాడు. పద్మను బలాత్కరించాలనే శ్రీహరి కోరి కను దేబు వమ్ముచేస్తాడు. పద్మ ఇంటిలో జైలునుండి బైలు విడుదలయిన ఒక ఖైదీని ఆమెకు రక్షణగ ఉంచుతాడు. కలరా అంటువ్యాధిని నిరోధించు టకు దేబు చాల శ్రమించి పనిచేస్తాడు. కాని అతడి భార్య, కుమారుడు మరణిస్తారు. అతడి విచారానికి అవధులు లేకపోతాయి. అతడి కళ్ళముందే, గ్రామసంఘము విచ్ఛిన్నమైపోతుంది. పేదరైతుల భూములను కైవసము చేసుకుని, శ్రీహరి జమీందారు అవుతాడు. దేబుకు స్నేహితుడు, సహచరుడైన జతీన్‌ను పోలీసులు తీసుకునిపోతారు. జైలునుండి విడుదలైన తరువాత అని రుద్ధ గ్రామము విడచి వెళ్లిపోతాడు. గాఢమైన నిరాశ, నిస్పృహలకు దేబు లోనవుతాడు. అటువంటి మనఃస్థితిలో మహాగ్రామములో గ్రామసంఘానికి పెద్ద శివశేఖర న్యాయరత్న అనే సనాతనాచార పరాయణుడు, పండితుడు దేబుకు మానసిక సంతృప్తిని కలిగిస్తాడు. భూములులేని పేదరైతులు పట్నా నికి వలసపోవటం ప్రారంభిస్తారు. ఆ పట్నంలో రైల్వేయార్డు (రైళ్లకు మర మ్మత్తులు చేసే ప్రదేశము), ఒక ఫ్యాక్టరీ ఉంటాయి. ఆ పట్నానికి చేరు

ఉంటే, తిండికొరత ఉండదని వా రాశిస్తారు. పట్నం నవనాగరకతకు ప్రతీక. ఐదు గ్రామాలు ఇంకా పాతకాలపు నీడలోనే కాలం వెళ్ళబుచ్చుతూ వున్నాయి.

'రైతులవద్దనుండి ఎక్కువ శిస్తులు వసూలు చెయ్యాలి' అనే విషయములో జమీందారులంతా ఏకాభిప్రాయానికి రావటముతో 'పంచగ్రామ' నవల ప్రారంభ మవుతుంది. ఒక శతాబ్దకాలములో పొలాలలో పండిన పంటల ధరలు అధికముగ పెరిగాయి. కాని వారు చెల్లించే శిస్తులు మాత్రము పాతరేట్లలో వున్నాయి. రైతులు కూడ ఒక సమష్టిశక్తిగ మారారు. ధరలు పెరిగినమాట వాస్తవమే. వాటితోబాటు జీవనవ్యయముకూడ పెరిగింది. పైగా, జమీందారులుకూడ ప్రభుత్వానికి పాతరేట్లలోనే పన్నులు చెల్లిస్తు న్నారు. రైతులంతా మహాద్రావులోని శివశేఖరు ఇంట్లో సమావేశ మవుతారు. చట్టాలు జమీందార్లకే సహాయము చేస్తాయి కనుక, పెంచిన శిస్తులు చెల్లించుటే శ్రేయస్కరమని దేబు రైతులకు సలహా ఇస్తాడు. శివశేఖరు మనుమడు విశ్వనాథ్ రైతులను ఐకమత్యముతో వుండవలసినదని, అందువలన ప్రభుత్వము అప్పటి చట్టాలను సవరించేలా ఒత్తిడి తీసుకురాగలమని ఉద్బోధిస్తాడు. విశ్వనాథ్ అభిప్రాయాలు శివశేఖరుకు, దేబుకు ఆందోళన కలిగిస్తాయి. అతడు బ్రాహ్మణుల ఆధిక్యతను అంగీకరించడు. సనాతన ఆచారాలను తిరస్కరిస్తాడు. ఈ ప్రవర్తన శివశేఖరుకు మహాపచారముగ కనిపిస్తుంది. శివశేఖరు తన కుమారునితో – అంటే విశ్వనాథ్ తండ్రి – ఆంగ్లవిద్యాభ్యాసము విషయములో కలిగిన అభిప్రాయభేదము ఆ యువకుని ఆత్మహత్యకు దారితీస్తుంది.

మహమ్మదీయులు అధిక సంఖ్యలో వున్న కుసుమపూర్ గ్రామములో దౌలత్ షేక్ అనే చర్మవ్యాపారికి మంచి పలుకుబడి వుంది. జమీందారులను వ్యతిరేకించవద్దని అతడు దేబును హెచ్చరిస్తాడు. ముస్లిములీగువారు, మంత్రివర్గములో చాలమంది ఈ జమీందారుఁను సమర్థించుట ఇందుకు కారణము. ఆ గ్రామములోని బడిపంతులు ఇర్షద్ మహమ్మదీయ రైతులు స్వయముగ జమీందారులకు వ్యతిరేకోద్యమము నడపక పోవచ్చును కాని హిందూ రైతుల ఉద్యమాన్ని బలపరుస్తారని చెబుతాడు. కాన ఈ ఉద్యమము బాధ్యతను పూర్తిగ స్వీకరించలేనని దేబు భావిస్తాడు. తన కుటుంబములోని విషాదము అతనిని పూర్తిగా క్రుంగదీస్తుంది. పైగా, అతనికి రైతుల మనోస్వభావాలు

పూర్తి గ తెలుసు. మే నెలనుండి రైతులకు అప్పుతెచ్చుకున్న ఆహారపదార్థాలే ఆధారం. అటువంటి పరిస్థితులలో వాళ్లు జమీందారులను ఎక్కువ కాలము ఎదిరించలేరని ఆయన భయపడతాడు.

ఇప్పుడు శ్రీహరి బమీందారు శ్రీహరి ఘోష్‌గ మనకు ప్రత్యక్ష మవుతాడు. ఈ ఉద్యమము ప్రారంభము కాకముందే అణచివేద్దామని నిశ్చయించుకుంటాడు. దేబుపైన, టింకరి అనే ధైర్య, సాహసాలు కలిగిన 'భల్లా బగ్ది' తెగకు చెందిన యువకునిపైన ఒక దొమ్మీ కేసు సందర్భములో ఫిర్యాదు చేస్తాడు. పట్నములోని మిల్లు యజమానుల ప్రతినిధి, ముఖర్జీబాబు, రైతులకు పనిదొరకని నెలలలో ఆహారపదార్థాలు సరఫరా చేయడం మాని వారు తిండీ కొరతతో బాధపడేట్లు చేయమని సలహా ఇస్తాడు. మహమ్మదీయ రైతులు, హిందూ రైతులు కూడ ఎన్నో బాధలకు గురి అవుతారు. దేబుకు వ్యతిరేకముగ మతోన్మాదాన్ని రేకెత్తించాలని దౌలత్ షేక్ ప్రయత్నిస్తాడు. ఇర్షద్‌ను, కుసుమపూరులో విప్లవకారుడైన రహమ్ షేక్‌ను ఆ ఊరునుండి పంపించి వేయాలని ప్రయత్నాలు జరుగుతాయి. కుసుమపూరులో దౌలత్ షేక్, తన గ్రామములో శ్రీహరి, గ్రామస్థులపై సానుభూతి నటిస్తూ, వారికి ఆహార పదార్థాలు అప్పుగా ఇస్తారు. ఇర్షద్‌కు, దేబుకు ఈ పన్నాగములో అంత రార్థము ఆ రైతుల పొలాలను కైవసము చేసుకోవడ మని తెలుసు. వరదలు ఉప్పొంగినప్పుడు, పేదప్రజలకు సహాయము చేస్తున్నట్లు నటించి, వారి విశ్వాసాన్ని సంపాదించటానికి శ్రీహరి ఆ అవకాశాన్ని వినియోగించుకుంటాడు.

గ్రామసంఘాలకు మూలస్తంభాలైన ఆ అయిదు గ్రామాలలోని ప్రజలు క్రమేణ క్షీణించిపోతారు. విశ్వనాథ్ తన కెదురు తిరగడం సహించలేక శివశేఖర్ గ్రామము విడచి వెళ్ళిపోతాడు. టింకరి అరెస్టు చేయబడుతాడు. అతడి విధవరాలైన కుమార్తె, స్వర్ణ, విద్యాభ్యాసము కొరకు పట్నం చేరుకుంటుంది. అనిరుద్ధ భార్య పద్మ ఒక నూతన జీవితాన్ని ప్రారంభించడానికి ఆ గ్రామం విడచి వెళ్ళిపోతుంది. అనిరుద్ధ తన గ్రామానికి తిరిగి వస్తాడు. కాని అతడు పట్నంలోని పారిశ్రామిక ప్రాంతాలకు ఇంకా ఎక్కువ మందిని తీసుకుని పోవటానికే ప్రయత్నిస్తాడు. దేబు కాంగ్రెసులో చేరి, 1930 లో అరెస్టు చేయబడుతాడు. 1933 లో జైలునుండి విడుదల చేయబడుతాడు. గత శతాబ్దపు సుషుప్తిలో వున్న అయిదు గ్రామాలు మేలుకొని, వర్తమాన

కాలపు భయంకర సత్యాలను తెలుసుకో గలుగుతాయి. ఆ ప్రాంతాలలోని భూములన్నీ జమీందారుల హస్తగత మవుతాయి. వారు ఆ భూమి యజమానులైన రైతులకు ఉద్వాసన చెప్పి, సంథాల్ కూలీలను నియమిస్తారు. కర్షక సంఘాల కొరకై పరిశ్రమిస్తూ, ఇర్పద్ లా పరీక్షలకు చదువు ప్రారంభిస్తాడు. లా చదువు పూర్తిచేసిన తరువాత, జమీందారులను ప్రతిఘటించాలని ఆశిస్తాడు. ధనవంతులు ఇంకా ధనవంతు లవుతున్నారు. పేదలు నిరుపేదలుగ తయారవుతున్నారు. తానొక ప్రేక్షకునివలె ఉండలేనని దేబు భావిస్తాడు. అతడు కూడ రైతు కుటుంబానికి చెందినవాడే! రైతు ఒక వృక్షము వంటి వాడు. తానుకూడ మళ్లీ భూమిలో వేళ్లూని, పునర్జీవితము ప్రారంభించాలని నిశ్చయించుకుంటాడు. వాస్తవికత తాలూకు అవసరాలను నిర్లక్ష్యము చేయకూడదని గ్రహిస్తాడు. ఇప్పుడు ఉపాధ్యాయినిగ వృత్తి ప్రారంభించిన స్వర్ణను వివాహము చేసుకుని ఆ పాఠశాలను పునరుద్ధరించటానికి నిర్ణయించుకుంటాడు. మామూలు మనిషిగా మారి, జీవితము తాలూకు క్షణ, క్షణ సమస్యలను ఎదుర్కొని, తానుచేయ గలిగిన సేవ ఆ పంచగ్రామానికి చేయగలనని దేబు గ్రహిస్తాడు.

ఈ రెండు పుస్తకాలు నిజానికి ఒకే నవలలో రెండు భాగాలు. తన 'సాహితీ జ్ఞాపకాల' లో, తనకు బ్రాహ్మణులపైన అమితము గౌరవము ఉన్నదని, శివశేఖర్ ఒక ఉత్తమ బ్రాహ్మణుడని ఆయన వ్రాసుకున్నారు. ఆ రెండు నవలలకు 'పిత - పుత్ర' (తండ్రీ కొడుకులు) అనే కథానిక బీజ ప్రాయమైనది. ఆ కథ సంస్కృత పండితుడైన శివశేఖర్‌కు, ఆంగ్ల విద్యాధికుడైనఆయన కుమారుడు శశిశేఖర్‌కు సంబంధించినది. ఈ నవలలో శివశేఖర్ పాత్ర చాల చిన్నది. ఆయన ప్రాచీన భారతదేశానికి ప్రతినిధి. కాని ఈనాటి పాఠకులకు ఆయన మొదట తన కుమారునితోను, తరువాత మనుమడితోను పడే సంఘర్షణ అర్థవంతముగ కనబడదు. ప్రాచీన భారతీయతపై తారాశంకర్‌కు ఉన్న అభిమానము సనాతన బ్రాహ్మణులపై ఆయన ప్రదర్శించిన గౌరవము ద్వారా మనకు విశద మవుతుంది. కాని ఈనాటి యువతరానికి ఈ సనాతనాచారములలో ఎక్కువ అర్థము కనిపించదు. తారాశంకర్ ఉద్దేశ్యము ఏమైనప్పటికి, 'గణదేవత', 'పంచగ్రామ' నవలలలో బ్రాహ్మణుల ఆధిక్యతకంటె భిన్నమైన, అంతకంటె ముఖ్యమైన సాంఘిక విలువలు మనకు కనిపిస్తాయి.

ఈ నవలలలో కథానాయకులు వ్యక్తులు కారు. ఒక సాంఘిక వ్యవస్థ, ఆ సంఘములోని వ్యక్తుల సముదాయము కథానాయక స్థానానికి అర్హమైనది. వీటిలోని ప్రధానపాత్రలు ఒకే ఆర్థికవ్యవస్థకు చెందినవి. నిరుపేదలు, పీడితులు, భూమిలేని రైతులు, దోపిడి విధానానికి గురిఅయిన అభాగ్యులు వీటిలోని ప్రధాన పాత్రలు. వీటిలోని ప్రధాన సంఘటనలు వీరికి సంబంధించినవి. ద్వారిక్ చౌధురి, శ్రీహరి పాల్, దౌలత్ షేక్, ముఖర్జీ బాబు వంటివారు ఈ వర్గానికి చెందినవారు కారు. రైతాంగముపై తారాశంకర్ చూపే అభిమానము సాంప్రదాయ పద్ధతులలో పెంచబడిన వ్యక్తి ప్రదర్శించే సానుభూతి. సాంప్రదాయాన్ని అనుసరించటం అతని వారసత్వం. ఇందువలననే, ఆయన శివశేఖర్ పాత్రచిత్రణలోను, మిగిలినవారిపై ఆయన ప్రభావాన్ని వర్ణించుటలోను ప్రత్యేకమైన శ్రద్ధ చూపించారు. ఈ కర్షకులను కష్టాలలో ఆదుకొనటానికి దేబు స్వయముగ ప్రయత్నిస్తాడు. కాని శివశేఖర్ సలహాలను పాటించడు. దేబు పాత్రచిత్రణలో సామాన్య ప్రజలు, వారి ఆలోచనా ధోరణులు సంపూర్ణముగ ప్రదర్శించ కలిగారు. నిరక్షరాస్యులైన రైతుల నడుమ విద్యావంతుడైన దేబు వారికంటె ఉన్నతుడుగ, ఏదో దూరాన వున్నట్లుగ భావించక తప్పదు. తన సహజ వాతావరణమునుండి విద్య రైతును మరింత దూరముగ తీసుకునిపోయి, ఏకాకిగ చేస్తుంది. స్వభావ రీత్యా, దేబు కూడ ప్రాచీన సాంప్రదాయాలను గౌరవించేవాడు. కాని ఆ గౌరవము అతని ఆలోచనాసరణిని పూర్తిగ ప్రభావితము చేయలేకపోయింది. అతని కార్యాచరణ అధునాతన మార్గములో సాగుతుంది. ఇర్షద్, దేబు మాత్రమే చివరివరకు రైతుల హక్కుల పరిరక్షణకోసం కృషిచేస్తారు. 'హన్సూలి బంకర్ ఉపకథ' లోని కరాలి పాత్రకు అనిరుద్ధ మార్గదర్శకమైన పాత్ర. అతడు రైతుకాదు. నేలను నమ్ముకున్న వ్యక్తికాడు. వృత్తిరీత్యా అతడు కమ్మరి. శిథిలమైపోతున్న సాంఘిక వ్యవస్థలోని చేదు నిజాలను గ్రహించలేని గ్రామానికి ఎదురు తిరుగుతాడు. అతని తిరుగుబాటు సహజమైనది, హేతుబద్ధమైనది. అందువలననే, తన తోటి గ్రామస్థులకు జీవనభృతి కోసం పారిశ్రామిక రంగములో పని వెతుక్కుంటూ పట్నాలకు వెళ్ళమని సలహా ఇస్తాడు.

బీరభూమి జిల్లాలో గ్రామాలలోని ప్రజలు, వారి గ్రామాలను విడచిపెట్టి, రైల్వేకార్ఖానాలు, బియ్యపు మిల్లులు వున్న పట్నాలకు వలసపోతూండే

వారు. 'కర్మాగారము', 'కార్మిక వర్గము' అనే పదాలు వాడటంలో తారా శంకర్ ఉద్దేశము పాఠకులకు సులభముగ అర్థంకాదు. ఆనాటి జనాభా లెక్కలు, మిగిలిన నివేదికలు ఒక విషయాన్ని స్పష్టముగ తెలియజేస్తాయి. ఈ శతాబ్దపు మూడవ దశాబ్దములో బీరభూమిలో చెప్పుకోదగిన పరిశ్రమలు నెలకొల్పబడలేదు. కొన్ని బియ్యపు మిల్లులు, రైలు మార్గాలున్న ప్రాంతాలలో కొన్ని రైల్వే యార్డులు మాత్రము వుండేవి. ఆనాటి నివేదికలు ఇంకొక విషయాన్నికూడ వెల్లడిస్తాయి. బీరభూమి జిల్లాలోని ప్రజలు, ఎందువలననో, ఇతర జిల్లాలోని జీవన భృతికోసం వలసపోటానికి ఇష్టపడలేదు. పశ్చిమ బెంగాలులోని మిగతా జిల్లా లన్నిటికంటె ఈ జిల్లాలోనే తరతరాలుగ ప్రజలు ఒక గ్రామములోనే ఉంటూవచ్చారు. శతాబ్దాలుగ ఒకే ప్రదేశములో నివసించుటవలన పాత జీవన విధానాలను మొండిగ అనుసరించుట సహజము. ఈనాటివరకు బీరభూమి జిల్లాలో వ్యావసాయిక సమస్యలు ఉత్పన్న మవుతూనే వున్నాయి. ఇందుకు కారణము, అచ్చటి ప్రజలు భూమిని ఇంకా తమ జీవనాధారముగ నిలబెట్టుకొనుటకు ప్రయత్నించటం. అందువలన తారాశంకర్ కార్మికవర్గమని వర్ణించేవారు నిజానికి రైల్వే కార్ఖానాలోను, బియ్యపు మిల్లులలోను పనిచేయటానికి వలసపోతున్న రైతాంగమని మనము గ్రహించవచ్చు.

రైతాంగాన్ని పూర్తిగా అధోగతి పాలుచేస్తున్న ఆర్థిక దుస్థితియొక్క విషాద గాథను తారాశంకర్ అసమానమైన అవగాహనతో, సానుభూతితో చిత్రించారు. జమీందారు లంతా కూడబలుక్కుని, రైతుల కన్యాయము చేయ ప్రయత్నిస్తే, రైతులుకూడ తమ విభేదాలను మరచిపోయి సమైక్యముగ పనిచేస్తారు. నిజానికి, వర్గభేదము ఆర్థికవ్యత్యాసాలు బట్టి ఏర్పడుతుంది. మిగిలిన విషయాలు అంత ముఖ్యమైనవి కావు. జమీందారులకు వ్యతిరేక ముగ సమ్మె చేయాలనే నిర్ణయాన్ని మతవైషమ్యాలను రేచ్చకొట్టేవారు తప్ప ఇంకెవరు ప్రతిఘటించరు. తమ రచనలలో తారాశంకర్ మత సంబంధమైన అనేక ఆచార వ్యవహారాలను చిత్రించారు. కాని ఆయన ఆదర్శప్రాయమైన వ్యవస్థనుకాక, యదార్థముగ కండ్లముందున్న మత వ్యవస్థను ఆయన చిత్రించారు. ఆ మతాచారాలు మన సంఘములో ఇప్పుడు కూడ అనుసరించబడుతూనే వున్నాయి. భారతదేశములోని వర్తమాన చరిత్ర ఆయనకు పూర్తిగ తెలును. చారిత్రక పరిణామములోని ఆద్యంతములు

మన కవగితము కావు. చారిత్రక వికాసము ముఖ్యముగ రెండు విధాలుగ జరుగుతుంది. చరిత్ర ముందుకుగాని, వెనుకకుగాని నడుస్తుంది. ఈ చరిత్ర గమనములో పాత కొంత విసర్జించబడుతుంది; కొంత సంరక్షించబడు తుంది. ప్రగతిలో కొత్త ప్రమాణాలను సాధించటానికి ప్రయత్నము జరుగు తుంది. దేబు ఒకవైపు శివశేఖర్‌కు సన్నిహితుడుగ వుంటూ, వేరొకవైపు రైతుల ఆందోళనలో పాల్గొనటం విరుద్ధమైన విషయమేమీ కాదు. ఈ దేశ ములో విద్యావంతులమని చెప్పుకునేవారు కూడ సాముద్రికుల వెంట, భగ వంతుని అపరావతారములని భావించబడే వారి వెంట తిరుగుతూ వుంటారు. ఒక దృక్పథమును విడచిపెట్టి వేరొక దృక్పథాన్ని అలవరచుకోవటము సూత్రప్రాయముగనే జరిగింది. మన హృదయాంతరాలలో ఆధునికకాలముతో బాటు ప్రాచీన కాలము, మధ్య కాలము కలసిమెలసి వుంటాయి. ఈ మేళ వింపును తారాశంకర్ పూర్తిగ అర్థము చేసుకున్నారు. అందువలననే, అతని పాత్రలలో మౌలికమైన మార్పులు కనిపించవు. జరిగేమార్పులు సహజముగ, హేతుబద్ధముగ, ఒక క్రమపద్ధతిలో జరుగుతాయి. దయా దాక్షిణ్యాలు లేనివాడు, అధికారవ్యామోహపరుడుగ శ్రీహరి తయారవుతాడు. పోలీసుల బారినుండి దుర్గ దేబును రక్షిస్తుంది. వ్యభిచారస్త్రీ, దుర్గ అనురాగ మూర్తిగా పరివర్తన పొందుతుంది. దీనికి ఆమెపై దేబు ప్రభావం కారణం. దేబు అందరితో అత్యంతగౌరవముతో, మర్యాదతో ప్రవర్తిస్తాడు. పురుషు లలో, స్త్రీలలో ఉత్తమ నైతిక ప్రవర్తనకు దోహదము చేయగలుగుతాడు. మిగిలినవారంతా గ్రామాన్ని విడచి వెళ్ళిపోయినా, ఇర్షద్, దేబు మాత్రము ఆ గ్రామాన్ని విడచిపెట్టరు. ప్రతీపశక్తులతో పోరాటానికి అంతులేదని, అందువలన బలవంతులైన శత్రువులతో ఆ పోరాటము నిరంతరము సాగు తూనే వుండాలని వారికి తెలుసు. గ్రామములో సేవాకార్యక్రమాలలో పాల్గొన టానికి స్వర్ణ, గౌరి ముందుకు వస్తారు. గ్రామముయొక్క చరిత్ర దేశచరిత్ర దృక్కోణమునుండి ప్రదర్శిస్తారు. ఆయన ఈ విధముగ గ్రామము దేశానికి యావత్తూ కేంద్రమని నిరూపిస్తారు. ఇంతేకాక గ్రామము పాడుపడితే, దేశములోని ప్రగతికూడ కుంటుపడుతుందని ఆయన సూచిస్తారు.

ఈ రెండు నవలలలో కథాకథనము మంచి బిగువుకలిగి వుంటుంది. వీటిలో పాఠకులకు విసుగు కలిగించి అర్థముకాని పొడవైన వర్ణనలు లేవు. భాషను అతి పొదుపుగ వాడటం మనకిందులో కనిపిస్తుంది. మిగతా నవల

లలోవలె భాష ప్రౌఢముగ, ఆడంబరముగ కాక, వీటిలో అతిసరళముగ సాగుతుంది. ఈ నవలలు ఉత్తమ నవలలుగ పరిగణించటానికి ఇంకా కారణాలు లేకపోలేదు. ఆధారరహితమైన ఊహాగానము, వాస్తవాన్ని విస్మరించే కవితాదృష్టి ఈ నవలలలో కనిపించవు. కథా సంవిధానములో చెప్పుకోదగిన నిష్పాక్షిక దృష్టి కనిపిస్తుంది. కథాకథనములో ఆయన ఏ వర్గముపైన అత్యంత అభిమానమును ప్రదర్శించలేదు. పాత్ర లన్నింటిపైన ఒకేవిధమైన సానుభూతిని అవగాహనను కనబరచారు. వీనిలో కేంద్ర ప్రాయమైన కథ అంటూ ఏమీ ప్రధానముగ లేదు. ఈ అయిదు గ్రామాల లోని జీవన విధానమే ఈ నవలలోని ఇతివృత్తము. ఈ గ్రామాలలోని వ్యక్తులు, వారి జీవిత గాథలు సన్నిహితముగ అల్లుకుని వుంటాయి. అందు వలన, ఆ కథలు లేకపోతే ఈ నవలలను ఊహించలేము. ఈ రెండు నవలల రచనలలో తారాశంకర్ ఉన్నత సాహిత్య ప్రమాణాలను అందుకో గలిగారు. కలకాలము ఇవి ఉత్తమ రచనలుగ నిలువగలవు. ఈయన ననుసరించి రచనలు చేయుట కష్టసాధ్యం. ఆయన శైలిలో రచనలు చేయు టానికి అక్కడి ప్రజలను గురించి, చారిత్రక, కాలానుగత సత్యాలనుగురించి పరిపూర్ణమైన అవగాహన అవసరం! ఈనాటి రచయితలలో అటువంటి అవగాహన తక్కువ. ఈ సందర్భములో సతీనాథ్ భాదురి అనే రచయిత జ్ఞాపకానికి వస్తాడు. ఆయన వ్రాసిన 'జాగరి' (జాగరణ), 'దోన్‌రాయ్ చరిత మానస్' (ధోన్‌రాయ్ జీవిత గాథ) అనే నవలలు పేర్కొనదగినవి. కాని ఆయన కృషిచేసిన సాహిత్య ప్రక్రియ విభిన్నమైనది. తారాశంకర్‌ను అనుకరించిన రచయితలు ఉన్నప్పటికీ, ఆయన సాధించిన సాహిత్య గౌర వముయొక్క విలువ ఏ మాత్రము తగ్గదు.

## ప్రకరణము 8

"రాయ్ కమల్" మొదట కథానికగా "కల్లోల్" పత్రికలో 1929 వ సంవత్సరములో ప్రచురించబడినది. తరువాత, ఆ కథను తారాశంకర్ నవలగా తిరిగి వ్రాసారు. ఆయనకు వైష్ణవులతోను వారి ఆచార వ్యవహార

ములతోను వున్న సన్నిహిత సంబంధము ఆయన "సాహితీ జ్ఞాపకాలు" లో కనిపిస్తుంది. వైష్ణవుల దృష్టిలో ప్రేమ వ్యక్తిగతమైనది. భౌతికమైనది మాత్రమే కాదు. నిజమైన ప్రేమ ఒక్కటే! అది శ్రీకృష్ణ ప్రభువునందలి ప్రేమ మాత్రమే. నవల ప్రారంభములో తారాశంకర్ ఉత్తమ వైష్ణవ కవి శేఖరుడు జయదేవుని పేర్కొంటారు. జయదేవుడు "గీతగోవింద" కర్తగ విశ్వవిఖ్యాతి నార్జించినవాడు. ఆయన 12 వ శతాబ్దములో బీరభూమిలో నివసించినవాడే. వైష్ణవ తత్వము జయదేవునికి ముందుకూడ బెంగాలులో ప్రాచుర్యము పొందినది. చైతన్య మహాప్రభువు కాలానికి ఆ తత్వము ప్రబల ముగ వ్యాపించినది. ఈనాటికి కూడ ఆ తత్వములోని కొన్ని ఆచారాలు సామాన్య ప్రజలను ఆకర్షిస్తూనే వుంటాయి. వైష్ణవ తత్వములో కులాల సంకుచితతత్వము కనిపించదు. మానవు లంతా ఒక్కటే. వైష్ణవతత్వాన్ని స్వామి వివేకానంద సంఘ బహిష్కృతులకు, మత తిరస్కృతులకు, అభాగ్యు లకు ఆశ్రయమిచ్చే మత శాఖ అని కొనియాడారు.

వైష్ణవులు అధిక సంఖ్యాకులుగ వున్న ఒక గ్రామములో "కమలిని" అనే వైష్ణవ యువతి తన తల్లి కామినితో నివసిస్తూ వుంటుంది. కామిని వితంతువు. ఒక ఆశ్రమాన్ని ఆమె నడుపుతూ వుంటుంది. ఆ ఆశ్రమానికి రసికదాసు అనే వృద్ధ వైష్ణవ భక్తుడు వస్తూవుంటాడు. అతడు కమలినికి రాయ్ కమల్ అని నామకరణము చేస్తాడు. ఆ గ్రామములో ధనవంతులైన మహేశ్వర్ కుమారుడు రంజన్‌ను ఆమె ప్రేమిస్తుంది. ఆమెను పెండ్లిచేసు కొనుటకు వైష్ణవ మతాన్ని స్వీకరించటానికి సిద్ధమవుతాడు. తన ఒక్కగా నొక్క కొడుకును తనకు కాకుండ చేయవద్దని మహేశ్వర్ రాయ్‌కమల్‌ని వేడుకుంటాడు. కామిని, రాయ్‌కమల్, రసికదాస్ ఆ గ్రామాన్ని విడచి చైతన్య మహాప్రభువు జన్మస్థలమైన నవద్వీపానికి వెళ్ళిపోతారు. అక్కడ కామిని మళ్లీ తన ఆశ్రమాన్ని స్థాపిస్తుంది. కొంత కాలానికే కామిని మరణిస్తుంది. రాయ్‌కమల్ రసికదాసుని వివాహము చేసుకుంటుంది. వయసుమీరిన వ్యక్తిని వివాహము చేసుకొనుటవలన శారీరక వాంఛల నధిక మించ గలనని ఆమె ఆశిస్తుంది. కాని రసికదాసులో అంతవరకు నిద్రాణమై వున్న శారీరక వాంఛలు మేలుకొని అతనిని కలవరపరుస్తాయి. మహాభక్తు డైన వైష్ణవునిలో ఈ వికారాలు అతని ఆధ్యాత్మిక పతనానికి నిదర్శనాలు. నవద్వీపాన్ని వదలి వారిద్దరు అనేక ప్రదేశాల్లో పర్యటించి చివరకు తమ

స్వగ్రామము చేరుకుంటారు. అక్కడ రాయ్‌కమల్ మళ్ళీ ఆశ్రమాన్ని నెల కొల్పుతుంది. రంజన్ తనకు మాటదక్కించలేదని తెలుసుకొంటుంది. అతడు వైష్ణవ మతాన్ని స్వీకరించి "పారి" అనే యువతిని వివాహము చేసు కుంటాడు. జయదేవుని ఆలయమువద్ద రాయ్‌కమల్ అతణ్ణి కలుసుకుంటుంది. వాళ్ళిద్దరు మళ్ళీ చేరువవుతారు. కొంత కాలం అమితానందముతో గడుస్తుంది. కాని కొంతకాలానికే రంజన్ ఇంకొక యువతిని చేరదీస్తాడు. రంజన్‌కు కామదాహము ఎక్కువ. అతనికి కావలసినది పరువములోవున్న పడతులు. ప్రేమయొక్క ఔన్నత్యాన్ని అతడు ఎరుగడు. ప్రాపంచికమైన ప్రేమను విశ్వసించుట వ్యర్థమని ఈ అనుభవము ద్వారా రాయ్‌కమల్ పూర్తిగ గ్రహిస్తుంది. ఆమె ఇప్పుడు నిజమైన వైష్ణవ భక్తురాలిగా మారి భక్తి గీతాలు ఆలాపనచేస్తూ నిర్దిష్టముగాని గమ్యాన్ని వెదుక్కుంటూ ఆమె వెళ్ళిపోతుంది.

వైష్ణవ మతములోని ఆధ్యాత్మిక మత విషయములను గురించి లోతైన పరిశీలన ఈ నవలలో మనకు కనిపించదు. నిస్సంగత్వము, నిరాపేక్ష వైష్ణవ మతములోని ప్రేమతత్వము యొక్క విశిష్ట లక్షణాలు. నిజానికి "రాయ్ కమల్" విశిష్టమైన ప్రేమ గాథ, ఇందులోని పాత్రలు అతి సహజ మైనవి. శారీరక వాంఛలకు దాసులు. అందువలననే అవి సజీవ పాత్రలు. ఈ నవలలో భక్తి తత్వముకంటె ప్రేమ తత్వమే ఎక్కువగ కనిపిస్తుంది. నవల అంతిమ ఘట్టములో తాను అచంచలమైన ప్రేమతో ప్రేమించిన రంజన్‌ను రాయ్‌కమల్ వదలి వెళ్ళిపోవుటతో ఈ నవల ఒక ఉదాత్త స్థాయికి చేరుకుంటుంది. రంజన్ ప్రేమను మించిన ఉత్తమ ప్రేమను అన్వే షిస్తూ ఆమె పయనిస్తుంది. కాని ఆమె ఆశయము ఆ అన్వేషణ కాదు. రంజన్ పతనాన్ని ఆమె కనులారా చూసి సహించలేక అతనికి దూరముగ ఆమె వెళ్లిపోతుంది. ఇందులోని భాష రసాత్మకమైనది. రసికదాసు పాత్ర అద్భుతముగ చిత్రించబడింది. రంజన్ పాత్ర చిత్రణ కొంత లోపభూయిష్ట ముగ కనిపించినప్పటికి రాయ్‌కమల్ పాత్ర చిత్రణలో రచయిత అమిత మైన శ్రద్ధ ప్రదర్శించారు. రంజన్‌పై ఆమెకున్న అచంచలమైన ప్రేమ ఆమెను ఉన్నత స్త్రీ మూర్తిగా తీర్చిదిద్దుతుంది. ఈ చిన్న నవలలో కథా కథనము మంచి బిగువుతో నైపుణ్యముతో కొనసాగుతుంది.

సంగీతములోను, నాట్యకళలోను, ప్రవీణులైన వారకాంతలు తారా శంకర్‌ను అమితముగ ఆకర్షించారు. ఆయన వారి జీవితాలను స్వయముగా

పరిశీలించారు. వారు జీవితాన్ని స్వేచ్ఛగా అనుభవిస్తారు. మానవ ప్రేమకు వారు అధిక ప్రాముఖ్యము నిస్తారు. ఇటువంటి వారి జీవన విధానము కథలకు మంచి ఇతివృత్తము కాగలదు. మట్టిలో పుట్టి మానవ సహజమైన మౌలిక వాంఛలకు లోనయ్యే సామాన్య ప్రజలను తమ రచనలలో చిత్రించుటలో ఆయనకు అసమానమయిన ప్రతిభవుంది. నవలలలో కథావస్తువుగ జానపద కవి జీవిత గాథ ఆయనను ఎక్కువగ ఆకర్షించింది. వంగ సాహిత్యంలో కెల్ల ఉత్తమ భావనా పరిణతి కలిగిన నవల "కవి", ఈ జానపద కవి చరిత్రకు సంబంధించినది. పల్లెప్రాంతాలలో కనిపించే "కవియల్" అనే కవి – గాయకులు నిరక్షరాస్యు లైనప్పటికి తరతరాలుగ మత గ్రంథాలతోను, జానపద విజ్ఞానముతోను, గాథలతోను. పురాణాలతోను, ఇతిహాసాలతోను వారికున్న పరిచయమువలన వారి గీతాలలో చెప్పుకోదగ్గ సాహిత్యపు విలువలు కనిపిస్తాయి. మనదేశములోని నిరక్షరాస్యులు నిజానికి అజ్ఞానులు, అవివేకులు ఏమాత్రము కాదు. వారిలోని సాంస్కృతిక, కళాత్మక ప్రతిభ కొనియాడదగినది. ఈ కవి – గాయకలు ఆశువుగ గీతాలను రచించి, వాటికి అందమైన రాగాలను జోడించగలరు. వీరిలోని కవితాస్పర్థ (కవిర్ లార్రై) దేశములోని ఇతర ప్రాంతాలలోకూడ వేరువేరు రూపాలలో వుండవచ్చును. ఇద్దరు కవి - గాయకుల నాయకత్వములో రెండు బృందములవారు ఈ స్పర్థలలో పాల్గొంటారు. ఒక బృందమువారు మరొక బృందమువారిని సంగీతములోను కవిత్వములోను చిత్తుచేయాలని ప్రయత్నిస్తారు. ఒక బృందమువారు పాట ద్వారా ఒక సమస్యను ఇస్తే, మరొక బృందమువారు ఆశువుగా రచించిన పాట ద్వారానే సమాధాన మివ్వాలి. "కవి" 1944 లో ప్రచురించబడింది. ఈ నవల రచించుటకు ముందు తారాశంకర్ పదకొండు సంవత్సరాలుగ కలకత్తాలో నివసిస్తూ ఉండేవారు. ఈ నవలలోని కథా కాలము ప్రతి పట్నములోను, పెద్దగ్రామాలలోనుకూడ సినిమా హాళ్లు అవతరించని రోజుల నాటిది. ఆ రోజుల్లో ఈ కవి – గాయక బృందాలు అప్పటి ప్రజలకు సాంస్కృతిక వినోద కాలక్షేపములు సమకూరుస్తూ వుండేవి. వీర భూమిలో చెప్పుకోతగ్గ జానపద సంగీత సాంప్రదాయము వుండేది. ఈ నాటికికూడ ఈ కవి – గాయక బృందాలు ప్రజానీకాన్ని ఎక్కువగ ఆకర్షిస్తూనే వుంటాయి.

"దోమ్" అనే కడజాతికి చెందిన నితాయ్ జానపద కవిగా మంచి పేరు సంపాదించుకుంటాడు. ఈ విషయము ఆ గ్రామస్థులకు ఎక్కువ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆ రోజులలో కడజాతివారుగ పరిగణించబడుతున్న దోమ్ తెగవారు, ఒకప్పుడు పేరుపడ్డ యోధులు. వారు ఆ ప్రాంతాలలోని సామంతరాజుల సైన్యములో కొలువు చేస్తూండేవారు. ఆ వ్యవస్థ అంతరించిన తరువాత వారు దొంగతనాలు మొదలు పెట్టారు. ప్రభుత్వమువారు కొన్ని తెగల వారిని నేరస్థులుగ ప్రకటించారు. దోమ్ తెగవారు నేరస్థులుగ ప్రకటించబడలేదు. కాని వారు నేరస్థులని అందరకు తెలుసు. కాని ఆ తెగకు చెందిన నితాయ్ కవిగా పేరుతెచ్చుకోవడం ఈ ఆశ్చర్యానికి కారణము. నితాయ్ వంశ వృక్షము ప్రత్యేకముగ పేర్కొన దగినది. అతని మాతామహుడు, పితామహుడు పేరుపడ్డ హంతకులు. మేనమామ గజదొంగ. అతని తండ్రి అయితే ఆ పరగణాలలోకెల్ల పేరు పడిన చోర కళా ప్రవీణుడు. అతడు ఆరడుగుల ఆజానుబాహువు. దృఢముగ కాకలు తీరిన శరీరము, మెత్తని చీకటిలా నిగనిగలాడే నల్లని శరీర ఛాయ. అతని విశాలమైన కళ్లలో ఒక విధమయిన సాధుత్వము కనిపిస్తుంది. అట్టహాస గ్రామములోని ప్రజలు ఒక సందర్భములో కవి - గానము ఏర్పాటు చేస్తారు. ఆఖరి క్షణములో నూతన్ దాస్ అనే ప్రసిద్ధ కవి-గాయకుడు ఆ కార్యక్రమములో పాల్గొనడానికి నిరాకరిస్తాడు. ఆ సమయములో నితాయ్‌కు తన ప్రతిభ ప్రదర్శించుటకు మొదటి అవకాశము లభిస్తుంది. ప్రతిపక్ష బృందానికి చెందిన మహాదేవ్ నితాయ్‌ను రెండవ బృందానికి నాయకత్వము స్వీకరించి కార్యక్రమాన్ని విజయవంతము చేయమని కోరతాడు. ఆ కార్యక్రమములలో నితాయ్ ప్రతిభ అందరకు వెల్లడవుతుంది. ఇంతకు పూర్వము రాజారామ్ అనే రైల్వే పనివాడు అతని భార్య, ఠాకూర్‌జీ అనే అతని వదిన మాత్రమే నితాయ్ ప్రతిభను గుర్తించినవారు. నితాయ్‌పై ఠాకూర్‌జీకి ప్రకటించడానికి వీలులేని ప్రేమ. నితాయ్‌కు ఆ ప్రేమ తెలుసును. కాని అతడు ఆమెకు ప్రేమించడానికి సాహసించడు. అందుకు రెండు కారణాలు ఉన్నాయి. ఆమె వివాహిత. పైగా నితాయ్ కవిగా మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించవలెనని ఆశపడుతూ వుండేవాడు. బయట ప్రపంచంలో పేరు ప్రఖ్యాతులను వెదుక్కుంటూ నితాయ్ వెళ్ళిపోయినప్పుడు, ఠాకూర్‌జీ నవనాడులు కృంగినట్లు బాధపడుతుంది. అమె పరిస్థితిని చూసి ఏవో భూతాలు ఆమెను

ఆవహించాయని ఆ గ్రామస్థులు భావిస్తారు. నితాయ్ ప్రఖ్యాత కవి-గాయకు డుగా పేరు సంపాదించిన తరువాత బసంత అనే ప్రసిద్ధ నర్తకి అతనిని ప్రేమిస్తుంది. ఆమె ఝూమూర్ నృత్యబృందానికి చెందిన నర్తకి. ఈ ఝూమార్ తెగకు చెందినవారు గ్రామాలలోని ప్రజలను తమ నృత్యాలలోను పాటల తోను ఆనందింప చేస్తారు. వీరిలోని నర్తకిమణులు ప్రజలకు మంచి వినోద కాలక్షేపాన్ని అందజేస్తారు. బసంత అందచందాలు నితాయ్‌ని ముగ్ధుణ్ని చేస్తాయి. ఏపని చేసినా బసంత గాఢాభినివేశముతో చేస్తుంది. తన జీవిత కాలము తన కోర్కెలకు చాలదేమో అన్నంత ఆవేశముతో, ఆవేగముతో ఆమె జీవిస్తుంది. నితాయ్‌ను కూడ ఆమె అతి గాఢముగా ప్రేమిస్తుంది. అతనిని పూర్తిగ తనవానిగ చేసుకోవాలనే తపన. ఆమె రాత్రంతా మద్యపానము చేస్తూ, నాట్యము చేస్తూ అత్యధికమైన ఆవేశముతో అలసిపోతూ వుంటుంది. "ఆమె కళ్ళలో ఏదో ఒక వింతకాంతి కనిపిస్తుంది. మధువు సేవించిన మత్తుతో ఆమె కళ్లు తేలిపోతూంటే ఆ కళ్లు ఎఱ్ఱగా, పదునుగా, రక్తారుణి మతో మెరిసే అసిలా, కసిగా కనిపిస్తాయి." నితాయ్ ఆమెకు శాంతిమయ జీవితాన్ని ప్రసాదిద్దామని ఆశపడతాడు. కాని తాను క్షయవ్యాధిగ్రస్తురాల నని, కొద్దికాలములోనే మృత్యువు పాలవుతానని ఆమెకు తెలుసు. జీవితము లోని చేదు నిజాలు తారాశంకరుకు క్షుణ్ణముగా తెలుసు. అందువలన ఆమెలో హఠాత్తుగ హృదయపరివర్తన జరిగినట్లు ఆయన చిత్రించలేదు. ఆమె తన మరణాన్ని ఆహ్వానించిన తీరు ఆమె పాత్రను మహోన్నతముగ తీర్చి దిద్దుతుంది.

మరణానికి కొద్ది క్షణాలు ముందు, ఆయనలోని జ్వరతీవ్రత తాలూకు అశాంతి, ఆందోళన క్షణకాలము శాంతిస్తాయి. ఒక అనిర్వచనీయమైన శాంతి, సంతృప్తి! ఆమె విశాలమైన కళ్లు మరింత విశాలముగ ప్రకాశిస్తాయి. "నేను చనిపోతున్నాను కదూ?" ఆమె అడుగుతుంది.

ఒక శుష్కహాసముచేసి నితాయ్ తన చేతివ్రేళ్ళలో ఆమె ఫాలాన్ని నిమురుతూ—"భగవంతుని నామము స్మరించుకో, బసంతా. గోవింద నామ స్మరణ నీ బాధకు తప్పకుండా ఉపశమనము కలిగిస్తుంది."

అంతటి అనారోగ్యములోను, ఆమె హఠాత్తుగా, విల్లునుండి సంధింప బడిన బాణమువలె, ఇంకొకవైపుకు తిరిగి ఇలా అంటుంది: "భగవంతుడు!

ఈ క్షణములో భగవంతుణ్ణి నే నెందుకు స్మరించుకోవాలి? నాకు భగవంతుడు ఏమి ప్రసాదించాడు? ఒక భర్తా? పిల్లలా? సంసారమా?"

తప్పుచేసినవాడిలా నితాయ్ నిశ్శబ్దముగా వుండిపోతాడు.

బసంత ఈమారు ఇంకొకవైపుకు ఒత్తిగిలి నెమ్మదిగా ఇలా అంటుంది: "గోవింద! ఈ దీనురాలిపై దయ చూపించు ప్రభూ! వచ్చే జన్మలోనైనా నాపై నీ కరుణావీక్షణాలు ప్రసరించు ప్రభూ!" ఆమె విశాలమైన నేత్రాలు, వర్షాకాలములో పద్మదళాలు వర్షజలములో నిండినట్లుగా, అశ్రుపూర్ణములవుతాయి. తన ఉత్తరీయపు అంచుతో మృదువుగా నితాయ్ ఆమె కన్నీటిని తుడుస్తాడు. "బసన్" అని మృదువుగా పిలుస్తాడు.

"నన్ను మళ్ళీ అలా పిలవద్దు.... .... ...పిలవద్దు .. ........"

....మరుక్షణమే ఆమె అతని ఒడిలోకి నిర్జీవముగా ఒరిగిపోయింది.

ఆమె మరణానంతరము నితాయ్‌లో కీర్తిప్రతిష్ఠలపై కోరిక అంతరిస్తుంది. ఠాకూర్‌జీ అతడు పతకము సంపాదించవలెనని ఆశపడింది. ఆమె ఆశ నెరవేర్చటానికే అతడు పోటీలో పల్గొని పతకాన్ని సంపాదిస్తాడు. ఆ పతకాన్ని తీసుకుని ఠాకూర్‌జీవద్దకు వెడతాడు. ఈలోగా, అతని రాక కోసం ఎదురుచూసి చూసి ఆమె కూడ మరణిస్తుంది. నితాయ్‌లోని ప్రేమ వాంఛ నెరవేరదు. అతనికి మంచి పేరును సంపాదించిపెట్టిన పాట అతని జీవితములో నిజమవుతుంది.

నా హృదయానికి నా అనురాగం
చేకూర్చదు సంతృప్తి-
ఈ జీవితకాలములో ముగియదు
నా అన్వేషణ-
ఈ జీవితం ఇంత సంకుచితం-
ఎందువల్ల? ఎందువల్ల?

ఈ ఇద్దరి స్త్రీలతో అతని సంబంధము ఆధారముగ నితాయ్ పాత్ర చిత్రణ చేయబడింది. మనస్సును ఆకట్టుకొనే వినయసంపద జన్మతః అతనికి సంక్రమించింది. గీత రచయితగా పేరు ప్రఖ్యాతులు సంపాదించినప్పటికి అతనెప్పుడు తన గతాన్ని మరచిపోలేదు. తన భావపరంపరను తాను రచించిన గీతాల ద్వారా వ్యక్తముచేసి కొంత సంతృప్తిని పొందగలుగుతాడు. బసంత, ఠాకూర్‌జీ పాత్రల చిత్రణలో కూడ తారాశంకర్ అత్యంత సాను

భూతి, అవగాహన ప్రదర్శించారు. బసంత పాత్ర చిత్రణలో ఆయన ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు. ఈ రెండు ప్రేమమూర్తుల చిత్రణలో నితాయ్ పాత్ర పరిపూర్ణత్వాన్ని సంపాదించుకొంది. "కవి" ముఖ్యముగ వంగరాష్ట్ర గాథ. నితాయ్‌కు పోలినవారు భారతదేశములో ఇతర ప్రాంతములలో వుంటే వుండవచ్చును. కాని ఈ నవలలోని స్థానిక వాతావరణము, కవితామధురిమ, తారాశంకర్ జన్మభూమి అయిన బెంగాలులోని పశ్చిమప్రాంతానికి నిస్సందేహముగా చెందినవి. వంగసాహిత్యములోని భావనాత్మక రచనలలో ఉత్తమమైనదిగ ఈ నవల పరిగణించబడుతూంది. నితాయ్ అతని ఇద్దరి ప్రియురాళ్ళకు సంబంధించిన విషాద ప్రేమగాథతోపాటు ఇంకొక విషాదగాథ జోడింపబడినది. తక్కువ కులానికి చెందిన ఒక వ్యక్తి వర్ణవ్యవస్థలో చిక్కుకున్న సంఘములో తనకొక అర్హమైన స్థానాన్ని సంపాదించుకోవటానికి చేసే ప్రయత్నము, ఆ ప్రయత్నములోని విషాదమయ పరిణామము ఈ నవలలో మనకు కనిపిస్తాయి. అసమానమైన ప్రతిభ పాటవాలు ఉన్నప్పటికి నితాయ్ తన జీవితంలో తన తక్కువ కులముయొక్క ప్రభావమునుండి తప్పించుకోలేకపోతాడు. తారాశంకర్ రచించిన ఉత్తమ నవలలలోని ప్రధాన పాత్రలు సంఘములో అట్టడుగున ఉన్న అభాగ్యులు, సగటు మనుషులు. ఈనాడు కూడ భారతదేశానికి వారే నిజమైన ప్రతినిధులు. ప్రాంతీయ వాతావరణము ఆయన రచనలలో ప్రస్ఫుటముగ వున్నప్పటికి తారాశంకర్ తమ నవలలలో భారతీయతను కూడ ప్రదర్శించగలిగారు. ఆయన రచనలలో సంపూర్ణమైన భారతీయత మనకు ప్రత్యక్షమవుతుంది. వారి రచనల ద్వారా భారతదేశములోని సామాన్యప్రజల అంతరాంతరాలలోని భావాలను మనము తెలుసుకోగలము. ఇందువలన మనము భారతదేశాన్ని అవగాహన చేసుకోవటానికి అవకాశము కలుగుతుంది.

## ప్రకరణము 9

తారాశంకర్ రచించిన అత్యుత్తమ నవలలలో ఒకటిగ "హన్సూలి బంకర్ ఉపకథ"ను అందరు పరిగణిస్తారు. వంగసాహిత్యములో కూడ ఈ నవలకు ప్రత్యేకస్థానము వుంది.

బీరభూమి జిల్లాలో ప్రవహిస్తూన్న "కోపై" నది వంపులు తిరిగి పరుగులు తీస్తుంది. ఆ వంపులలో ఒక వంపు గ్రామాలలోని స్త్రీలు ధరించే హన్సూలి అనే కొడవలి ఆకారములో వున్న కంఠహారమువలె కనిపిస్తుంది. ఈ వంపు మధ్యనున్న ప్రాంతము దట్టమైన వెదురుపొదలతో నిండి వుంటుంది. వెదురుకు వంగభాషలో "బంశి" అని పేరు. అందుకనే ఆ ప్రాంతాన్ని "బంశిబారి" అని పిలుస్తారు. ఆ గ్రామము జంగాల్ జమీందారీకి చెందినది. కహార్లు అనే గిరిజనులు అక్కడి పొలాలను కౌలుకు తీసికొని పని చేసే వ్యవసాయ కూలీలు ఆ గ్రామములో సుచాంద్ అనే వృద్ధస్త్రీ గడచిన కాలానికి ప్రతినిధి. మూఢవిశ్వాసాలు బలీయముగ వున్న కహార్లు ఆమె చెప్తుతున్న కొడవలి వంపును గురించిన పురాణగాథల్ని వింటూవుండేవారు. కహార్ల నాయకుడైన బనోరి పురాతన వ్యవస్థను పూర్తిగ విశ్వశించినవాడు. జమీందారీవ్యవస్థ తాలూకు చట్టాలను అతడు పూర్తిగా అమలుపరుస్తూండే వాడు. దోపిడి విధానమునుండి పేదరికమునుండి విముక్తికోసం ఆ గ్రామము విడచిపెట్టి రైల్వే కార్ఖానాలో పని సంపాదించుకోవటానికి పట్నాలకు పోవా లని ఆ గ్రామస్థుల ప్రయత్నాలను అతడు ప్రతిఘటిస్తూ వుండేవాడు. రెండవ ప్రపంచయుద్ధపు రోజులలో కార్ఖానాలలో పని సులభముగనే లభించేవి. కరాలి అనే యువ విప్లవకారుడు ఈ తీరానికి ప్రతినిధి. కహార్ల జీవితాల లోని ఆవేదన అతనికి పూర్తిగ తెలుసు. అతడు ఆ గ్రామములోనే వుంటాడు. కాని బనోరిని, సనాతన వ్యవస్థను ప్రతిఘటిస్తాడు. అతడుకూడ రైల్వే కార్ఖా నాలో పనిచేస్తాడు. వర్తమానములో జీవించటానికి భయపడే తోటి గ్రామస్థు లను అవహేళన చేస్తాడు. ఆ గ్రామదేవత "కర్త"కు అభిమానపాత్రురాలని ఆ గ్రామస్థులందరు విశ్వసించే ఒక నల్లత్రాచును అతడు చంపుతాడు. ఈ సందర్భములో కరాలికి బనోరితో మొదటి సంఘర్షణ కలుగుతుంది. ఆ గ్రామదేవత కరాలిని ఏ విధముగాను శిక్షించలేకపోతుంది. పైగా అతని ధైర్యసాహసాలకు మెచ్చి పోలీసు ఇనస్పెక్టరు బహుమతిప్రధానము చేస్తాడు. దీనితో బనోరి అవమానము పాలవుతాడు. గ్రామములోని సాంఘిక కట్టు బాట్లను లెక్కచేయక కరాలి "పాఖి" అనే వివాహిత స్త్రీని తీసుకుని గ్రామ మును విడచి వెళ్ళిపోతాడు. కరాలి తనకు బలవంతుడైన విరోధిగా తయా రవుతున్నాడని బనోరి భయపడతాడు. కరాలిని తన పక్షానికి తిప్పుకోటానికి పాఖితో కరాలి వివాహాన్ని జరిపిస్తాడు. కరాలి వివాహాన్ని జరిపించుటవలన

బనోరి గ్రామస్థులందరితో విరోధమును కొనితెచ్చుకుంటాడు. కాని కరాలి మాత్రం బనోరివైపు తిరగటానికి ఒప్పుకోడు. కహోర్లు అజ్ఞానముతో, బాని సత్వబుద్ధితో పాత ప్రపంచానికి దాసానుదాసులుగా వుండటం అతడు ప్రతిఘటిస్తూనే వుంటాడు. తన తెగకు చెందిన ప్రజలు బనోరి, సుచాంద్ వంటివారు సృష్టించిన అవాస్తవిక ప్రపంచములో నివసిస్తూ వర్తమానాన్ని అర్థము చేసుకోలేక పోతున్నారని కరాలి బాధపడతాడు.

కొడవలి వంపును గురించిన గాథ సుచాందుకు మాత్రమే తెలుసు. ఒకప్పుడు ఈ ప్రాంతము నీలిమందు ఎస్టేటు యజమానులైన ఆంగ్లేయులకు చెందినది. కహోర్లు ఆ ఎస్టేట్లలో పనిచేస్తూ వుండేవారు. అక్కడి భూముల్ని వారు ఆంగ్లేయుల వద్దనుండి కౌలుకు తీసుకునేవారు. ఒక పర్యాయము వరద లలో పంట అంతా పాడైపోయింది. ఆంగ్లేయ యజమానులు కూడ మరణిం చారు. తరువాత ఘోష్ వంశస్థులు ఆ భూముల్ని కొన్నారు. కాని కహోర్లనే ఆ భూముల్లో పని చేయడానికి కౌలుదారి పద్ధతి కింద నియోగించారు. కహోర్లు ఆ భూములకు యజమానులు కారు. వారు ఆ భూములను సాగుచేసి పంట లను పండిస్తారు. అందుకు ప్రతిఫలముగ వారికి కొంత డబ్బు, ఆహార ధాన్యాలు లభిస్తూ వుండేవి. అక్కడ ఉన్న జమీందారీ వర్గమువారు ఈ కహోర్ల అజ్ఞానాన్ని ఆసరగా తీసుకుని, వారిని తమ పల్లకీలను మోసే బోయీలుగ, వెట్టిచాకిరి చేసే నౌకర్లుగ ఉపయోగించుకునేవారు. జమీందార్లు చేస్తున్న మోసాలను కరాలి ఒక్కడే గ్రహించగలుగుతాడు. మిగిలిన కహోర్లు ఈ యధార్థాన్ని ఎదురించడానికి ధైర్యము చేయరు. బనోరి నాయకత్వములో వారు ఈ దోపిడి విధానానికి బానిసలుగ వుండిపోతారు. తన వేపు కరాలిని తిప్పుకోలేనని గ్రహించిన తరువాత, బనోరి తనకు వారసులు కాగలిగిన పురుష సంతాన ప్రాప్తికోసం వితంతువైన ఒక యువతిని ద్వితీయ వివాహము చేసుకుంటాడు. అతని మొదటి భార్య మరణిస్తుంది. బనోరి రెండవ భార్యను కరాలి లేవతీసుకుపోతాడు. బనోరి కరాలితో ద్వంద్వ యుద్ధము చేస్తాడు, కాని ఓడిపోతాడు. ఆరోగ్యము దెబ్బతిని, నెలలుగా మంచము పట్టుతాడు. స్వస్థత చేకూరిన తరువాత తను నమ్ముకున్న పురాతన సాంఘిక వ్యవస్థ రూపుమాసిపోయినదని గ్రహిస్తాడు. తాను ప్రతిఘటించిన మార్పులన్ని ప్రపంచ సంగ్రామము మూలముగ తన గ్రామములో కూడ జరిగాయి. యుద్ధ సమయములోని నిర్మాణ కార్యక్రమాలు కంట్రాక్టర్లను ఈ గ్రామము వైపు

కూడ ఆకర్షించాయి. 1942 లోని పెద్ద తుఫాను పంటఅంతా పాడుచేసింది. జమీందార్లు రైతుల అవసరాలలో ఆదుకోవడానికి నిరాకరించటంతో, కడుపు చేతపట్టుకొని వ్యవసాయ కూలీలు పనికోసం రైల్వే కర్మాగారాలకు వెళ్ళి పోతారు. కరాలి నాయకత్వంలో కటాంట్రక్టర్లు ఆ ప్రాంతాలలోని చెట్లను వెదురు పొదల్ని నరకటం ప్రారంభిస్తారు. గ్రామదేవత నివసిస్తుందని వారంతా విశ్వసించే పవిత్రమైన బీల్ వృక్షముకూడ నరకివేయబడుతుంది. బనోరి మరణిస్తాడు. కహోర్ల కొత్త నాయకుడవుతాడు కరాలి. అప్పటికే కహోర్లు తమ ప్రత్యేక జీవనవిధానాన్ని విడచిపెట్టి మిగిలిన కార్మిక వర్గాల జీవన స్రవంతిలో కలసిపోవటానికి ప్రయత్నిస్తూంటారు. సుచాంద పిచ్చి గత్తెగ మారి పట్నములో కొడవలివంపు గాథ చరమాంకాన్ని గురించి చెబుతూ కాలము గడుపుతూ వుంటుంది.

ఈ పై కథ ఈ నవలలోని ముఖ్యాంశాలను మాత్రమే సూచిస్తుంది. ఈ నవల పేరులో పురాణ గాథ అని వుంది. ఈ గాథ భూతకాలానికి గాని, వర్తమానానికి గాని, పరిమితమైనది కాదు. ఇది సార్వకాలికమైనది. ఒక చిన్న తెగలోని ప్రజలు తమ జీవన విధానాన్ని విడనాడి, విశాలమైన సాంఘిక వ్యవస్థలో లీనము కావడానికి చేసే ప్రయత్నమే ఇందులోని ఇతి వృత్తము. బనోరి, కరాలి ఇందులో ముఖ్యపాత్రలు. అయితే ఈ నవలలో నిజమైన కథానాయకత్వము ఒక వ్యక్తికి కాక ఒక సమష్టిశక్తికి చెందుతుంది. ఆధునిక జీవన విధానము వారికి బొత్తిగా తెలియక పోవుటవలన కహోర్లు జమీందారుల, కంట్రాక్టర్ల, పరిశ్రమల పెట్టుబడిదారుల దోపిడీకి గురి అవు తారు. ప్రకృతి విలయతాండవానికి భయభ్రాంతులై అమాయకముగ, అశక్తు రాలైన తమ గ్రామదేవతకు నివేదించుకుంటారు. తమకు రక్షణ కల్పించ మని వేడుకుంటారు. వారిలోని ఆదిమకాలపు అనాగరకతకు సుచాంద ప్రతినిధి. జమీందారీ వ్యవస్థలోని యజమానుల, బానిసల వర్గానికి బనోరి కట్టకడపటి ప్రతినిధి. అతని దృష్టిలో గ్రామదేవత, జమీందారులు, పాత విధానాలు అన్నికూడ ఉల్లంఘించరానివి. పాతుకుపోయిన వ్యవస్థను గుడ్డిగా విశ్వసించి, ఆ వ్యవస్థ ఎంతవరకు సమర్థనీయము అని ఎన్నడు ఆలో చించని రైతు వర్గానికి అతడు నిజమైన ప్రతినిధి. భారతీయులలో మనకు కనిపించే ఒక రకమైన హుందాతనము మనకు బనోరిలో కనిపిస్తుంది. సుచాంద కొన్ని పాతకాలపు విలువలకు రూపకల్పన. ఆమెకు ఆదిమ కాలపు

దేవుళ్ళ వ్యవహారాలన్నీ తెలుసు. అందుచేత ఆమె ఎన్నో విషయాలను వివరించగలదు. ఆమె దృష్టిలో నల్లత్రాచు భగవంతుని అవతారము. తుఫానుల భీభత్సాలు పాపకూపములో ప్రవేశించిన కహార్లకు సరైన గుణ పాఠాలని ఆమె ఉద్దేశము. మన గ్రామసీమలలో ఇటువంటి స్త్రీలు అనేక మంది కనిపిస్తారు. వంగసాహిత్యంలో ఇంతకు ముందెప్పుడు సుచాంద వంటి జీవముతో తొణికిసలాడే పాత్ర సృష్టించబడలేదు. సుచాంద పాత్రను యదార్థ జీవితమునుండి స్వీకరించానని రచయిత తెలియజేసారు. విప్లవవాది కరాలి భవిష్యత్‌కు సంకేతం. బనోరికి ప్రత్యర్థిగ చిత్రించబడినప్పటికి, కరాలి అతనికి పూర్తిగ భిన్నమైనవాడు కాడు. అతను కూడ కహార్లకు నాయకుడు కావాలని ఉబలాట పడతాడు. నవల ముగింపులో తన గ్రామా నికి తిరిగి వచ్చి ఒక నూతన గ్రామాన్ని పునర్నిర్మించాలని కలలు కంటాడు. "గణ దేవత", "పంచగ్రామ" నవలలలోని అనిరుద్ధ పాత్ర కరాలి పాత్రకు మాతృక వంటిది. వీటి రెండింటిలో భేదాలు కూడ లేకపోలేదు. అనిరుద్ధ పూర్తి తిరుగుబాటుకు ప్రతినిధి. అతడు వృత్తి రీత్యా కమ్మరి కావటం వలన, అతనికి నేలపై అభిమానములేదు. కరాలికూడ తిరుగుబాటుదారుడై నప్పటికి తనకు తెలియకుండానే తాను పుట్టిన నేలపై అత్యంత అభిమానము కలవాడు. తన వ్యక్తిత్వాన్ని తాను అర్థము చేసుకోవటానికి పాత వ్యవ స్థను, చివరకు తన గ్రామాన్నికూడ నాశనము చేయవలసి వస్తుంది. చివరకు తన వ్యక్తిత్వము తాలూకు వేళ్లు పంట పొలాలలో చొచ్చుకొని వున్నాయని గ్రహిస్తాడు.

కహార్ల జీవిత విధానాన్ని రచయిత నిశితముగ పరిశీలించి, సాను భూతితో చిత్రించారు. పేదరికముతోను, దోపిడి విధానముతోను పీడితులైన ఈ నిమ్నజాతి ప్రజలు ఎన్నో అవాంతరాలను ఎదుర్కొని తమ విశిష్టమైన సంస్కృతిని నిలబెట్టుకోవటానికి ప్రయత్నిస్తారు. తమ వ్యధాభరిత జీవితాలను ఆటపాటలతో ఆనందమయము చేసుకోవటానికికూడ ప్రయత్నిస్తారు. వారి ముఖ్యమైన పండుగలన్నీ వ్యవసాయానికి సంబంధించినవే. వారి నైతిక విలువలు చుట్టూవున్న సామాజిక వ్యవస్థతాలూకు విలువలకు భిన్నముగ వుంటాయి. అంక్షలులేని స్వేచ్ఛాప్రేమను వారు గౌరవిస్తారు. వారిలో స్త్రీలు పురుషులు కలిసి మద్యపానము చేస్తారు. కడుపునిండా తిండి లభించకపోతే వారిలోని పురుషులు దొంగతనాలు, హత్యలు చేయటానికి వెనుకాడరు. కళా

కాంతులులేని పేదరైతుల మధ్యనివసిస్తూ, ఈ తెగవారు తమ ప్రత్యేక సంస్కృతిని పరిరక్షించుకోవటానికి ప్రయత్నిస్తారు. కాని ఈ ప్రయత్నములో మనకొక వైరుధ్యము కనిపిస్తుంది. వారు తమ ప్రత్యేక సంస్కృతిని నిలబెట్టుకోవాలంటే, వాస్తవికతను విస్మరించి శిథిలమై పోతున్న పాత విధానాలను అనుసరించవలసి వస్తుంది. నూతన విధానాలను అనుసరించుట ప్రారంభిస్తే, వారి ప్రత్యేక వ్యక్తిత్వము, విశిష్ట సంస్కృతి అంతరిస్తాయి. ఈ విషమ పరిస్థితిని తారాశంకర్ ప్రతిభావంతముగ చిత్రించారు. ఆయన ఏ ప్రశ్నలు వేయలేదు. కాని ఒక ముఖ్య సమస్యను ఎత్తి చూపించారు. మన దేశంలో నిరుపేదలై దోపిడీ విధానాలకు గురైన గిరిజనులు వున్నారు. వారికి మంచి సంస్కృతీ సంపద వుంది. ఈ సంస్కృతీ సంపద అర్థములేని తమ పాత విధానాలను అంటిపెట్టుకొని వుండే ఆదిమజాతులలో మరి ఎక్కువ వుంటుంది. పాత విధానాలను అంటిపెట్టుకొని వుండే తెగలవారు అంతరించటం జరుగుతుంది. ఇలా అంతరించకుండా వుండాలంటే, వారు తమ చుట్టూ వున్న సాంఘిక వ్యవస్థలో లీనము కావాలి. ఇందువలన వారు తమ విశిష్ట సంస్కృతిని కోలుపోతారు. ఆధునిక జీవన విధానాలను అనుసరిస్తూ తమ విశిష్టతను నిలబెట్టుకోవటం సాధ్యముకాదు. ఇటువంటి అసాధ్యమును సాధ్యముచేసే మార్గము ఎవరికీ తెలియదు. చుట్టూవున్న పెద్ద సాంఘిక వ్యవస్థలో చిన్న, విశిష్టమైన కహార్ల సాంఘిక వ్యవస్థ విలీనమైన పరిస్థితులను తారాశంకర్ చారిత్రక దృష్టితో చిత్రించారు. అయితే, ఈ విలీనములోని విషాదము మనలో సానుభూతిని రేకెత్తిస్తుంది. వెదురు పొదల మాటున మిలమిలలాడే కొడవలివంపు ఒక చారిత్రక పరిణామానికి ప్రతీక. ఈ ప్రకృతి విశిష్టత వలన కహార్లు ఆధునిక నాగరకతకు దూరముగ వుండి తమ విశిష్ట వ్యక్తిత్వాన్ని కాపాడుకోగలుగుతారు. ఇందువలన వారు సనాతన వ్యవస్థకు బందీలు కావలసివస్తుంది. వెదురు పొదలను నరకివేయుట వలన కహార్లు పాతకాలపు సరిహద్దులు దాటి ఇరవయ్యో శతాబ్దపు చేదు నిజాల ఆవరణలోకి అడుగు పెడతారు. ఈ నవలా రచనలో తారాశంకర్ కహార్ల మాండలిక భాషను ఉపయోగించారు. ఈ మాండలిక భాష బీరభూమిలోని మిగిలిన మాండలిక భాషలకు భిన్నముగ వుంటుంది. ఈ ప్రత్యేకమైన భాషను ఉపయోగించుట ద్వారా తారాశంకర్ వంగ సాహిత్యంలో ఒక జీవభాషను ప్రవేశపెట్టారు. అంతేకాక బెంగాలీ రచయితలు నిర్లక్ష్యము

చేసిన ఒక భాషా విషయిక సమస్యకు ఆయన పరిష్కారము సూచించారు. బెంగాలులో అనాదిగ రైతులు, సాలెవారు, పల్లెవారు, వడ్రంగులు, కుమ్మరి వాళ్ళు ఇంకా మిగిలిన వృత్తులను చేపట్టిన వారు తమ వృత్తులకు సంబంధించిన ప్రత్యేకమైన పదాలను భాషను ఉపయోగిస్తూ ఉండేవారు. వంగ సాహిత్యములో ఇంతవరకు కృషిచేసిన రచయితలందరు సంఘములో మధ్య తరగతికి, ఆ పై తరగతికి చెందినవారు. ఆ రచయితలు తమ రచనలలో పల్లెవారినికాని, రైతులను కాని చిత్రించే సమయాలలో పరోక్షముగ వారి భాష అని తెలుసుకొన్న భాషను కాని, నిఘంటువులనుండి గ్రహించిన భాషను కాని ఉపయోగించేవారు. ''పద్మనదిర్ మా ఝి'' (పద్మానదిలోని పడవవాడు) రచించే సమయములో మాణిక్ బంద్యోపాధ్యాయ అనేక విశిష్టతలను ప్రదర్శించారు. కాని పడవవాళ్లు వాడే ప్రత్యేకమైన భాషను ఉపయోగించుటలో కృతకృత్యులు కాలేకపోయారు. బెంగాలీ సాహిత్యములో మొదటినుండి జీవ భాషా సాంప్రదాయము లేదనే చెప్పాలి. మాండలిక భాషలో రచనలు చేసినంత మాత్రాన సరిపోదు. వివిధ వృత్తులను అవలంబించే ప్రజలు ఉపయోగించే ప్రత్యేకమైన భాషను కూడ వాడటం అవసరం. కాని బెంగాలీ సాహిత్యములోని భాష అర్థరహితముగను సారవిహీనముగను తయారైనది. పందొమ్మిదవ శతాబ్దములో కాళీ ప్రసన్నసిన్హా, ఇరవయ్యో శతాబ్దములో దినేంద్ర కుమార రాయ్, ఇటీవల అద్వైత మల్ల బర్మన్ వంటివారు జీవ భాషను వాడటంలో కృతకృత్యులయ్యారు. కాని వీరెవ్వరు పరిణతి పొందిన నవలా రచయితలు కారు. అందువలన భాషా విషయంలో వారి కృషి పూర్తిగ గుర్తింపబడలేదు. తారాశంకర్ ప్రజల భాషను ఉపయోగించుటలో ఏ సాహిత్యప్రయోజనము ఆశించలేదు. ఒక ప్రత్యేక వర్గమువారిగురించి నవల రచించే సమయములో వారి ప్రత్యేక భాషను వాడుట తప్పనిసరి అని గ్రహించి ఆయన అటువంటి భాషను ప్రవేశ పెట్టారు. ఈ నవలా నిర్మాణము ఇంకా బిగువుగా వుండటానికి అవకాశము వుంది. ఈ నవలను సంక్షిప్తీకరించవలసిన అవసరము కూడ వుంది. ఈ లోపాలు వున్నప్పటికి ఈ నవల ఆయన రచించిన ఉత్తమ నవలలలో చివరిది. ఈ నవల తరువాత ఆయన కొన్ని మంచి నవలలను రచించారు. కాని అవి ఉన్నతమైన నవలలు కావు. ఆయన తాను రచిస్తున్న విషయాలను ప్రత్యక్షముగ ఎరిగి వున్నప్పుడే ఉత్తమ రచనలను చేయకలిగేవారు. సుచాంద పాత్రకు

మాతృక ఆయన తనకు తెలిసిన జీవితమునుండి స్వీకరించారు. స్త్రీ సహజ మైన సుకుమార భావాలు కలిగిన అతి విచిత్రమైన పురుషుడు నసుబాల పాత్రకూడ జీవితమునుండే గ్రహించబడింది. తన ప్రత్యక్షానుభవము ఆధార ముగ చేసుకొని రచించినప్పుడే ఆయన రచన ఉన్నత ప్రమాణాలను అందుకోగలిగేది. రచనాశిల్పము అతిశ్రమతో సాధించే నైపుణ్యముగ ఆయన భావించలేదు. రచనా శిల్పాన్ని ప్రదర్శించాలని ఆయన ప్రత్యేకముగ ప్రయత్నించిన నవలలు మనకు సంతృప్తి కలిగించవు. ఉత్తమ నవలా రచయితలందరిలాగే ఆయన కూడ తన ఉన్నత స్థాయినుండి నెమ్మదిగాను, క్రమముగాను దిగజారడం జరిగింది.

"నాగిని కన్యార్ కాహిని" (నాగకన్య కథ)ను చాలమంది విమర్శ కులు మెచ్చుకున్నారు. నాగదేవతను ఆరాధించే పూజారిణికి సర్పముల వైద్యులలో ముఖ్య వైద్యునకు మధ్య అనాదిగ ఉండే స్పర్థ ఈ కథకు మూలము. సర్పాలను గురించి వాటి వింత ప్రవర్తన గురించి చాలా మందికి పాములు జంతులోకములోని సాధారణ సరీసృపములని భావిస్తే ఈ నవల లోని కథ నమ్మదగినదిగ కనిపించదు. కానీ పాములు సహస్ర రూపాలు దాల్చగలిగినవిగ భావించగలిగితే, పామువలె ప్రవర్తించగలిగిన స్త్రీల కథ నమ్మదగినవిగ కనిపిస్తుంది. సీతానాథ్ చరిత్రను చిత్రించిన "సాందీపని పాఠశాల" ఒక ముఖ్యమైన నవల. సీతానాథ్ ఒక పేద బడి పంతులు. వారి జీవితాలలోని విషాదము తారాశంకర్‌కు పూర్తిగా తెలుసు. జాతిని అక్ష రాస్యులుగా తీర్చిదిద్దే ప్రాథమికోపాధ్యాయులకు ఉపాధ్యాయులందరి కంటె తక్కువ జీతాలు లభిస్తాయి. ఈ నవల 1946 లో ప్రథమ ముద్రణకు వ్రాసిన పీఠికలో తారాశంకర్ ఇలా అన్నారు: ఈ పాఠశాలలోని ఉపా ధ్యాయులను గురించి చెప్పవలసినది ఏమిలేదు. వారి కనీస అవసరాలు, సంతోషము పూర్తిగ నిర్లక్ష్యము చేయబడ్డాయి. వారిని గురించి ఏవో కొన్ని వ్యంగ్య రచనలు మాత్రమే మనకు కనిపిస్తాయి...కాని నా దృష్టిలో సీతా నాథ్ పూర్తిగ వాస్తవికమైన వ్యక్తి. ఆయన నాకు బాగా తెలుసు". 1893-94 మధ్యకాలములో ఈ నవల ప్రారంభమవుతుంది. సీతానాథ్ ఒక సామాన్య రైతు కొడుకు. మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేకపోతాడు. కాని గ్రామాలలో విద్యావ్యాప్తికై తన జీవితాన్ని అంకితము చేయాలని నిర్ణ యించుకుంటాడు. 1919 వ సంవత్సరములో ఒక ప్రాథమిక పాఠశాలను

ప్రారంభిస్తాడు. పాఠశాలను ప్రారంభించటానికి అతడు చేసిన ప్రథమ ప్రయత్నాన్ని ఆ గ్రామములోని అగ్రవర్ణములవారు విఫలము చేస్తారు. అసూయతో, అతడు ఖద్దరు వడుకుతాడని, జాతీయతా భావాలను ప్రచారము చేస్తున్నాడని పోలీసులకు ఫిర్యాదు చేస్తారు. కడ జాతికి చెందిన ఒక వ్యక్తి ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించటం వారు సహించలేక పోతారు. జమీందారు గారి వితంతు భార్య సీతానాథ్‌ను అభిమానిస్తుంది. ఆమె కుమారుడు ధీరానంద్ ఒకప్పుడు సీతానాథ్ శిష్యుడు. ధీరానంద్ 1921 వ సంవత్సరములో అరెస్టు చేయబడతాడు. పోలీసులు సీతానాథ్ చేత పాఠశాలను మూసివేయిస్తారు. కాని సీతానాథ్ చెట్లకింద బహిరంగ పాఠశాలను ప్రారంభిస్తాడు. పేద కుటుంబాలనుండి అనేకమంది విద్యార్థులు విద్యార్జనకై వస్తూవుంటారు. వారిలో ఒక విద్యార్థికి ఉపకారవేతనము కూడ లభిస్తుంది. ఎన్నో ఆటంకాలను ఎదుర్కొంటూ, కటిక దారిద్రయాన్ని అనుభవిస్తూ సీతానాథ్ తన పాఠశాలను నిర్వహిస్తూంటాడు. తన వ్యక్తిగత జీవితాన్ని పూర్తిగ నిర్లక్ష్యము చేస్తాడు. రోజులు మారుతుంటాయి. 1930 వ సంవత్సరములో జరిగిన ఒక సమావేశములో గ్రామా లన్నింటిలోను ఉచిత ప్రాథమిక పాఠశాలలను నిర్వహించాలని నిర్ణయించబడుతుంది. తన శ్రమకు ఫలితము దక్కినట్లుగ సీతానాథ్ సంబరపడతాడు. కాని దురదృష్టవశాత్తు అతనికి దృష్టిమాంద్యము కలుగుతుంది. కొద్ది రోజులకే అతడు పూర్తిగ అంధుడు కావటంవలన ఉద్యోగము విరమించవలసి వస్తుంది. ఈలోగా అతని భార్య మరణిస్తుంది. ఆయన ఒక్కగా నొక్క కూతురు భర్తృ విహీన అవుతుంది. సీతానాథ్ విధికి తలవొగ్గుతాడు. 1941 వ సంవత్సరము అడుగుపెడుతుంది. ప్రఖ్యాత రచయితగా పేరు సంపాదించిన ధీరానంద్ సీతానాథ్ వద్దకువచ్చి ఆయన కళ్ళను పరీక్ష చేయించటానికి కలకత్తాకు రమ్మని ఆహ్వానిస్తాడు. కాని సీతానాథ్ అంగీకరించడు. తన విధికి తలవొగ్గుటలో అతడు అనంతమైన శాంతిని అనుభవిస్తాడు. ధీరానంద్ అతని నిర్ణయాన్ని గౌరవిస్తాడు. అతని ఔన్నత్యాన్ని ధీరానంద్ గ్రహించగలుగుతాడు. సగటు మనుషులకు సీతానాథ్ ప్రతినిధి. పుట్టుకతో వచ్చిన తమ కులాలను వారు పూర్తిగ కాదనలేరు. తమ సంఘము పట్ల వారి బాధ్యతలనుకూడ విస్మరించలేదు. తమ తుదిఘడియల వరకు సీతానాథ్ జమీందారులయందు, బ్రాహ్మణులయందు, గౌరవభావాన్ని కలిగేవుంటాడు. సీతానాథ్ ఒక ఆదర్శమూర్తి కాడు.

యదార్థ జీవితంలో మనకు తారసపడే సాధారణ వ్యక్తి. హృదయాలను కదిలించే ఈ కథను తారాశంకర్ అతి జాగ్రత్తతో నడిపించారు. తారా శంకర్‌కు ఇటువంటి జాగ్రత్త అలవాటైనది కాదు. ఆయనకు గ్రామాలలోని ప్రాథమిక విద్యావిధానములోని యదార్థ పరిస్థితులు క్షుణ్ణముగా తెలియుట వలన ఈ నవలలో వాస్తవికత తొణికిసలాడుతుంది. ఒకప్పుడు ప్రాథమిక విద్య ''పాఠశాల'' లలోనే లభించేవి. ఈ పాఠశాలలు ప్రాథమిక పాఠశాల లుగా మార్చబడ్డాయి. వీటితోపాటు నూతన ప్రాథమిక పాఠశాలలు కూడ నెలకొల్పబడ్డాయి. ప్రభుత్వ చట్టాలు, సవరణలు దృష్టిలో పెట్టుకొని, ఆయన ప్రాథమిక విద్యా చరితను పరిశీలించారు. తరువాత కాలములోని రచయి తలు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల జీవితాలను తమ నవలలలో చిత్రించ టానికి ఎక్కువ ప్రయత్నము చేయలేదు. ఈనాటికీ వారు కటిక దారిద్ర్య ముతో, అనేక సమస్యలతో బాధపడుతూ, జాతికంతకు అక్షర జ్ఞానదానము చేస్తూనే వున్నారు. కాని వారి దుర్భర పరిస్థితులను ఎవరూ పట్టించుకోరు. ఈ నవలలో సీతానాథ్ పాత్ర ఉదాత్తముగ చిత్రించ బడినది. మిగిలిన పాత్రలన్నీ అతని పాత్ర చుట్టు పరిభ్రమిస్తూ వుంటాయి. ధీరానంద్ పాత్రలో తారాశంకర్ స్వీయచరిత్ర అంశాలు కనిపిస్తాయి. ఆ పాత్రపై రచయితకు ఎక్కువ అభిమానము. అయితే కథలో ఆ పాత్ర ప్రాముఖ్యము తక్కువ.

''ఆరోగ్య నికేతన్'' అనే నవలను గురించి విమర్శకులు సుదీర్ఘముగ చర్చించారు. వైద్య కళాశాలలో తరిఫీదు కాకుండానే మంచి పేరుతెచ్చుకొన్న ఒక వైద్యుని గాథ ఈ నవలలోని ఇతివృత్తము. గ్రామములో సేవాపరా యణుడైన ఒక వైద్యుని గురించిన ఈ నవల, కథ దృష్ట్యా, నవలా సముదా యము వంటిది. ఈ కథలోని నాయకుడు జీవన్‌మాషై. అతడు నాడిని పరీక్షించి, రాబోయే మృత్యువును గురించి అద్భుతముగ సూచించగలిగే వాడు. మృత్యువునుండి తన వద్దకు వచ్చినవారిని రక్షించటానికి ప్రయ త్నము చేయడం వైద్యుడిగా అతని కర్తవ్యము. కాని భావుకునిగ మృత్యువు అతనిని అమితముగ ఆకర్షిస్తుంది. మృత్యువును ఆకర్షణీయమైన పారలౌకిక స్త్రీ మూర్తిగ అతడు భావిస్తాడు. అతని పాత్ర ఒక్కటే వివిధ రకములైన కథావస్తువులకు ఆధారము కాగలుగుతుంది. ఈ నవలలో ఆద్యంతము మంజరితో ఇతని యౌవన దశలోని ప్రేమ వ్యవహారము కనిపిస్తుంది.

ఇతని జ్ఞాపకాలు ఆమెను గురించే. చివరి ఘట్టములో మంజరి వృద్ధురాలిగ మనకు కనిపిస్తుంది. ఇతని వ్యక్తిగత జీవితము ఇందులోని రెండవ కథ. తన భార్యతో అతని సంబంధము ఆనందకరమైనది కాదు. ఆమె మాటలు ఈటెల వంటివి. ఆమె ప్రేమ కూడ భరించరానంత తీవ్రమైనది. తమ ఏకైక పుత్రుడు చనిపోయినప్పుడు అతడు నిశ్చలముగ వున్నందుకు ఆమె అతనిని ఎన్నటికి క్షమించదు. జీవన్ మాషై కథతోపాటు తారాశంకర్ ఆయుర్వేద వైద్యపద్ధతి, అధునిక వైద్య పద్ధతుల మధ్యగల తారతమ్యాలను కూడ ఈ నవలలో చిత్రిస్తారు. వీటిపై తమ అభిప్రాయాలను అభిరుచులను కూడ స్పష్టీకరిస్తారు. ఆయుర్వేద వైద్యులు మనిషి ఆరోగ్య పరిస్థితులపై భగవంతునియొక్క, విధియొక్క ప్రభావాన్ని గుర్తిస్తారని అయన విశ్వసిస్తారు. కాని అధునిక వైద్యులు ఈ అధిభౌతిక శక్తులను విశ్వసించరు. ఆయుర్వేద వైద్యులు శరీరానికి స్వస్థత చేకూర్చటమే కాక మనసుకు ఉల్లాసముకూడ కలిగిస్తారు. అధునిక వైద్యులు శాస్త్రీయపరిశోధనలవలన లభించిన విజ్ఞానాన్ని మించిన విజ్ఞానాన్ని దేన్ని లక్ష్యపెట్టరు. ఈ నవలలో ఇటువంటి ఖచ్చితమైన అభిప్రాయాలు పుష్కలముగ లభిస్తాయి. జీవన్ మాషై ప్రాచీన వైద్య సాంప్రదాయానికి ప్రతినిధి. యువకుడైన ఒక వైద్యుడు అధునిక వైద్యానికి ప్రతినిధి. మొదట్లో వారి మధ్య స్పర్థ. తరువాత స్నేహము పెరుగుతుంది. చివరకు వారిద్దరి మధ్య గాఢమైన అనురాగముకూడ ఏర్పడుతుంది. మృత్యువును ఎదుర్కొనడంలో రకరకాల మనుష్యులు ప్రవర్తించే తీరు జీవన్ మాషైను ఎక్కువగ ఆకర్షిస్తుంది. తన మృత్యువుకోసంకూడ అతడు ఎదురుచూస్తూ వుంటాడు. తన పాత ప్రియురాలు మంజరిపైవున్న ప్రేమవలన అతడు తన భార్య అతార్‌తో సన్నిహితముగ వుండలేక పోతాడు. అందువలన భార్యా భర్త లిద్దరు ఏకాకులుగ తమ ఇంటిలో జీవించవలసి వస్తుంది. తనకుతానే నిర్మించుకున్న పాపము, పశ్చాత్తాపముల కారాగారములో బంధితుడైన జీవన మాషైకు మృత్యు వొక్కటే విముక్తిని ప్రసాదించ కలదు. జీవన మాషై పాత్రను మినహాయిస్తే, ఈ నవలలోని పాత్రలన్నీ ఆయన తాను ఇంతకుముందు రచించిన నవలలలో కొద్ది మార్పులతో మనకు పరిచయమైనవే! అతార్ పాత్ర 'ధాత్రీ దేవత" లోని గౌరి పాత్రకు మెరుగైన ప్రతిరూపమే. ఈ నవలలోని కథాకథనములో బిగువు తక్కువ. ఇందులో జీవన మాషై జ్ఞాపకాలు ఒక క్రమపద్ధతిలో లేవు.

మృత్యువును గురించి భారతీయ తత్వాన్ని చిత్రించిన ఉత్తమ రచనగ ఈ నవల కొనియాడబడింది. అటువంటి భారతీయ తత్వ చిత్రణ ఈనాటి పాఠకులకు అర్థమవుతుందా అనే విషయము ఈ నవలను చదివే పాఠకులపై ఆధారపడి వుంటుంది. హేతువాదమును విశ్వసించేవారికి ఈ చిత్రణ నచ్చక పోవచ్చు. ఈ నవలలోని జీవన మాషై పాత్ర, మరికొన్ని ఘట్టాలు పాఠకుల మనసులలో చిరకాలము నిలచిపోతాయి. మంజరితో మాషై ఆఖరి కలయిక మరవరాని సన్నివేశము. మంజరి రాక మాషై మరణానికి సూచన. కొద్దికాలానికే అతడు తన మరణాన్ని చిరునవ్వుతో ఆహ్వానిస్తాడు. మరణములో అతడు నిజమైన శాంతిని, ఆనందాన్ని అనుభవిస్తాడు.

నేరము, శిక్ష; పాపము, ప్రాయశ్చిత్తమూ; చట్టాలు, నేరస్థులూ.— ఈ విషయాలన్నీ తారాశంకర్‌ని చిరకాలముగ ఆకర్షించాయి. ఈ కథావస్తువులను ఆయన తమ నవలలలో విరివిగ వాడుకున్నారు. 'విచారక' (న్యాయమూర్తి) అనే నవలలో ఒక న్యాయమూర్తి కథానాయకుడు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో తన సోదరుణ్ని హత్యచేసిన ఒక నేరస్థుణ్ణి శిక్షిస్తాడాయన. తన యౌవనంలో మంటల కాహుతి అవుతూన్న తన భార్యను రక్షించుకోటానికి బుద్ధిపూర్వకముగ తాను ప్రయత్నము చేయని సంఘటన తనకు జ్ఞాపకము వచ్చి, పశ్చాత్తాపముతో చాల బాధపడతాడు. తన జీవిత కథకు, నేరస్థుని జీవితకథకు దగ్గర పోలికలు వున్నాయి. ఈ నవలలోని ఇతివృత్తము టాగోరు కథలను గుర్తుకు తెస్తుంది. నేరము, శిక్షకు సంబంధించిన ఈ రసవత్తరమైన నవలలో కథాకథనము మంచి బిగువుతో సాగుతుంది. ఇందులోని నీతికూడ ఉదాత్తమైనది. ఇందులో నీతి బోధలు, సందేశాలు ఎక్కువగ కనిపిస్తాయి; ఆయన నవలల నిడివి చాల ఎక్కువగ వుంటుంది. కాని ఈ నవల చిన్నది. ఆయన రచించిన నవలలలో బహుళ ప్రజాదరణ పొందిన 'సప్తపడి' (ఏడడుగులు) అనే నవలను తనకు 1916వ సంవత్సరము ప్రథమార్థములో బాగా తెలిసిన వ్యక్తిని గురించిన జ్ఞాపకాలను ఆధారముగ చేసుకొని ఆయన రచించారు. ఇందులోని కథానాయకుడైన ఆ వ్యక్తి హిందూమతస్థుడు. విద్యాభ్యాసము కోసం కలకత్తా వస్తాడు. అక్కడ ఒక ఆంగ్లో-ఇండియన్ యువతిని ప్రేమిస్తాడు. తాను క్రైస్తవ మతాన్ని స్వీకరించిన తరువాత ఆమెను వివాహమాడాలని నిశ్చయించుకుంటాడు. నలభై సంవత్సరాల తరువాత ఆ వ్యక్తిని హిమాలయ సానువుల

మధ్య వున్న చిన్న చర్చిలో తారాశంకర్ చూడటం తటస్థిస్తుంది. అతడు ఇలా అన్నాడు: 'ఆ యువతి నా కన్నులు తెరపించింది. ఒక స్త్రీ ప్రేమ కోసం తన మతాన్నే విస్మరించకలిగిన వ్యక్తిని ఆమె అంగీకరించలేదు. నాకు జ్ఞానోదయము కలిగింది. అందువలన, ఆ వ్యక్తి స్త్రీ ప్రేమకంటె ఉన్నతమైన ప్రేమను ప్రసాదించగలిగిన భగవంతుని ప్రేమను అన్వేషిస్తూ తన జీవితాన్ని భగవత్సేవకు అంకితము చేసుకుంటాడు. ఈ నవల లోని కథానాయకుడు, రెవరెండు కృష్ణస్వామి పాత్ర అయనకు బాగా తెలిసిన ఆ వ్యక్తిని ఆధారము చేసుకుని సృష్టించబడింది. రెండవ ప్రపంచ యుద్ధములో సైనికులకు సహాయ కార్యక్రమములలో పాల్గొన్న చిన్న ఉద్యోగిని ఈ నవలలోని నాయిక పాత్రకు మాతృక. పాఠకులను ఆకట్టు కునే విధముగ రచించబడిన ఈ చిన్న నవల ఈ నాడు ముఖ్యముగ అందలి ఆకర్షణీయమైన శైలికొరకే కొనియాడబడుతోంది. ఈ నవలల రచనలో తారాశంకర్ తనకు బాగా పరిచయమైన గ్రామాలనుండి, గ్రామస్థులనుండి చాలదూరము వచ్చేస్తారు. నాస్తికుడైన వ్యక్తి తన కామవాంఛల తృప్తి కోసము ప్రయత్నముచేస్తూ, చివరకు తన మృత్యువును చేరుకోవటము 'యోగ భ్రష్ట' నవలలోని ఇతివృత్తము. ఈ నవలలో కథానాయకుడు సుదర్శన్. ఈతడు ఆధునిక 'ఫాస్ట్'* వంటివాడు. భగవంతుని గురించి జ్ఞానాన్వేషణలో తన జీవితాన్ని ప్రారంభిస్తాడు. కాని తుదకు భగవంతుని బంగారు విగ్రహాన్ని కరగించి దొంగిలించటానికి తయారవుతాడు. ఈ పరిస్థితి అతడు ప్రియురాలికి చెప్పలేని భీతిని కలిగిస్తుంది. అనేకమైన వింత సంఘటనలు, భయంకరమైన హత్యలు జరిగిన తరువాత పోలీసులు అతడిని అరెస్టు చేస్తారు. అతనికి మరణశిక్ష విధించబడుతుంది. మృత్యుగహ్వరములో నిలబడి తన జీవిత చరిత్రను ఒక వాఙ్మూలముగ వ్రాసుకుంటాడు. ఈ నవలలో సుదర్శన్ పతనానికి అతని నాస్తికత్వము హేతువని రచయిత నిరూపిస్తారు. భగవంతుని కాదన్న మరుక్షణమునుండే అతని పతనము ప్రారంభమవుతుంది. రచయిత నైతిక దృష్టిలో సుదర్శన్ పాత్ర ఉదాత్తమైనది కాకపోవచ్చు. కాని నవల చదివిన తరువాత సుదర్శన్ మరువరాని పాత్రగ

* 'ఫాస్ట్' లేక డాక్టర్ ఫాస్టస్ అనే ప్రసిద్ధ పాత్ర ఆంగ్లసాహిత్యములో, జర్మను సాహిత్యములోను కనిపిస్తుంది. క్షుద్ర విద్యలకోసం అయన తన ఆత్మను సైతానుకు అర్పించుకుంటాడు. గెథె వ్రాసిన 'ఫౌస్టు' కావ్యానికి నాయకుడు.

)లచిపోతాడు. అతని జీవితములో అన్ని అనుభవాలు మోతాదు మించినవే.
3వితముపై వల్లమాలిన కోరిక, కామవాంఛలు, శక్తి సామర్థ్యాలు, అత్యాశ,
మితిమీరిన కుతూహలము – అన్నీ అతనిలో ఎక్కువ పాళ్ళలోనే కనిపి
స్తాయి. నేరస్థుడైతే అతని స్వేచ్ఛకు ఏ నిబంధనలు వుండవని అతడు నేర
స్థుడిగ జీవితాన్ని గడుపుతాడు. ఈ నవల ఆయన ఉత్తమ నవలకాదు. కాని
సుదర్శన్ పాత్ర చిత్రణ అద్వితీయమైనది. తారాశంకర్ ఇటువంటి వ్యక్తు
లను బాగా ఎరిగినవారు. ఈ వ్యక్తులు జీవితాన్ని పచ్చిగ, నిక్కచ్చిగ
ప్రేమిస్తారు. బ్రతుకు కోసమే వారు బ్రతుకుతారు. ఆత్మవంచనకు అలవాటు
పడిన మూసకట్టిన వ్యక్తిత్వాన్ని గౌరవించలేని ఈ సంఘజీవితములో వారు
ఇమిడిపోలేరు.

ఈ నవలలు, తమ తుదిక్షణమువరకు రచిస్తున్న ఇతర నవలలు
రచయితగ తారాశంకర్ క్షీణదశకు చెందినవి. 'హాన్సూలి బంకర్ ఉప
కథ' ఆయన రచించిన ఉత్తమ నవలలలో ఆఖరిది. ఆయన చివరి రోజులలో
తనను తానే అనుకరించుకునేవారు. రచయితగ ఆయన భావావేశభరితుడు;
తన రచనలపై గాఢాభినివేశము కలవాడు. అందువలన ఆయన పరిశీలించిన
అనుభవించిన అన్ని విషయాలకు సాహిత్యరూపము కలిగించారు. తాను
నివసిస్తున్న నగరములో ఆయన వేళ్లూదన్ని నిలవలేక పోయారు. పుస్తకాల
నుండి, ఇతరుల నుండి సేకరించిన విషయాలతో రచనలు చేయటం ఆయనకు
పడదు. పట్నవాసపు ఇతివృత్తాలను గురించి రచించవలసినప్పుడు ఆయన
మంచి ఫలితాలను పొందలేకపోయారు. నైతిక విలువల నాశనము, నాస్తి
కత, నిలకడమైన విశ్వాసములు అంతరించటం మనకు ఆయన రచనలలో
మాటి మాటికి కనిపిస్తాయి. ఈ విషయాలు ఆయన నవలారచనా శిల్పా
నికి ఎక్కువ దోహదము చేయలేకపోయాయి. 'హాన్సూలి బంకర్ ఉపకథ'
తరువాత ఆయన చాల రచనలు చేసారు. కాని వీటిలో ఆయన ప్రతిభను
పూర్తిగ ప్రదర్శించలేక పోయారు.

# ప్రకరణము 10

నవలారచయితగ తారాశంకర్ స్థానము ఎటువంటిది ? ఆయనలోని విశిష్ట లక్షణాలు ఏవి? దోషాలు ఏవి ? ఎన్నో సంవత్సరాలుగ, సాహిత్య విమర్శకులు తారాశంకర్, బిభూతి భూషణ్ మాణిక్ బందోపాధ్యాయ త్రయము, శరత్ బాబును మినహాయిస్తే, టాగోరు తరువాత కాలములోని వంగ సాహిత్యములో పేర్కొనదగిన రచయితలని నొక్కి వక్కాణిస్తున్నారు. ఈ బందోపాధ్యాయ త్రయములో తారాశంకరుకు అగ్రతాంబూలము ఇస్తున్నారు. నిష్పాక్షికముగను, సవిమర్శకముగను ఆయన స్థానాన్ని నిర్ణయించటానికి సమయ మాసన్న మయినది. వంగ సాహిత్య విమర్శలో నిష్పాక్షిక దృష్టి కరువైనదనే చెప్పాలి. గత ఇరవై సంవత్సరాలుగ, ప్రతి సంవత్సరము ఒక బెంగాలి రోమాం రోలాం, బెంగాలి దాస్తొయ్ విస్కి, బెంగాలి టాల్‌స్టాయ్ ఉద్భవించాడని వింటూనే వున్నాము. సాహిత్యములోని వివిధ వర్గముల వారు తమ అభిమాన రచయితలకు అత్యున్నత స్థానాన్ని సంపాదించి పెట్టడానికి అవిరామకృషి చేస్తూనే వున్నారు. ఏకపక్ష విమర్శ నిజమైన ఉత్తమ రచయితలకు ఎంత హాని చేయగలదో మాణిక్ బంధోపాధ్యాయ విషయములో మనకు తెలుస్తుంది. రెండవ ప్రపంచ యుద్ధానికి చాల ముందుగానే ఆయన రెండు ఉత్తమ నవలలు — 'పద్మనదిర్ మాఘి', 'పుతుల్ నాజేర్ ఇతికథ'—ప్రచురించారు. 1930 సంవత్సర ప్రాంతాలలో ఉత్తమ నవలా రచయితగ ఆయనను ప్రశంసించటం సబబయినదే! కాని యుద్ధసమయములో, తన వ్యక్తిగత విశ్వాసాలను పురస్కరించుకుని, ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. అటుతరువాత ఆయన రచించిన నవలలు ఆయన ముందు వ్రాసిన నవలల స్థాయికి ఎదగలేక పోయాయి. అనతికాలములోనే, ఆయనను ప్రశంసించిన విమర్శకులకు ఆయనపై ఉత్సాహము తగ్గిపోయింది. ఇటువంటి దృక్పథముకూడ మంచిదికాదు. ఇది యిలా వుండగా, కొందరు యువ విమర్శకులు ఆయన రచించిన తరువాతి నవలలను ఎక్కువగ పొగడ

సాగారు. నిజానికి, ఈ నవలలు ఆయన మొదట రచించిన రెండు నవలలతో ఏ విధముగను సరితూగవు. ఇప్పుడు విమర్శకులలో ఒక వర్గము ఆయన తరువాతి నవలలను నిర్లక్ష్యము చేస్తుంది. ఇంకొక వర్గము ఆయన మొదటి నవలలను నిర్లక్ష్యము చేస్తుంది. ఇటువంటి విమర్శలపై మాణిక్ అభిప్రాయాలు ఎలా వుంటాయో ఊహించటం అనవసరం. ఆయన స్వతంత్ర అభిప్రాయాలు కలవాడు. ఆ అభిప్రాయాలు నిష్కర్షగ, నిర్మొహమాటముగ వుండేవి.

మిగిలిన యిద్దరు బంద్యోపాధ్యాయులతో పోలుస్తూ, తారాశంకర్ సాహిత్యానికి విలువకట్టడం కష్టసాధ్యమైన పని. ఈ ముగ్గురు రచయితలు ఎన్నో విషయాలలో ఎక్కువ వ్యత్యాసాలు కల రచయితలు. వారందరిలో ఒక్క సామాన్య లక్షణముకూడ లేదు. పైన పేర్కొనిన రెండు నవలలలోను మాణిక్ బందోపాధ్యాయ ప్రదర్శించిన సాంఘిక వ్యవస్థను సమూలముగ నాశనముచేస్తున్న అంతరాంతర రుగ్మత విశ్లేషణ, విధి యందలి బలీయమైన విశ్వాసము తారాశంకర్‌లో కనిపించవు. విభూతి భూషణ్‌తోకూడ ఈయనకు ఎక్కువ పోలికలు లేవు. అయితే, విభూతి భూషణ్‌ను పోలిన రచయిత లెంతమంది వున్నారు కనుక! ప్రకృతిలోని, జీవితములోని అద్భుత సత్యాలను ప్రేమించగలగటానికి మహత్తరమైన భావనాపటిమ, శేముషీ విభవము అవసరము. ఈ శక్తి విభూతి భూషణ్ సొత్తు. 'పథేర్ పాంచాలి' లోని అపు బాల్యావస్థలోని కష్టాలు, పేదరికము ఎవరికి జ్ఞాపకము వుంటాయి? ఒక బాలుని ఉదాత్తమైన దృక్పథమునుండి పరిశీలించబడిన అద్భుత ప్రపంచమే పాఠకుల మనోసీమలలో నిలిచి వుంటుంది. మానవుల మనోభావములలోను, అడవి పూవుల సుకుమార దళాలలోను నిండివున్న ఔన్నత్యాన్ని దర్శించి, అనుభవించటానికి తమకు మహదవకాశము కలిగించినందుకు పాఠకలోకము ఆయనకు సర్వదా ఋణపడివుంటుంది. వంగసాహిత్యములో విభూతిభూషణ్ ప్రతిభ 'నభూతో నభవిష్యతి' అనవచ్చు. వంగ భాషలోని నవలా రచనాక్రమ పరిణామములో సహజముగ ఉద్భవించినవాడు కాడు ఆయన. ఒక పల్లెటూరి పిల్లవాని బాల్యదశ కాని, మొరటు ఆటవికుల జీవితముకాని, కాకులు దూరని కారడవిలోని అద్భుతమైన అందాలుకాని, ఏ రచయిత తమ ఉత్తమ రచనలకు ఇతివృత్తములుగ ఎన్నుకునేవాడు కాడు. కాని విభూతిభూషణ్ తమ రెండు

ఉత్తమ నవలల - 'పథేర్ పాంచాలి', 'అరణ్యక' - కు ఇటువంటి కథా వస్తువులనే ఎన్నుకున్నారు. ఆయన ఏ రచయిత ప్రభావానికి లోనుకాని విశిష్ట రచయిత, విమర్శనాపూర్వక విశ్లేషణలోను, మానవుల అంతరాంతరాలలో వున్న దుర్బుద్ధిని నిశితముగ పరిశోధించి వెలికితీయుటలోను మాణిక్ బంద్యోపాధ్యాయ ఉత్తమ కథానికలలో జగదీష్ గుప్త ప్రభావము కనిపిస్తుంది. ఈ ప్రభావాన్ని మినహాయిస్తే, మాణిక్ బంద్యోపాధ్యాయకూడ ఆనాటి బెంగాలి నవలా సాంప్రదాయానికి దూరముగ వుంటూనే వచ్చారు.

తారాశంకర్ విషయములో ఇది నిజము కాదు. తారాశంకర్ సాంప్రదాయబద్ధుడైన రచయిత. ఇతివృత్తాలను ఎన్నుకోవటములోను, పాత కాలపు విలువలను గౌరవించుటలోను, పురాణాలు, ఇతిహాసాలు తన సాహిత్య సృష్టికి ఉపయోగించుకోవటము లోను తన సాంప్రదాయకతను వెల్లడిస్తారు. మిగిలిన ఇద్దరు బంద్యోపాధ్యాయులు సాంప్రదాయక పద్ధతులను అవలంబించలేదు. బిభూతిభూషణ్‌కు పురాణ విజ్ఞానములో మంచి పాండిత్యము మాత్రము వుంది.

పాఠకుల ఆదరాభిమానములను ఎందువలన తారాశంకర్ సంపాదించ గలిగారు? ఈ ప్రశ్నకు సమాధానము ఆయన ఎన్నుకున్న ఇతివృత్తములపై ఆధారపడి వుంటుంది. తమ మూడు ఉత్తమ నవలలు, అశేష పాఠక లోకాన్ని ఆకర్షించటానికి, ఒక వృత్తిని గురించికాని, ఒక కుటుంబాన్ని గురించి కాని కాక ఒక జాతి జీవనాన్ని సంపూర్ణముగ చిత్రించుట వలన అవకాశము వుందని నిరూపిస్తాయి. పాఠకలోకానికి ఆమోద యోగ్యము కాని ఏ విషయాన్ని ఆయన ఇతి వృత్తముగ స్వీకరించలేదు. ఆయన మానవజాతి ప్రగతి గురించి పలుమార్లు రచనలు చేసారు. ప్రజా హృదయాల్లో బలముగ వేళ్లు దన్ని నిలచిన సాంప్రదాయాన్నికూడ ఆయన మనఃస్ఫూర్తిగ గౌరవించారు. పైగా, ఆయన తనకు స్వయముగ తెలిసిన పల్లెసీమలను గురించి రచనలు చేసారు. ఇందువలన, 1930—40 మధ్య కాలము నాటి పాఠకుల హృదయాలను అవలీలగ ఆకట్టుకో గలిగారు. ఆ పాఠకులలో చాలమంది గ్రామసీమలకు చెందినవారే. మేధావుల దృక్పథము తరువాతి కాలములోనే పట్నాల వాతావరణముచే ప్రభావితము కాజొచ్చినది. ఈ సందర్భములో ఒక విషయము ముచ్చటించటం అప్రస్తుతము కాక పోవచ్చు. వంగ సాహిత్యములో ఉత్తమ రచనలుగ పరిగణించబడే రచన

లన్నీ గ్రామాలలోని జీవితాలను ఇతివృత్తములుగ కలిగినవే! ముఖ్యముగ, నవలలన్నీ పల్లె వాతావరణాన్ని చిత్రించేవే! టాగోరు నవలలు మాత్రము ఇందుకు మినహాయింప దగినవి. ఆధునిక రచయితలు కూడ ఉదాత్తమైన రచనలు చేయాలని ప్రయత్నించి నప్పుడు జానపద కథావస్తువులనే ఎన్ను కుంటున్నారు. బహుశః మన అందరి మనసులలో పల్లెసీమలు స్థిరముగ నిలచివున్నాయేమో! కలకత్తాలో నాలుగుతరాలుగ నివసిస్తున్నప్పటికి కల కత్తా వాసులు చాలమంది ఈనాడుకూడ, 'నిజానికి మా స్వస్థలం ఫలానా పూరు' అని అనడం సాధారణముగ జరుగుతుంది.

తన రచనావ్యాసంగము ప్రారంభించేందుకు ముందే తారాశంకర్ ఈ విషయాలన్నీ ఆలోచించుకోలేదు. భావనాపరుడు, రచనావ్యాసంగ వ్యసనపరుడు అయిన తారాశంకర్, తనకు ప్రత్యక్షముగ తెలిసిన విష యాలనే కథావస్తువులుగ స్వీకరించారు. మానవ జీవిత భూగోళాన్ని మాన వులలోని ఔన్నత్యము, నీచత్వము సూచించే రేఖలను సాహిత్యములో ప్రదర్శించిన రచయితలలో ఆయన మొదటివారు కాకపోయినా, లెక్కింప దగినవారిలో ఒకరు. ఆయన రచించిన ఉత్తమ నవలలు ఈ విషయాన్ని నిరూపిస్తాయి.

గ్రామసీమలను, గ్రామస్థులను తమ నవలలలో చిత్రించడంలో ఆయన నూతన ప్రక్రియల నేమీ చేయలేదు. ఈయనకు ముందుగానే శరచ్చంద్ర ఛటర్జీ, ఇంకా అంత ప్రసిద్ధిచెందని రచయితలు గ్రామసీమలను గురించి వివరముగ రచనలు చేసారు. తారాశంకర్‌కు గ్రామసీమల గురించి వున్న గాఢమైన అవగాహన, విస్తృత దృక్పథము శరత్‌బాబుకు లేవు. శరత్ బాబులో చారిత్రక దృక్పథము కూడ తక్కువ.

తాను రచించిన కథావస్తువులతో ప్రత్యక్షపరిచయము తారాశంకర్ లోని ముఖ్యమైన సుగుణము. తన కథావస్తువు ఆయనకు అతి ప్రధాన మైనది. రచయితగ ఆయన సాధించిన విజయానికి ముఖ్య కారణము ఏమిటి? తాను ఎన్నుకున్న కథావస్తువును ఆయన మలచిన తీరు ఈ ముఖ్య కారణము. గ్రామంలో పుట్టి పెరిగిన తారాశంకర్ గ్రామాలలోని ఆర్థిక వ్యవస్థ పట్నాలలో విస్తృతముగ అభివృద్ధి పొందుచున్న ఆర్థిక విధానముల మూలమున విపరీతమైన మార్పులకు లోనవుచున్నదని ఆయన గ్రహించారు. బెంగాలులోని గ్రామాల వినాశానికి కలకత్తా, అచ్చటి పరి

సేరాలలోని పారిశ్రామిక వాడల విపరీతమైన వ్యాప్తి అని ఆయన భావించారు. కొన్ని ప్రాంతాలకే పరిమితమైన పారిశ్రామిక వ్యాప్తి దేశానికి సహాయకారి కాలేదు. ఇందువలన గ్రామాలలో దుర్భరదారిద్ర్యము తాండవించసాగింది. గ్రామాలలోని ఆర్థికాభివృద్ధి పూర్తిగ విస్మరించబడినదని ఆయన తెలుసు కున్నారు. వ్యావసాయిక దేశములో ఇటువంటి ధోరణి ప్రమాదకరమని ఆయన అభిప్రాయపడ్డారు. వ్యవసాయ కూలీలను భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు ఏ విధముగ పీల్చి పిప్పిచేస్తున్నారో, ఈ దుర్భర పరిస్థితుల మూలమున వారు జీవనోపాధిని వెదుక్కుంటూ గ్రామాలను వదలి వలస పోవటం తారాశంకర్ నవలలు మనకు విశదపరుస్తాయి. తనకు బాగా తెలిసిన ఈ విషమపరిస్థితులు ఆయన దృక్పథాన్ని ప్రభావితము చేసాయి.

తన కథావస్తువును చిత్రించటానికి, రైతువారీ విధానములో మొగలు సామ్రాజ్యము రోజులనుండి ఈనాటివరకు జరిగిన మార్పుల భోగట్టా సంపాదించుకున్నారు. ఇందుకోసం ఆయన చరిత్రను, అధికార పత్రాలను క్షుణ్ణముగ పరిశీలించారు. ఈ కృషి ప్రశంసనీయమైనది. ఇందువలననే, రైతాంగపు సమస్యలను ఆయన సాధికారముగ, యథార్థముగ చిత్రించ గలిగారు. భూమి విలువ నిర్ధారించుట, భూముల పంపిణీ విధానము, 'బార్గదారి' పద్ధతి, భూమి శిస్తులకు సంబంధించిన చట్టాలు, భూముల సర్వే అన్నీ ఆయనకు తెలుసు. తాళ్ళతో సర్వే చేయటం విడిచి పెట్టి, గొలుసులతో సర్వే చేయటం ఎప్పుడు ప్రారంభమయిందో ఆయనకు తెలుసు. భూముల కొలతల విషయములో కూడ 'కుడ' లేక 'కూడాబ' అనే కొలతను విడచి పెట్టి, 'బిఘా' (ఎకరంలో మూడవ భాగం) అనే కొలత ఎప్పుడు ప్రవేశ పెట్టబడిందో ఆయనకు తెలుసు. భూమి పన్నుల సంస్కరణ, లెవీ పద్ధతి, భూముల గరిష్ఠ పరిమితి ఆయనకు తెలుసు. భూమి శిస్తులను చెల్లించుటలో వున్న వివిధ పద్ధతులు కూడ ఆయనకు తెలుసు. ఈ పరిజ్ఞానము తన సాహిత్య సృష్టిలో మిగిలిన రచయితలందరి కంటె ఆయనకు ఎక్కువగ ఉపకరించింది. పల్లెసీమలు ఆయన దృష్టిలో ఊహల్లో మెరిసే ఛాయా సదృశములు కావు. పల్లెసీమలు ఆయన దృష్టిలో ప్రజలు, పొలాలు, పంటలు, వ్యవసాయ భూమి శిస్తులు, భూములనుండి వచ్చే ఆదాయము, వ్యవ సాయానికై చేసే అప్పులు, కాలవ నీటిపై పన్ను, పంటదిగుబడి కాకపోవ టము, క్షామము, వరదలు, నడుములు విరిగేలా పనిచేసే వ్యవసాయ కూలీల కాయకష్టము - ఇవన్నీ కలబోసిన వాస్తవికత.

ఆయనకు మత గ్రంథాలు, పురాణ గాథలు, ఇతిహాసాలు, జానపద విజ్ఞానము ఒకవైపు, తన నవలలలో నాయకులయిన సామాన్య ప్రజలు ఇంకొకవైపు సంపూర్ణము తెలుసు. ఆయన సృష్టించిన పాత్రలు నిజమైన ప్రజలు. తాను పండించిన పంట తాను అనుభవించలేనప్పుడు ముకుందపాల్ వంటి సామాన్య రైతు పడే ఆవేదన ఆయనకు తెలుసు. నసుబాలవంటి వింత మనిషి ఎలా ఆలోచిస్తాడో ఎలా ప్రవర్తిస్తాడో ఆయనకు తెలుసు. గ్రామస్థులంతా మంత్రకత్తెఅని పేరుపెట్టి వెలివేస్తే, ఏకాకియై, మృత్యువుకోసం ఎదురు చూసే వృద్ధస్త్రీ మనోవేదనకూడ ఆయనకు తెలుసు.

ఆయన తన రచనలలో చిత్రించిన ఇతివృత్తములను తాను ప్రత్యక్షముగ ఎరిగి వుండటమే నవలారచయితగ విజయము సాధించుటలోని పరమ రహస్యము. ఇటువంటి ప్రత్యక్ష పరిజ్ఞానము నవలా రచయితకు చాల అవసరమని ఆయన గట్టిగ విశ్వసించారు. ఈ విషయం ఆయన మరణానంతరము ప్రచురింపబడిన 'శతాబ్దిర్ మృత్యు' (ఒక శతాబ్దము అంతమైంది!) అనే నవలలో విశదమవుతుంది. ఈ నవలా రచనలో ఆయన బీరభూమి జిల్లాను విడచిపెట్టారు. కలకత్తాకు సమీపములోవున్న తన గ్రామాన్ని విడచి పెట్టి, కలకత్తాలో విద్యాభ్యాసానికై వచ్చిన ఒక బాలుని గురించిన కథ ఈ నవల. ఇందులోకూడ తారాశంకర్ ఒక నరగము పెరుగుదల, వ్యాప్తికి సంబంధించిన ఆసక్తికరమైన కాలాన్ని ఎన్నుకున్నారు. జమీందారీ కుటుంబాలపై అపవాదులు ప్రచారము చేస్తూ, ఆ వ్యవస్థను ఆవేశముతో విమర్శించుట సరిపోదని ఆయన భావించారు. ఈ నగరాలను సృష్టించినది ఆ వ్యవస్థ కాదు. కలకత్తా అనే నాగరక అరణ్యాన్ని సృష్టించినవారు వ్యాపారస్థులు, పారిశ్రామిక వేత్తలు. వ్యాపారము మూలముగ ధనవంతులైనవారు జమీందారుల వ్యసనాలను అనుకరించుటానికి ప్రయత్నము చేయుట నగరాల పతనానికిగాని, ఔన్నత్యానికి దారితీయదు. ఈనాటి పాఠకులకు ఈ విషయము చాల ఆసక్తి కలిగిస్తుంది. ఆర్థిక రంగములోని పరిశోధకుల ద్వారా, 18, 19 శతాబ్దములలో పారిశ్రామిక, వ్యాపార రంగాలలో బెంగాలివారు బాగా ముందంజ వేసారని తెలుస్తోంది. దేశములో చాల వ్యాపార సంస్థలను వారే నెలకొల్పారు. తమకు తామే పారిశ్రామికవేత్తలు ఏర్పరుచుకున్న నైతిక నియమాలను పాటించకుండ జమీందారుల దురలవాట్లను మాత్రము అనుకరించుటవలన రాష్ట్రములోని పారిశ్రామిక రంగపు ఆర్థిక విధానాన్ని

రూపొందించుటలో తమ పాత్రను సమర్థవంతముగ నిర్వహించలేక పోయారు. 19 వ శతాబ్దములో బెంగాలు పునర్వికాసమునకు, విలాస స్త్రీల కొరకై ధనాన్ని వెచ్చిస్తూ, ఇంటిలోని ఇల్లాళ్ళను అమానుషముగ అణచి పెట్టేవారు ఏనాటికి దోహదము చేయలేదని తారాశంకర్ నొక్కివక్కాణించారు. ఈ నవలా రచనలో తనకు బాగా తెలియని విషయాలను చర్చిస్తున్నానని ఆయనకు తెలుసు. అందువలన, నగర జీవితాన్ని గురించి, పరిస్థితులను గురించి బాగా చదివి, పరిశీలించి అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించారు.

సాహిత్య క్షేత్రములో ఉన్నత స్థానాన్ని సంపాదించటానికి, నవలా రచయితగ పేరు ప్రఖ్యాతులు పొందటానికి తారాశంకర్‌లో పై లక్షణాలు హేతువులు. వీటికి తోడు ఆయన కథాకథనము నిర్మోహమాటముగ, సూటిగ సాగుతుంది. మానవ హృదయాలలోని రసాత్మకత యందు, భీభత్సకర, వక్రతర భావనలయందు ఆయనకు అభినివేశము ఎక్కువ. వీటి చిత్రణవలన ఆయన పాఠకుల మనసులను దోచుకోగలిగేవారు. సామాన్య పాఠకులకు ఆయన కథలను విన సొంపుగ చెప్పేతీరు నచ్చేది. పాఠకులలోని ఆలోచనాపరులు ఆ రచనలోని లోతులను విశాల దృక్పథాలను దర్శించగలిగేవారు. ఆయన కథలలోను, నవలలలోను కనిపించే పాత్రలు అందరకు పరిచితమైనవే. అందువలన వారందరి దృష్టిని ఆకట్టుకోగలిగేవారు. కాని తారాశంకర్ నవలలను చదివేవరకు, ఆ ప్రజలను గురించి తా మెరిగినది చాల తక్కువ అని, తెలుసుకోవలసినది చాల వున్నదని వారు గ్రహిస్తారు.

తాను ప్రయోగించిన భాషకూడ తారాశంకర్‌కు చాల సహాయము చేసింది. ఆయన వాడిన భాషలో రమణీయత, నవ్యత, కళాత్మకత ఎక్కువ లేకపోవచ్చు కాని ఆభాష పదునైనది, విస్తృతమైనది. తత్సమ శబ్దాలతో వ్యావహారిక పదాలను ఆయన యధేచ్ఛగ కలిపి వాడారు. ఈ విషయములో ఆయన 16 వ శతాబ్దపు జానపదకవి. కవికంకణ ముకుందరామ్ చక్రవర్తిని జ్ఞాపకము చేస్తారు. ఈ మహాకవి ఉపయోగించిన భాషకూడ ఆయనకు సంస్కృత, వ్యావహారిక భాషలకు వున్న సన్నిహిత సంబంధాన్ని సూచిస్తుంది. మన గ్రామసీమలలో నిరక్షరాస్యులైన ప్రజలుకూడ సంస్కృతజన్యాలైన పదాలను తమ సంభాషణలో విరివిగ ఉపయోగిస్తారు. వారుపయోగించే పదజాలము మూలమున వారిపై పురాణాల, మహాకావ్యాల ప్రభా

వము స్పష్టము తెలుస్తుంది. వారి జీవన స్రవంతిలో ఈ విజ్ఞానము మేళవించి వుంటుంది. పైన వివరించినట్లుగ, సామాన్య ప్రజల వాడుకభాషను నవలలో ఉపయోగించిన వంగరచయితలలో తారాశంకర్ మొదటివాడు. ఈ విధముగ జీవభాషను తమ నవలలలో ఉపయోగించి, సాహితీరంగములో ప్రవేశించటానికి అంతవరకు అర్హముకాని వాడుక భాషకు సాహితీ గౌరవాన్ని కలిగించారు. అంతేకాక, తమ కృషివలన, జీవచ్ఛవముగ తయారవుతున్న వంగ భాషకు పునరుజ్జీవనము కలిగించారు. బెస్తవారిని గురించి, కృషీవలులను గురించి రచనలు చేయటానికి, వారు వాడే భాషను వుపయోగించటానికి, రచయితలు స్వయముగ బెస్తవారు, కృషీవలులు కానక్కర లేదు. మధ్యతరగతికి చెందిన రచయితలలో చాలమంది వారిని గురించి తారాశంకర్‌కు వున్న ప్రత్యక్ష పరిజ్ఞానము లేకపోవచ్చును. కాని వారు సామాన్య ప్రజల భాషను పరిశీలించి, నేర్చుకుని తమ రచనలలో ప్రయోగించ వచ్చును. ఈ నాటి రచయితలు చాలమంది ఈ పరిజ్ఞానము అవసరాన్ని గుర్తించినట్లు కనపడదు. తమకు వున్న పరిమితమైన అనుభవము మీద అధారపడే రచనలు చేయటానికి ఉపక్రమిస్తారు. అయితే, ఈ అనుభవమునకు నిజజీవితముతో సంబంధము చాల తక్కువ.

జానపద కథకుల మాదిరిగ, తారాశంకర్ తమ నవలలలో కథలను, తమ మూడు ఉత్తమ నవలలలో వలె, గొప్ప నిష్పాక్షిక దృష్టితోను, నిస్సంగత్వముతోను, చెప్పారు. ఇందువలన, ఆయన కథలకు చారిత్రక ప్రామాణ్యత లభించింది. పంచగ్రామాలను గురించి, కహార్ల జీవితాలను గురించి తారాశంకర్ కథలు చదువుతూంటే, చారిత్రక పరిశోధకుడు ఒక జాతి ఉన్నతి, పతనము, ఉనికి, మరల పునరుజ్జీవనము మనకు వివరిస్తున్నట్లుగ కనిపిస్తుంది. ఈ ప్రతిభ ఆయన రచించిన నవలల కోవలో విశిష్టమైన కళాత్మక ప్రక్రియ.

ఇవి ఈయన రచనలలోని సద్గుణాలయితే, వీటిలోని లోపాలు ఏమిటి? తమ కథలకు ఇతివృత్తాలను ఎన్నుకోవటములో తమ ప్రత్యక్షానుభవాలకు దూరముగ వెళ్లినప్పుడు ఆయన తమ పాఠకులను ఆకట్టుకోలేకపోయారు. తరువాత రోజులలో, తారాశంకర్ తాను నివసిస్తున్న పట్నవాసపు జీవితాన్ని గురించి విజయవంతముగ రచనలు చేయకపోలేదు. దేశ విభజన, ఆ సందర్భములో రేకెత్తిన మతకల్లోలాలు, భారతదేశ స్వాతం

త్ర్యావతరణ ఆయనను కదలించినాయి. కాని ఆ సంఘటనలకు సాహితీస్వరూపాన్ని ఇవ్వటానికి తగిన అవగాహన, అధికారము ఆయనకు లేకపోయాయి. 1933 వ సంవత్సరములో ఆయన కలకత్తాలో నివాసమేర్పరుచుకునే సమయానికి ఆయన వయసు ముప్పైఅయిదు సంవత్సరాలు. అప్పటికే ఆయన మానసిక ప్రవృత్తి, భావాలు సంపూర్ణముగ ఏర్పడ్డాయి.

ఆయన ఉత్తమ నవలలలో కూడ ఒక లోపము ఆయన జాతీయజీవనములో వ్యవసాయరంగ పాత్రను అవగాహన చేసుకున్నట్లుగ, పారిశ్రామిక రంగపాత్రను అర్థము చేసుకొనలేకపోవడం. జనాభాలెక్కలు, గణాంక శాఖ నివేదికలు బీరభూమి జిల్లాలో భారీపరిశ్రమ లేవీ లేవని తెలియజేస్తాయి. ఆ జిల్లాలో అనేక బియ్యపు మిల్లులు మాత్రము వుండేవి. రైల్వేస్టేషనులలో రైల్వే కార్ఖానాలు వుండేవి. ఈ వివరాలు నిజమైన పక్షంలో, ఆయన పాత్రలు పారిశ్రామిక వాడలకు ఎలా వలసపోగలిగేవి? దేశము పలు ప్రాంతాలలో పారిశ్రామిక రంగం వ్యవసాయ కూలీలను ఆకర్షిస్తోంది అన్న విషయం నిజం. కాని బీరభూమిలో మాత్రం ఇది వాస్తవం కాదు. అధికార వార్తల ప్రకారం, ఈ జిల్లాలో తక్కువ మంది తమ గ్రామాలను వదలిపెట్టి వెళ్లేవారు. తిండిలేకపోయినా వాళ్లు లెక్కచేసేవారు కారు. పారిశ్రామిక ప్రాంతాలకు వ్యవసాయ కూలీలు వలస పోవటం ఆయన మిగిలిన ప్రాంతాలలో పరిశీలించి, తమ నవలలలో ఈ విషయాన్ని ప్రవేశపెట్టి వుంటారు.

ఆయన రచనలలో శైలి గణనీయము కాదని పలువురు విమర్శించారు. ప్రేమేంద్రమిత్ర తన కథలలోను, మాణిక్ బంద్యోపాధ్యాయ 'పుతుల్ నాదేర్ ఇతికథ' లోను తీసుకున్నట్లుగ, తారాశంకర్ తమ శైలి విషయములో ఎక్కువ శ్రద్ధ తీసుకోలేదు. అయితే, తారాశంకర్ నవలలను ఎవరూ ఆయన శైలికోసం చదవరు. చాలమంది రచయితలు తమ అభిప్రాయాలను రమణీయ శైలిద్వారా వ్యక్తము చేస్తారు. తారాశంకర్ విషయములో ఆయన మనోభావాలకు ప్రాముఖ్యము ఎక్కువ. తమ మనోభావాలను ఏ శైలిలో వ్యక్తము చేయవలెననే విషయాన్ని ఆయన ఎక్కువ పట్టించుకునేవారు కారు. ఆయన సాహితీ భావాలు రసవత్తరముగ ఆయన రచించిన ఉత్తమ కథానికలలో వ్యక్తీకరింపబడుతూండేవి. ఆయన వాడే భాష, కథాకథన విధానము గ్రామసీమల ఇతివృత్తాలకు సరిపోయేది. కాని మిగిలిన కథావస్తువులకు ఏమాత్రము సరిపోయేది కాదు. ప్రస్తుత పరిస్థితులకు సంబంధించిన

క్షామము, యుద్ధము, మతకల్లోలములు, దేశవిభజన వంటి ఇతివృత్తములను గురించి రచనలు చేసేటప్పుడు, జీవితములోని వివిధ వృత్తులకు సంబంధించిన వ్యక్తులను చిత్రించేటప్పుడు, ఈ కాలపు ప్రజలు ఈ కాలపు ప్రత్యేక భాషను ఉపయోగిస్తారని గ్రహించాలి. తాత్కాలిక విషయాలను వర్ణిస్తూ, ఇతిహాసాలను, పురాణాలను ఏకరువుపెడితే సరిపోదు. ఇంకొక రకమైన పోలికలు, భావచిత్రణ ఈనాటి స్త్రీ పురుషుల సందిగ్ధావస్థను నిజముగ చిత్రించ గలిగేవేమో! కాలానుగుణముగ ఆయన ఆలోచనలు మార్పుచెందినప్పటికి, ఆయన వుపయోగించే భాష మార్పు చెందలేకపోయింది. తారాశంకర్ వంటి ప్రతిభావంతుడైన రచయిత తన శైలి విషయములో నిర్లక్ష్యము, తన భాష విషయములో క్లిష్టత ఎన్నో సంవత్సరాలుగ మార్పు చేసుకోకపోవటం దురదృష్టకరము. తన కథావస్తువున కనుగుణముగ తన శైలిని మెరుగుపరచుకొని, తన భాషలోని క్లిష్టతను విడనాడి తన రచనలలో అభివృద్ధికి ప్రయత్నము చేసివుంటే బాగుండేది.

తన నవలల నిర్మాణము, వాటి స్వరూప నిర్ణయము విషయములలో కూడ ఆయన ఎక్కువ శ్రద్ధ కనబరచలేదు. నవలా నిర్మాణ విషయములో 'గణదేవత', 'పంచగ్రామ', 'ధాత్రీదేవత' ఆయన రచన లన్నింటిలోను ఉత్తమ మైనవి. 'హన్సూలి బంకర్ ఉపకథ' తో సహా మిగిలిన నవలలన్నీ నిర్మాణవిషయములో లోపభూయిష్ట మైనవి. అవి అనవసరముగ ఎక్కువ నిడివిగ వుంటాయి. అవి పెద్దవైనకొద్దీ వాని నిర్మాణము మరింత లోపభూయిష్టముగ వుంటుంది. ఆయన రచించిన మూడు ఉత్తమ నవలలు మినహాయిస్తే, 'రాధ', 'మంజరి నృత్యనాటిక', 'నాగిని కన్యార్ కాహిని', 'ఆరోగ్య నికేతన్', 'యోగభ్రష్ట' వంటి ఆయన పెద్ద నవల లన్నింటిలోను కథలు, ఉపకథలు ఎక్కువ కనిపిస్తాయి. ఈ నవలలలో రచయిత ఒక ముఖ్యమైన కథను సూటిగ చెప్పలేకపోయారు. ఎన్నో ఉపకథలు ముఖ్య కథకు అడ్డు వచ్చి, రచయిత చెప్పదలుచుకున్నదేదో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. అందువలన, ఆయన రచనలలో పునరుక్తి దోషం పదేపదే కనిపిస్తుంది. అంతేకాక ఆయన రచనలలో తరచుగ అనవసరమైన భాషా ప్రదర్శన కనిపిస్తుంది. ఇందువలన, ఆయన రచనలు సులభగ్రాహ్యములు కావు. ఆయన ఉత్తమ కథానికలలో ఈ లోపాలు కనిపించవు.

ఆయన నవలల బాహ్యస్వరూపములోని లోపాలు ఇవి. ఆయన నవలలలోని కథావస్తువులు లోపభూయిష్టమైనవి కావు. లోపాలు ఏమైనా

వుంటే అవి ఆయన వ్యక్తిత్వానికి సంబంధించినవే! నైతిక ప్రమాణాలపైన, సాంప్రదాయముపైన ఆయన చూపించిన అత్యంత అభిమానము ఆధునిక పాఠకులకు లోపముగ కనిపించ వచ్చు. సాంప్రదాయముపైన, బ్రాహ్మణుల సదాచార పరాయణత్వముపైన ఆయనకున్న గౌరవముతో మనకే పేచీ లేదు. కాని నేటి సంఘములోని దురాచారాలన్నింటికి పాశ్చాత్య జీవన విధానమును భారతీయులు అనుకరించుటే కారణమనే ఆయన అభిప్రాయము అంత సమర్థనీయము కాదు. పాశ్చాత్య ధోరణులను విమర్శించాలనే వుద్దేశము తోనే, 'సప్త పడి' అనే నవలలో, ఒక జిల్లాలోని చిన్న మేజిస్ట్రేటు అయిన ఆ నవలలోని నాయకుడు పూర్తిగ పాశ్చాత్య పద్ధతిలో జీవిస్తున్నట్లు ఆయన చిత్రిస్తారు! ఆ మేజిస్ట్రేటు తనకొచ్చే కొద్దిపాటి జీతముతో పాశ్చాత్య పద్ధతిలో జీవించటం అసాధ్యం. ఇటువంటి విషయాల్లో తారాశంకర్ వాస్తవిక దృష్టి లోపించినట్లుగ కనిపిస్తుంది. మన విద్యావిధానములో ఆంగ్ల భాషను ప్రవేశపెట్టుటవలన, మనదేశములో ఆధునిక జీవన విధానము వ్యాపించుటవలన మన జీవితాలు అధ్వాన్నమయ్యాయని ఆయన నిజంగా విశ్వసించారా? ఆధునిక మానవుణ్ని ఆయన పూర్తిగ అర్థం చేసుకోలేక పోయారు. ఈనాటి నాగరకులైన మనుషులు ఏ విధముగ మాట్లాడుతారో, ప్రవర్తిస్తారో ఆయనకు బొత్తుగ తెలియదు. ఆయన దృష్టిలో ఆధునిక మానవుని కష్టాలకు అతని నాస్తికతే కారణం! కాని నిజానికి ఈనాటి మానవుడు నిరుద్యోగము, దారిద్ర్యము, ఆకలి, ఆకాశాన్ని అంటుతున్న ధరల వంటి అనేక దుర్భర పరిస్థితులవలన బాధ పడుతున్నారు. ఇవన్నీ అతని నాస్తికత వలననే ఉత్పన్న మవుతున్నాయని చెప్పలేము. విధిని పూర్తిగ విశ్వసించే భారతదేశములో కూడ, భగవంతుడు ధనవంతులకు మాత్రమే లభించే విలాస వస్తువుగ, పేదలకు ఆఖరి ఆసరాగా మాత్రమే ఈనాడు మిగిలివున్నాడు. ఈనాటి విద్యాధికులకు భగవంతుని గురించి ఆలోచించటానికి వ్యవధి ఎంత వరకు లభిస్తోంది? అధిక భోగభాగ్యాలవలన తమ ఉనికినే మరచిపోయే వారిని తమ నవలలలో చిత్రించాలని ఆయన ప్రయత్నించారేమో తెలియదు. ఆయన నవలలలో మాత్రము అటువంటివారు మనకు స్పష్టముగ కనిపించరు. అదీకాక, యధార్థవిషయమేమిటంటే, మనదేశంలో ధనాధిక్యతవలన వక్రమనస్కులైనవారు అసలు లేరనే చెప్పాలి.

ఆయన రచనలలోని లోపాలు ఇవి. ఆయన రచనలలోని సుగుణాలు లోపాలకంటె చాల ఎక్కువ. ఈనాటి పాఠకులు ఆయన రచనల ఊపరి

తలాన్నే స్పృశించి, అంతస్సత్వాలను దర్శించటానికి ప్రయత్నము చేయక పోవటం దురదృష్టకరం. ఆయన రచించిన మూడు ఉత్తమ నవలలు ఆయనకు సాహిత్యసీమలో శాశ్వతస్థానాన్ని సంపాదించి పెడతాయి. ఈ నవలలను చదివి మనం భారతదేశ పునర్దర్శనం చేసుకోగలుగుతాము. అసంఖ్యాక గ్రామసీమలలో ఊపిరి పీలుస్తున్న భారతదేశం మన కాయన రచనలలో సాక్షాత్కరిస్తుంది. మిగిలిన రచయితలకంటె ఆయన చిరస్థాయిగ నిలవగలడు. అందుకు కారణము వంగ సాహిత్యసీమలోని కొద్దిమంది నిజమైన భారతీయ రచయితలలో ఆయన ప్రముఖులు. మిగిలిన రచయితలు ఆయన చూపించిన మార్గములో ముందుకు పయనించగలరా? అనే ప్రశ్నకు జవాబివ్వటం కష్టము. అందుకు ఆయనకున్న సాహసము, మనోధైర్యము, తానెన్నుకున్న వృత్తిలో సంపూర్ణ నిమగ్నత, అభినివేశము మిగిలిన రచయితలలో కూడ అవసరము. అది అనితర సాధ్యము. సాహితీ రంగములో ఉత్తమ రచయితల కాలము అంతరించింది. పశ్చిమ బెంగాలులోని మానసిక సంక్షోభ క్షుభితమైన సంఘము మళ్లీ రచయితలలో ఒక నూతన తరాన్ని సృష్టిస్తుందనీ, ఒక జాతిప్రజల బాధామయ జీవితాన్ని, ఒక దేశములోని పేదరికాన్ని, పెనుగులాటను రసవత్తరముగ చిత్రించే సమయములో, వారికి తెలియకుండానే తారాశంకర్ అడుగు జాడలలో నడుస్తారని ఆశిద్దాం. అణువణువునా భారతీయతతో తొణికిసలాడే నూతన తరం రచయితలు ఆవిర్భవించి నపుడు తారాశంకర్ సాహిత్య కృషికి సంపూర్ణ సార్థకత లభిస్తుంది. అంతవరకు మనం వేచి వుందాం!

# తారాశంకర్ బంద్యోపాధ్యాయ రచనలు

1. త్రిపత్ర (మూడాకులు). పద్య సంపుటి - 1926
2. చైతాలి ఘూర్ని (చైత్రఝంఝ) నవల - 1932
3. పాషాణ్ పురి (చెరసాల) నవల - 1933
4. నీలకంఠ (శివుని పేర్లలో ఒకటి) నవల - 1933
5. రాయ్‌కమల (కథానాయిక పేరు) నవల - 1935
6. ప్రేమ ఓ ప్రయోజోన్ (ప్రేమ - ప్రయోజనం) నవల - 1936
7. ఛ్ఛలనమోయి (అంతుచిక్కని వ్యక్తి) కథలు - 1937
8. జలసాఘర్ (విలాస మందిరము) కథలు - 1938
9. అగున్ (అగ్ని) నవల - 1938
10. రసకలి (చందన తిలకం) కథా సంపుటి - 1939
11. ధాత్రీదేవత, నవల - 1939
12. కాళింది, నవల - 1940
13. తీన్ శూన్యో (మూడు సున్నాలు) - 1942
14. కాళింది, నాటిక - 1942
15. దుయి పురుష్, నాటిక - 1943
16. గణదేవత, (ప్రజలు - భగవంతుడు) నవల 1943
17. పథేర్ డాక్, (రస్తాల పిలుపు) నాటిక - 1943
18. ప్రతి ధ్వని, కథా సంపుటి - 1943
19. బేదెని, (జిప్సీ స్త్రీ) కథానికలు - 1943
20. దిల్లికా లడ్డు, (ఢిల్లీ లడ్డూలు) కథానికలు - 1943
21. మన్వంతర్, (క్షామం) నవల - 1944
22. పంచగ్రామ్, (ఐదు గ్రామాల కథ) నవల - 1944
23. జాదూకరి, (మంత్రకత్తె) కథానికలు - 1944
24. స్థలపద్మ, కథానికలు - 1944
25. కవి, నవల - 1944
26. తేరోషో పాంచష్, (పదమూడు ఏభై) కథలు - 1944

27. బింగషా శతాబ్ది, (పన్నెండవ శతాబ్దం) - 1945
28. చెక్ మకి, (చెకుముకిరాయి) హాస్య నాటిక - 1945
29. ద్వీపాంతర్, (ద్వీపాంతరవాస శిక్ష) నాటిక - 1945
30. ప్రషాద్ మాల, (పూల మాల) కథలు - 1945
31. హరాన్ సూర్, (పోగొట్టుకొన్న రాగం) కథలు - 1945
32. సాందీపని పాఠశాల, నవల - 1946
33. ఝూర్ ఒ ఝూర్ పత్ర, (తుఫాను - రాలిన ఆకులు) నవల - 1945
34. అభిజాన్, (శిఖరారోహణ) నవల - 1946
35. ఇమారత్, (అంతఃపుర గోపురము) కథలు - 1947
36. రామధను, (ఇంద్రధనుస్సు) కథానికలు - 1947
37. తారాశంకరేర్ శ్రేష్ఠగల్పో, (తారాశంకర్ ఉత్తమ కథానికలు) - 1947
38. శ్రీపంచమ. (మాఘ పంచమి) కథాసంపుటి
39. సాందీపని పాఠశాల, (బాలురకోసం ప్రత్యేకముగ రచింపబడినది) నవల - 1948
40. కామధేను, కథానికలు - 1949
41. పదచిహ్న, (పాదచిహ్నలు) - 1949
42. తారాశంకర్ బందోపాధ్యాయేర్ శ్రేష్ఠ గల్పో, (తారాశంకర్ బంద్యోపాధ్యాయ ఉత్తమ కథానికలు) కథలు - 1950
43. ఉత్తరాయణ్, నవల - 1940
44. మతి, (భూదేవి) కథానికలు - 1950
45. అమర్ కాలేర్ కథ, (నా రోజులు) జ్ఞాపకాలు - 1951
46. హన్సూలి బంకర్ ఉపకథ, (కొడవలి వంపు కథ) నవల - 1951
47. యుగబిప్లబ్, (యుగ విప్లవం) నాటిక - 1951
48. 'శిలాసన్', కథానికలు - 1952
49. తమస్ తపస్య, (చీకటి తపస్సు) నవల - 1952
50. నాగిని కన్యార్ కహిని, (నాగకన్య కథ) నవల - 1952
51. బిచిత్రస్మృతి కహాని, (స్మృతిపథంలో విచిత్రాలు) జ్ఞాపకాలు - 1953
52. ఆరోగ్య నికేతన్, (ఒక వైద్యశాల పేరు) నవల - 1953
53. అమార్ సాహిత్య జీబన్, (నా సాహితీ జీవితం) జ్ఞాపకాలు - 1953
54. తారాశంకర్ బంద్యోపాధ్యాయేర్ ప్రియ గల్పో (తారాశంకర్ బంద్యోపాధ్యాయకి ప్రీతిపాత్రములైన కథానికలు) కథానికలు - 1953

55. స్వ-నిర్వచిత గల్ప, (రచయిత స్వయముగ ఎన్నుకున్న కథానికలు) కథానికలు - 1954
56. చంపడంగర్ ఒ ఊ, (చంపదంగ పెళ్లికూతురు) నవల - 1954
57. గల్పసంచయన్, (కథానికా సంపుటి) - 1955
58. బిష్ఫోరణ్, (విజృంభణ) కథానికలు - 1955
59. కైషోర్ స్మృతి. (శైశవ స్మృతి) జ్ఞాపకాలు - 1956
60. పంచ పుత్తలి, (ఐదు ఆట బొమ్మలు) నవల - 1956
61. ఛోటోదేర్ శ్రేష్ఠ గల్ప, (చిన్న పిల్లలకు ఉత్తమ కథలు) - 1956
62. కాలాంతర్, (యుగసంధ) కథలు - 1956
63. కవి- నాటిక - 1957
64. బిచారక్, (న్యాయమూర్తి) నవల - 1957
65. కాళరాత్రి, నాటిక - 1957
66. బిష్పథర్, (పాము విషానికి విరుగుడుగ ఉపయోగించే రాయి) కథలు - 1957
67. సప్తపది, నవల - 1958
68. బిపాష, (బియాస్ నదిపేరు గల కథానాయిక) నవల - 1959
69. రాధ, నవల - 1959
70. మనుషేర్ మన్, (మనుషుల మనసు) నవల - 1959
71. డాక్ హర్కర, (పోస్టల్ రన్నరు) నవల - 1959
72. రచనా సంగ్రహ, (రచనల సంపుటి) మొదటి భాగం - 1959
73. రబివారేర్ అసర్, (ఆదివారపు సమావేశం) కథలు - 1959
74. మాస్కో తె కయిర్ దిన్, (మాస్కోలో కొన్నిరోజులు) పర్యటన గ్రంథం - 1959
75. మహాశ్వేత, (బాణభట్టుని 'కాదంబరి'లోని నిష్కలంక స్త్రీ మూర్తి పాత్ర వలె పవిత్రురాలైన కథానాయిక) నవల - 1961
76. యోగభ్రష్ట, నవల - 1961
77. ప్రేమేర్ గల్ప, (ప్రేమ కథలు) - కథలు - 1961
78. పోష లక్ష్మి, (పోష్య లక్ష్మి) కథలు - 1961
79. ఆలోకబిషార్, (కాంతికి పయనం) కథలు
80. నా, (వద్దు!) నవల - 1961

81. సాహిత్యేర్ సత్య, (సాహిత్యంలో సత్యము) విమర్శకవ్యాసం - 1961
82. నాగరిక్, (పురజనులు) నవల - 1961
83. నిషి పద్మ, (రాత్రి వికసించే పద్మం) నవల - 1962
84. చిరంతని, (అనంతం) కథలు - 1962
85. యతి భంగ, (నియమ భంగం) నవల - 1962
86. ఏక్సిడెంటు, (ప్రమాదం) కథలు - 1962
87. సంఘట్, (సంఘర్షణ) నాటిక - 1962
88. ఛోటోదేర్ భటో భలోగల్ప, (చిన్న పిల్లలకై ఎన్నిక చేయబడిన కథలు) కథలు - 1962
89. అమర్ సాహిత్య జీబన్, (నా సాహిత్య జీవితం) రెండవ భాగం జ్ఞాపకాలు - 1962
90. కన్న, (కన్నీళ్లు) నవల - 1962
91. తమాషా, కథలు - 1963
92. కాల్ బైశాఖి, (వేసవి తుఫాను) నవల - 1963
93. భారతబర్ష ఒ చీన్, (భారతదేశము - చైనా) వ్యాసము - 1963
94. గల్ప పంచశత, (ఏభయి కథలు) కథలు - 1963
95. ఏక్టి చోరుయి పాఖి ఒ కాలో మేయి, (ఒక పిచ్చిక - నల్ల పిల్ల) నవల - 1963
96. ఆయెన, (దర్పణం) కథానికలు 1963
97. జంగల్ ఘర్, (అడవిలో కోట) నవల - 1964
98. ఛిన్మోయి, (ఒక అమ్మాయి పేరు) కథలు - 1964
99. మంజరి నృత్య నాటిక, నవల - 1964
100. సంకేత్, (సంకేతం) నవల - 1964
101. భుబనపురేర్ హాత్, (భువన పురంలోని సంత) నవల - 1964
102. బంతరాగ్, (వసంత రాగం) నవల - 1964
103. ఏక్తి ప్రేమేర్ గల్ప, (ఒక ప్రేమ కథ) కథలు - 1965
104. స్వర్గ మర్త్య, (స్వర్గం -భూమి) నవల - 1965
105. బిచిత్ర, (విచిత్రం) నవల - 1965
106. గన్నా బెగమ్, నవల - 1965
107. అరణ్య బన్హి, (దావానలం) నవల - 1965
108. హీర పన్నా, (వజ్రం - రత్నం) నవల 1966

109. కిషోరె సంచయన్, (బాలలకు కథాగుచ్ఛము) కథలు - 1966
110. మహానగరి, (ముఖ్యపట్టణం) నవల - 1966
111. గురు దక్షిణ, నవల - 1966
112. తపోభంగ, కథలు
113. దీపార్ ప్రేమ్, (దీప ప్రేమ) కథలు - 1966
114. నారీ రహస్యోమోయి, (అర్థంకాని స్త్రీ) కథలు - 1967
115. పంచకన్యా, (ఐదుగురు అమ్మాయిలు) కథలు - 1967
116. షుకశారి కథ, (శుక — శారి కథ) నవల - 1967
117. షిబినీర్ ఆదృష్ట, (శివాని అదృష్టం) కథలు - 1967
118. షక్కర్ బాయి, (నాయిక పేరు) నవల - 1967
119. గోబిన్ సింఘేర్ ఘోర, (గోబిన్ సింగు గుఱ్ఱం) కథలు - 1968
120. జయ, (ఒక యువతి పేరు) కథలు - 1968
121. ఆరోగ్య నికేతన్, నాటిక - 1968
122. ఏక్ పాష్లా బృష్టి, (వర్షపాతం) కథలు - 1969
123. మోని బౌది, (వదిన మోని) కథలు - 1969
124. చోటోదేర శ్రేష్ఠగల్ప, (బాలల ఉత్తమ కథలు) కథలు - 1969
125. మిఛిల్, (ఊరేగింపు) కథలు - 1969
126. ఛాయాపథ్, (పాలపుంత) కథలు 1969
127. కాళరాత్రి, నవల - 1970
128. రూపసి బిహంగిని, (అందమైన పక్షి) నవల - 1970
129. అబినేత్రి, నవల - 1970
130. ఫరియాద్, (ఫిర్యాదు) నవల 1971
131. రబీంద్రనాథ్ ఒ బంగ్లార్ పల్లి, (రవీంద్రుడు బెంగాలులోని పల్లె సీమలు) విమర్శనాత్మక వ్యాసం - 1971
132. ఉనిష్ షో ఎకత్తర్ (1971) రెండు కథలు 1971
133. శతాబ్దిర్ మృత్యు. (ఒక శతాబ్దం అంతరించింది) నవల - 1971
134. కిష్కింధ్యా కాండో, (కిష్కింధా కాండ) పిల్లల నవల - 1972

# జీవిత సంగ్రహం

తారాశంకర్ బంద్యోపాధ్యాయ బీరభూమిజిల్లా, లాభపూరులోని తమ పూర్వీకుల గృహములో 1898 వ సంవత్సరము జూలై నెల 23 వ తేదీన జన్మించారు. ఆయన తండ్రి హరదాస బంద్యోపాధ్యాయ 1905 వ సంవత్సరములో స్వర్గస్థులయ్యారు. తల్లి ప్రభావతీదేవి 1969 వ సంవత్సరములో మరణించారు. లాభపూరులోని జాదవ్ లాల్ ఉన్నత పాఠశాలలో 1906వ సంవత్సరములో మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. కలకత్తాలో సెంటుగ్జావియరు కళాశాలలో ఆయన మొదట ప్రవేశించారు. తరువాత దక్షిణ సబర్బన్ కళాశాలలో చేరారు. కాని అనారోగ్య కారణాల మూలమున రాజకీయ కార్యకలాపముల మూలమున ఆయన కళాశాలలో విద్య కొనసాగించలేకపోయారు.

1916 వ సంవత్సరములో ఆయన ఉమాశశిదేవిని వివాహ మాడారు. 1918 లో ఆయన పెద్దకుమారుడు సనత్ కుమార్ జన్మించాడు. ఆఖరి కొడుకు శరత్ కుమార్ 1922 లో జన్మించాడు. ఆయన పెద్దకుమార్తె గంగ, 1924 లో జన్మించింది. రెండవ కుమార్తె, బులు, 1926 లో జన్మించింది. ఆఖరి కుమార్తె, బని, 1932 లో జన్మించింది. ఆ సంవత్సరమే బులు మరణించింది.

1930 లో ఆయన అరెస్టు చేయబడ్డారు. డిసెంబరు నెలలో విడుదల చేయబడ్డారు. 1932 లో ఆయన మొదటి పర్యాయము శాంతినికేతన్‌లో టాగోరును కలుసుకున్నారు. ఆయన మొదటి నవల, 'చైతాలి ఘూర్ని', ఆ సంవత్సరమే ప్రచురించబడింది.

1935 లో లాభపూరు ప్రజలు ఆయనకు ఘనసన్మానము చేసారు. 1937 లో రెండవ పర్యాయము వారు ఆయనను సన్మానించారు. 1940 లో కలకత్తాలోని బాఘ్ బజారులో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని తమ కుటుంబాన్ని పిలిపించుకున్నారు. 1941 లో కలకత్తా శివార్లలోవున్న బారనాగోరుకు తమ నివాసము మార్చారు. 1942 లో బీరభూమి జిల్లా సాహిత్య సమ్మేళనములో సాహితీ విభాగానికి అధ్యక్షత వహించారు. 1942 లోనే ఫాసిస్టు వ్యతిరేక రచయితల, కళాకారుల సంఘానికి అధ్యక్షులుగ వ్యవహరించారు.

1944 లో కాన్పూరు ప్రవాసి సాహిత్య సమ్మేళనములో సాహితీ విభాగానికి అధ్యక్షత వహించారు. 1947 లో కలకత్తాలో జరిగిన ప్రవాసి సాహిత్య సమ్మేళనములో ప్రారంభోపన్యాసము చేసారు. ఆ సంవత్సరమే బొంబాయిలో జరిగిన ప్రవాసి సాహిత్య సమ్మేళనము రజతోత్సవాలలో సాహితీ విభాగానికి అధ్యక్షులుగ వ్యవహరించారు. 1947 లోనే కలకత్తా విశ్వవిద్యాలయము ఆయనకు శరత్ స్మారక పతకము బహూకరించింది. 1947 వ సంవత్సరము జూలై నెలలో, ఆయన ఏభయవ జన్మదిన సందర్భముగ బెంగాలులోని రచయితలు ఆయనను మహావైభవముగ సన్మానించారు. 1948 లో తాలపార్కులో తాను నిర్మించుకున్న నూతన గృహములో ఆయన ప్రవేశించారు.

1951 లో రష్యాను సందర్శించమని వచ్చిన ఆహ్వానాన్ని ఆయన అంగీకరించలేదు. 1952 లో ఆయన రాష్ట్ర శాసన సభ సభ్యులుగ నియమింప బడ్డారు.

1954 లో ఆయన తమ మాతృమూర్తినుండి దీక్ష స్వీకరించారు. 1955 లో పశ్చిమ బెంగాలు ప్రభుత్వము ఆయనకు రవీంద్ర స్మారక పతకాన్ని ప్రదానము చేసింది. 1956 లో భారత ప్రభుత్వము చైనా రచయిత, లు - షూన్, వర్ధ్యంత్యుత్సవాలలో పాల్గొనటానికి ఆయనను చైనా పంపించింది. కాని అనారోగ్య కారణమువలన ఆయన రంగూన్ నుండి తిరిగి వచ్చేయవలసి వస్తుంది. ఆ సంవత్సరమే ఆయనకు సాహిత్య అకాదెమి బహుమతి లభించింది. 1957 లో చైనా ప్రభుత్వ ఆహ్వానముపై ఆయన చైనాలో పర్యటించారు. 1958 లో ఆఫ్రికా - ఆసియా రచయితల సమావేశానికి ఏర్పాట్లను పర్యవేక్షించటానికి రష్యా వెళ్లారు. అదే సంవత్సరము ఆఫ్రికా - ఆసియా రచయిత సమావేశానికి భారత ప్రతినిధి వర్గానికి నాయకులుగ ఆయన తాష్కెంటు వెళ్లారు.

1959 లో కలకత్తా విశ్వవిద్యాలయమునుండి ఆయనకు జగత్తరిణి స్వర్ణపతకము లభించింది. అదే సంవత్సరము మద్రాసులో జరిగిన అఖిల భారత రచయితల సమావేశానికి ఆయన అధ్యక్షత వహించారు. 1960 లో ఆయన రాష్ట్రశాసన సభ సభ్యులుగ పదవీవిరమణ చేసారు. భారత రాష్ట్రపతి ఆయనను పార్లమెంటు సభ్యులుగ నియమించారు. ఆ గౌరవాన్ని పురస్కరించుకుని, హౌరా సమీపములోని బాంద్రా ప్రాంత నివాసులు ఆయనకు

సన్మానము చేసారు. ఆ సంవత్సరమే లాభపూరు వాసులు ఆయనకు మూడవసారి సన్మానము చేసారు. 1962 లో భారత ప్రభుత్వము ఆయనకు 'పద్మశ్రీ' ప్రదానము చేసారు. ఆ సంవత్సరము ఆయన అల్లుడు, శాంతి శంకర ముఖర్జీ మరణించారు. ఈ హఠాన్మరణము ఆయనకు అపరిమిత మైన విషాదాన్ని కలిగించింది. ఆ విషాదమునుండి దృష్టిని మరల్చుకోవ టానికి ఆయన చిత్రలేఖనము, కొయ్యతో ఆటవస్తువులు తయారు చేయుట మొదలు పెట్టారు. 1963 లో ఆయనకు శిశిర్ కుమార్ బహుమతి లభించింది. 1966 లో ఆయన పార్లమెంటు సభ్యునిగ పదవీ విరమణ చేసారు. అదే సంవత్సరము నాగపూరు వంగ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత వహిం చారు. 1967 లో ఆయన జ్ఞానపీఠ బహుమతిని అందుకున్నారు. ఈ సంద ర్భములో కలకత్తా కార్పొరేషనువారు ఆయనకు ఘనసన్మానము చేసారు.

ఆయన డెబ్భైయవ జన్మదినోత్సవ సందర్భములో పశ్చిమ బెంగాలు ప్రజలు 'మహాజతి సదన్' లో ఆయనకు అపూర్వ సన్మానము చేసారు. 1968 లో భారత ప్రభుత్వము ఆయనకు 'పద్మభూషణ్' ప్రదానము చేసింది. ఆ సంవత్సరములోనే కలకత్తా విశ్వవిద్యాలయము, జాదవపూరు విశ్వవిద్యాలయము ఆయనకు గౌరవ డాక్టరేటు పట్టాల నిచ్చి గౌరవించాయి. 1969 వ సంవత్సరములో ఆయనకు సాహిత్య అకాడెమి గౌరవ సభ్యత్వము లభించింది. ఆ సంవత్సరమే ఆయన వంగసాహిత్య పరిషత్తుకు అధ్యక్షులు అయ్యారు. సాహిత్య త్రైమాసిక పత్రిక, 'శతరూప', సంపాదక వర్గానికి అధ్యక్షులుగ కూడ నియమింపబడ్డారు. 1970 లో ఆయనకు లాభపూరు ప్రజలు నాల్గవ పర్యాయము సన్మానము చేసారు. 1971 లో విశ్వభారతి విశ్వవిద్యాలయము వారి ఆహ్వానముపై నృపేంద్రచంద్ర స్మారకోపన్యాసాలు ఇచ్చారు. కలకత్తా విశ్వవిద్యాలయమువారు ఆయనను ద్విజేంద్రలాల్ రాయ్ స్మారకోపన్యాసముల నీయవలసినదిగ ఆహ్వానించారు.

1971 వ సంవత్సరము జూలై నెలలో నాసికారంధ్రము, దవడ ఎముకలలోను 'సైనుస్' అనే వ్యాధితో బాధపడటం మొదలుపెట్టారు. ఆగస్టు 13 వ తేదీన అకస్మాత్తుగ ఆయన తెలివి కోల్పోయారు. అయితే, ఆ సాయంత్రానికి మళ్లీ తెలివిలోకి వచ్చారు. సెప్టెంబరు 17వ తారీఖు వరకు ఆయన కులాసాగానే వున్నారు. మళ్లీ వ్యాధి తిరగబెట్టింది. సెప్టెంబరు 17 వ తేదీన ప్రభాత సమయములో తారాశంకర్ పరమపదించారు. ఆయన అంత్యక్రియలు శ్రీఘ్రర కలకత్తాలోని నిమ్తల శ్మశానవాటికలో ఆయన పెద్దకుమారుడు, సనత్ కుమార్ బంద్యోపాధ్యాయ నిర్వహించారు.